# శ్రీ వివేకానంద లేఖావళి

## మొదటి భాగము

అనువాదకుడు :

శ్రీ చిరంతనానందస్వామి



పీఠికా రచయిత :

ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులగు

డాక్టర్, సర్ కట్టమంచి రామలింగారెడ్డి






శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు

శ్రీ కృష్ణ దేవరాయ ఆంధ్ర భాషానిలయము,

విభాగము ..................................................

విభాగ సంఖ్య ..................................................

# విజ్ఞప్తి

వివేకానంద లేఖావళి వివేకానంద హృదయదర్పణము; భారతదేశ భక్తులకే కాక, భారతవర్ష పునర్నిర్మాణకర్తల కెల్లరకును మార్గదర్శిని; భారతీయులు దేశభక్తిరహితులై, స్వధర్మచ్యుతులై, పాశ్చాత్య నాగరికతావ్యామోహితులై యుండగ, భారతీయ వైజ్ఞానిక వియత్తలమున మెఱసిన విద్యుల్లేఖావళి.

Letters of Swami Vivekananda అను గ్రంథమునకు మా యనువాదమగు దీనిని రెండుభాగములుగాఁ బ్రకటించుచున్నాము. సాధ్యమైనంతవఱకు వెల తగ్గించి జనుల కందుబాటులో నుంచునట్లు చేయు తలంపున, మూలమునఁ జదువరుల కంతగాఁ బ్రయోజనకరము కాని కొలఁది లేఖలను, అట్టి భాగములను విడిచినను ముఖ్యమగు వాని నన్నిటిని * వెలువరించి యున్నాము.

ఎంతటి కార్యనిమగ్నులై యున్నను, ఎట్లో తీఱిక చేసికొని యీ లేఖావళికిఁ బీఠిక వ్రాసిన డాక్టర్, సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారికి శ్రీ రామకృష్ణభగవానుఁడు చిరాయురారోగ్యాదులను బ్రసాదించి వారిచే నితోధిక దేశ భాషాసేవలను జేయించుఁగాక!

---

* ఇందలి లేఖాసంఖ్యలను దాని యెదురుగా (ఆంగ్ల) మూలము (మూఁడవకూర్పు) నందలి లేఖాసంఖ్యలను దిగువఁ బొందుపఱుచుచున్నాము:

# విజ్ఞప్తి

ఈ గ్రంథ ప్రథమ ముద్రణార్థము గుంటూరు జిల్లా, చినపాలెము కాపురస్థులు శ్రీ వాళిరెడ్డి వెంకయ్యగారి కుమారుఁడు శ్రీ వేంకటసుబ్బయ్యగారును, శ్రీ వా. రామస్వామిగారి కుమారుఁడు శ్రీ వెంకయ్యగారును ఒకింత ధన సాహాయ్యము చేసియున్నారు. శ్రీ రామకృష్ణదేవుఁడు వారి ననుగ్రహించుఁగాక !

అనువాదకుఁడు.

| | | | |
|---|---|---|---|
| 1 : 1 | 20 : 33 | 39 : 59 | 58 : 85 |
| 2 : 2 | 21 : 35 | 40 : 60 | 59 : 86 |
| 3 : 4 | 22 : 39 | 41 : 61 | 60 : 87 |
| 4 : 5 | 23 : 40 | 42 : 62 | 61 : 88 |
| 5 : 7 | 24 : 41 | 43 : 63 | 62 : 89 |
| 6 : 8 | 25 : 42 | 44 : 64 | 63 : 90 |
| 7 : 9 | 26 : 44 | 45 : 67 | 64 : 91 |
| 8 : 10 | 27 : 47 | 46 : 68 | 65 : 92 |
| 9 : 14 | 28 : 48 | 47 : 69 | 66 : 94 |
| 10 : 17 | 29 : 49 | 48 : 70 | 67 : 95 |
| 11 : 18 | 30 : 50 | 49 : 71 | 68 : 96 |
| 12 : 21 | 31 : 51 | 50 : 73 | 69 : 97 |
| 13 : 22 | 32 : 52 | 51 : 74 | 70 : 98 |
| 14 : 23 | 33 : 53 | 52 : 75 | 71 : 99 |
| 15 : 26 | 34 : 54 | 53 : 77 | 72 : 100 |
| 16 : 27 | 35 : 55 | 54 : 78 | 73 : 101 |
| 17 : 29 | 36 : 56 | 55 : 79 | 74 : 102 |
| 18 : 31 | 37 : 57 | 56 : 81 | 75 : 103 |
| 19 : 32 | 38 : 58 | 57 : 84 | |

# పీఠిక

చిరంతనానందస్వాములవా రాంధ్రవాఙ్మయమున నిది వఱలోనే మంచిపేరును బ్రసిద్ధినిఁ గన్న మహనీయులు. గద్యరచనయం దాధునికులలో నద్వితీయులు. నన్నయ్యను చిన్నయ్యను జ్ఞప్తికిఁ దెచ్చువారు. వీరి శైలి మనోహరము; అద్భుతము. శైలికంటెను ముఖ్యమైనది వీరు నివేదించు విషయములు. వీరు వ్రాయునది వినోదార్థము కాదు, క్రీడగాఁ గాదు; గొప్ప మనస్సుతో, నిండుహృదయముతో జనుల యొక్క ఐహికాముష్మిక వినియోగార్థము. ఇట్టి గొప్ప విషయములను ఇంత రసవంతముగా వ్రాయుట చాలా దుస్తరమైనపని. దానిని నెఱవేర్పఁజాలిన కొలఁది సంఖ్య గొప్పవారిలోఁ బూర్వాశ్రమమున (బ్రహ్మచర్యాశ్రమమున) మాధవచైతన్యులనియు, సన్న్యాసానంతరము చిరంతనానందస్వామి యనియుఁ బేరువడసిన యీ గ్రంథకర్తగా రొకరు.

కొన్నిసంవత్సరముల క్రిందట వీరితో సల్లాప సౌఖ్యము ననుభవించుచు వివేకానందస్వాములవారి లేఖలను తెనిఁగించి యాంధ్రలోకమునకు వికాసము కల్పింపుఁడని సూచించితిని. నా సూచన యధిక ప్రసంగమని నాకుఁ దెలియకపోలేదు. నా యాతురత ఆ జిహ్వాచాపల్యమునకుఁ బాల్పడఁజేసినది. తమ మనోరథమును కర్తవ్యమును ఆ దిక్కుననే ప్రసరించియుండుటచేత అనాయాసముగ నంగీక

రించిరి. ఆ సంభావన నిమిత్తమాత్రము; హేతువు వారి మనోరథము.

వేయిన్ని తొంబన్నూట యెనిమిదవ సంవత్సరమున ననఁగా ముప్పదియేడేండ్ల క్రిందట వివేకానందుల లేఖలను గుఱించి మైసూరు పట్టణములోఁ బ్రసంగించితిని. ఆ సభకు వచ్చినవారి మాటలనుబట్టి యా కాలమునకు వానికిఁ దగినంత ప్రాచుర్యము వచ్చియుండలేదని తోఁచినది. ఇప్పటికిని వచ్చియున్నదో లేదో విచార్యము. వివేకానందుల రాజయోగాది తత్త్వగ్రంథములకును, ప్రసంగములకును లభించినంత వ్యాప్తి వారి లేఖలకు రాలేదు కాఁబోలు.

ఇది యెంతయు శోచనీయము. భారతదేశములోఁ బ్రతియింటను ఉండవలసిన పుస్తకములలో నిదియొకటి. బాలికా బాలకులెల్లరును శ్రద్ధతోఁ బదేపదే చదువవలసిన పుస్తకములలో నిది యొకటి. నేను చిన్ననాఁడే దీనిని జదివితిని. నా యల్పజీవితమును గొంతకుం గొంత బహుశః తాత్కాలికముగా మేలునకుఁ దెచ్చుటకై పనికివచ్చిన గ్రంథములలో నిదియు, శ్రీరామకృష్ణ పరమహంసగారి దివ్యచరిత్రమును, ఉపదేశములును ముఖ్యములు.

ఈ లేఖలలోని విశేషము లెవ్వి? ఇవి అప్పుడప్పుడనేక ప్రదేశములనుండి వ్రాయఁబడినవి. వివేకానందులు హిందూతత్త్వ ప్రచారార్థము 'అమెరికా' ఖండమునకు యాత్రసలుపునపుడు 'జపాను' మొదలైన మధ్య దేశములను దర్శించిరి. అచ్చటి స్థితిగతులను గమనించిరి. 'అమెరికా'

లోఁ జేరినపిదప ఆ దేశముయొక్క ఔన్నత్యమును, అచ్చటి స్త్రీపురుషుల విద్యాదిగుణసంపత్తిని జూచి యద్భుతముతో సహా ఆమోదమును జెందిరి. అట్టి తరుణములలో హిందూ జనుల స్థితిగతులకును, ఆ యభివృద్ధిఁజెందిన దేశముల స్థితిగతులకును ఉండు వ్యత్యాసములు గ్రుడ్డివానికైనఁ గన్నులఁ గట్టినట్లు స్ఫురింపకపోవు ఇఁక దివ్యదృష్టిఁ గలిగిన వివేకానందుల సంగతిఁ జెప్పవలయునా! చూచినది చూచినట్లు వ్రాసిరి; తట్టినవి తట్టినట్లు తెలిపిరి; ఎప్పుడెప్పు డేయే విషయములు గోచరించెనో, యేయే యోజనలు ప్రభవిల్లెనో వానిని వేఁడివేఁడిగా నివేదించిరి. అట్లనుటచే నివి శాశ్వతత్వములేని తాత్కాలికములైన సంచలన సంజనిత బుద్బుదములనుట యేమాత్రము కాదు. వివేకానందునివంటి దివ్యదృష్టి, దీర్ఘదర్శిత్వముఁ గల యఖండ జ్ఞానులయందు ఆధునికములకు, సనాతనములకు భేదము అట్టే యుండదు. అవకాశ మప్పటిది కావచ్చును; సిద్ధాంత మెప్పటిదియు.

ఈ లేఖలకు నుత్తేజకమైన కారణము వివేకానందుల దేశభక్తియు, దైవభక్తియు. 'దైవం పురుషరూపేణ', దేవునియందు నిజమైన భక్తిఁగలిగినవాఁడు మానవకోటియందుఁ బ్రేమఁ జూపకపోఁడు. మఱియు, భగవంతుని కృపావిశేషముచేఁ దాను ఉద్దేశించిన ప్రయోజనములన్నియుఁ దప్పక నెఱవేఱునను విశ్వాసమును వహించినవాఁడగును. జయము సిద్ధమని నమ్మినవాఁడు కార్యములయందుత్సాహమును జూపును. ఈ లేఖలయందు దైవభక్తి,

మానవరక్తి, కార్యాసక్తి—ఇవి నిరంతర సంయోగముఁ దాల్చి జీవితాంధకారమును దొలఁగింపఁజేయు జ్యోతిగ నుండుట స్పష్టము.

మానవులయందలి ప్రేమ ముఖ్యముగాను సహజముగాను బ్రభవించి, ప్రవహించు రంగము తన దేశము, తన జాతి. భారతీయులపై స్వాములవారికుండు ప్రేమావేశము ఇంతింతనరానిది; కులభేదములు, మతభేదములు మొదలగు వైషమ్యములచే నేమాత్రము దూషితము, పరిమితము కానిది; ఐనను జాలితోఁగూడికొన్నది. ఈ జాలి, శోకము, ఎందులకు ? మన హీనస్థితినిగూర్చి. హిందువుల తత్త్వశాస్త్రములు, ధర్మోపదేశములు భావాంబరమున ఉచ్చస్థానము నధిష్ఠించియుండు నఖండ తేజస్సులు. మఱి, వారి శీలము, దినదినవర్తనము, జీవితము వ్యక్తులనుబట్టి గణించినను సరే; సమష్టి సాంఘికముగా లెక్కించినను సరే; చాలహీనము, దౌర్గత్యపూరితము ; ఐకమత్యము లేదు, పరస్పర విశ్వాసము తక్కువ. సత్యము విశ్వాసమున కాలవాలము. ఒకరియందొకరికి నమ్మకము లేదన్న వీనిమాటయందు వానికి వానిమాటయందు వీనికి నమ్మకము లేదనుట. అనఁగా, వీఁడసత్యపరుఁడని వాఁడు, వాఁడసత్యపరుఁడని వీఁడు శంకించుట. సత్యము సామాన్యముగఁ బ్రవర్తిల్లినచో సంఘమున నిట్టి సంశయము లుండవు. దాని సంఘటనము విఘటనము కానేరదు. హిందువులలో విద్య తక్కువ; చాదస్తము లెక్కువ. క్షాత్రము లేదు; బానిసల భావములు

తఱచు. కావున నిక్కమైన సాత్త్వికమును అరిది. ఆర్థికముగ భయము, క్షామము పట్టినవారలు. కోటానఁగోట్ల జనులకు ఆనాఁడు ఒక్కపూఁటనైనఁ గడుపునిండ కూడు దొరకుట కష్టము.

ఏమీ! ఐహికమునుగుఱించి యింత తెలిసినవారు వర్తనమున నింత నీచస్థితికి రానేల? పరలోకమునకు సమీపస్థులగుటవలననా, ఈ లోకమునకు దూరులైరి? ఐహికాముష్మికములు పరస్పర విధ్వంసకములా? యన్యోన్యాశ్రయములు కావా? ఒక్క భగవంతుఁడే కదా యీ రెంటికిని కారణభూతుఁడు. ఒక్క బుగ్గనుండియు నొకవంక పాలు, నొకవంక విషముఁ బ్రవహించునా? హిందువులలో విచ్ఛిన్నమైన జీవితమును బునస్సంధాన మొనరించి యేకాగ్రముగఁ బరివర్తించునట్లు చేయుట సాధ్యము కాదా? అట్టి పురోవృద్ధిమార్గము లెవ్వి? ఇత్యాది గంభీరములైన భావములతో నిండి భారతీయులకును—అందుఁ బ్రధానముగా హిందువులకును — అమూల్యములైన వితర్కములతోను ఉపదేశములతోను నిండియున్న దీ లేఖాకృతి.

వ్యక్తికి సంఘమునకు, మతమునకుఁ బ్రకృత్యాది శాస్త్రములకు, ఇహమునకుఁ బరమునకుఁ, ద్యాగమునకు నాస్తికాభ్యుదయమునకు, శాంతమునకు క్షాత్రమునకు, విమర్శనదృష్టితోఁ జూచినయెడలఁ బరస్పర వైరుధ్యము లేదనియు, నవి నిత్యమును నిరంతరమునైన సంయోగమును మనయందుఁ దాల్చిననే కాని, మన జీవితము పరిష్కృతము,

పరిపక్వము, పరిపూర్ణము కానేరదనుట యీ లేఖల యమోఘమైన సిద్ధాంతము.

కావుననే కదా మన భారతీయులలో నాబాలగోపాలమెల్లరును జదివి యనుష్ఠానమునకుఁ దెచ్చుకొనవలసిన మహత్తర గ్రంథములలో నిదియొక్కటి యని మొట్టమొదటనే నేను సాహసించి నివేదించియుండుట. ఈ కర్తవ్య మాంధ్రులలో సులభముగ నెఱవేఱఁబడుటకునై చిరంతనానందస్వాములు తెనుఁగున నాకర్షణీయశైలియందు దీనిని రచించి మనకెల్లరకు వందనీయులైరి. వారి కృషికి వారు కోరు ఫలమొక్కటియె. మనయొక్క శీలాభివృద్ధి, మనదేశముయొక్క పురోవృద్ధి. వీనికై వలసిన ప్రయత్నములను త్రికరణశుద్ధిగఁజేసి, వారి ఋణమును దీర్చి, వారికి మనకృతజ్ఞతను దెలిపి ధన్యులమగుదుముగాక యని నా ప్రార్థన.

పద్మప్రభాస,
చిత్తూరు,
9-2-'46.

కట్టమంచి రామలింగారెడ్డి



శ్రీ వివేకానందస్వామి

ఓమ్

నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

# శ్రీ వివేకానంద లేఖావళి

(1)

అంటపురము, ఫిబ్రవరి, 1888.

'మాస్టర్' మహాశయా—మీకు కోటినమస్కారములు! రామకృష్ణహృదయమును సరిగా ప్రకటించి యుంచితిరి.

ఏకొందఱో, ఆహా! కొందఱుమాత్రమే అతని తత్త్వము నవగాహము చేసికొందురు!— భవదీయుడు,

—వివేకానందుడు.

మఱియొకమాట, నాహృదయము ఆనందసాగరమున ఓలలాడుచున్నది— ఇలలో నిక శాంతిసామ్రాజ్యమును స్థాపింపజేయు నాతని తత్త్వామృతమున గ్రుంకులిడువానిని— దానిని లోకమునకు అందజేయు వానిని— జూచినంతనే ఉన్మత్తుడను గానేలయని నాకు ఆశ్చర్యము!

(2)

బృందావనము, 12-8-1888.

మహాశయా—...పట్టణవాసమున మనస్సు సంకుచితమైపోవును...

—మీ వివేకానందుడు.

(3)

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

వరాహనగరమఠము, 19-11-1888.

పూజనీయా—మీరంపిన రెండుపుస్తకములును అందినవి.

ఉదారహృదయమును అద్భుతప్రేమానురాగములను బ్రకటించు మీలేఖను జదివి బ్రహ్మానందభరితుడనైతిని. అయ్యా, తిరిపె మెత్తుకొని జీవించు నావంటివానిపై మీ రింతటి దయ చూపుట నాపూర్వజన్మ పుణ్యఫలమనుటకు సందియము లేదు. వేదాంతగ్రంథముల నొసగి, మీరు నన్నేగాక శ్రీరామకృష్ణసన్న్యాసి బృందమునంతను యావజ్జీవము మీయెడ కృతజ్ఞతాబద్ధుల నొనర్చినారు. వారందఱును మీకు ప్రణతు లొనర్తురు. పాణినీయవ్యాకరణ ప్రతికిగాను మిమ్ము నే నడిగినది నాకొఱకేకాదు; ఈ మఠమున నిజముగా విశేషమైన శాస్త్రాభ్యాసంగము జరుగుచున్నది. వంగదేశమున వేదములు వెనుక బడినవని చెప్పవచ్చును. ఈమఠమున అనేకులు సంస్కృతపరిచయము గలవారై వేదసంహితలను బఠింప నుద్యుక్తులై యున్నారు. చేయవలసిన కార్య మేదియైనను తుదముట్టువఱకును చేయవలయునని వారియభిప్రాయము. కావున పాణినిని తుష్ణముగా జదివిననేకాని వైదికవాఙ్మయమున సమగ్రమైన పాండితి సంపాదించుట అసాధ్యమని నావమ్మకము, అందువలననే ఈ పుస్తకముయొక్క ఆవశ్యకత. చిన్ననాట మేము చదివిన ముగ్ధబోధవ్యాకరణము లఘుకౌముదికంటె

పెక్కు విషయములలో శ్రేష్ఠము. ఐనను స్వయముగా మీరు మహాపండితులు కావున ఈవిషయమున మాకు మీరే చెప్పదగినవారు. అష్టాధ్యాయి (పాణినీయము) పఠింపదగిన దని మీరు భావించిన, (మీకు సంబంధియు లేనియెడల) ఏతత్ప్రతిని బంపి మమ్ము యావజ్జనము కృతజ్ఞతాబద్ధుల నొనర్తురుగాక. కార్యదీక్షాపరులకును బుద్ధికుశలులకును ఈ మఠమున లోపము లేదు. గురుదేవుని యనుగ్రహమున అచిరకాలముననే వారు పాణినిని వశమొనర్చుకొని వంగదేశమున వేదములను పునరుజ్జీవింప జేయగలరని నాఆశయము.

నాగురుదేవుని యుపదేశములను గొన్నిటిని అతని సహజసరళభావయుం దొకమహానీయుడు రెండుసంపుటములుగా ప్రకటించియున్నాడు, ఏతత్ప్రతులను రెంటిని నాగురుదేవుని రెండు ఛాయాపటములను మీకు బంప నసుజ్ఞ యిందు : వానిని స్వీకరించి మమ్మానందింప జేయుదురని నమ్ముచున్నాను. ఇప్పుడు నా ఆరోగ్యము తేలుకొనినది; రెండుమూడు నెలలలో మిమ్ము కలిసికొను మహాభాగ్యము నాశించుచున్నాను...... దాసుడు, వివేకానందుడు.

(4)

ఈశ్వరో జయతి !

బరాహానగరము, 4-2-1889.

పూజనీయా — కొన్ని కారణములచే మనస్సు నేడు అందోళనము నొందియున్నది, ఏమియు తోచకున్నది. ఈస్థితిలో దివ్యకాశీనగరమునకు నన్నాహ్వానించుచు మీరు

వ్రాసిన లేఖ అందినది. మీపిలుపును విశ్వేశ్వరాజ్ఞగా గ్రహింతును. నా గురుదేవుని జన్మభూమికి ఇపుడు యాత్ర చేయబోవుచున్నాను; అచట కొన్నిదినము లుండి, మీ సమక్షమునకు వత్తును. కాశీక్షేత్రదర్శనమున—కాశీ విశ్వేశ్వరదర్శనమున—భక్తిమయుడు కానివాడు పాషాణహృదయుడు...అంతయు విశ్వేశ్వరసంకల్పము ... దాసుడు,

—వివేకానందుడు.

(5)

ఈశ్వరో జయతి !

కలకత్తా, 4-7-1889.

పూజనీయా—...కాని యిపుడు నాబాధ వేఱు. కరుణానిధియగు పరమేశ్వరునియందు నేను నమ్మకము కోల్పోలేదు—కోల్పోనుండను లేదు; వేదశాస్త్రములందు నావిశ్వాసము అచంచలము. కాని ఆ జేండ్లుగా నాజీవితము సర్వవిధములైన యిడుమలతోడను ఆటంకములతోడను నిండియున్నది—అది యీశ్వరేచ్ఛ. 'ఆదర్శశాస్త్రము' ను గనుగొంటిని; ఆదర్శపురుషుని కనులార గాంచితిని; కాని తుదముట్టువఱకును దేనిని సాధింపజాలకున్నాను. ఇదియే నా మహావేదన...—దాసుడు, —వివేకానందుడు.

(6)

ఈశ్వరో జయతి !

వరాహనగరము, కలకత్తా, 7-8-1889.

పూజనీయా—నాకు కొన్ని శంకలు గలవు. సంస్కృతమున సమధికజ్ఞాన సంపన్నులగు మిమ్ము ఈ క్రింది

ప్రశ్నలకు సమాధానము ననుగ్రహింప వేడెదను.

1. జానశ్రుతినిగూర్చియు జాబాలతనయుడగు సత్యకామునిగూర్చియు వేదములం దుపనిషత్తులలో దక్క మరెచ్చటనైనను జెప్పబడియున్నదా? *

2. సూత్రభాష్యమున శంకరాచార్యుడు స్మృతి నుదాహరించునప్పుడు సర్వసాధారణముగా మహాభారత ప్రమాణములను జూపుచుండును. కాని గుణకర్మములపై—అనగా అర్హతపై—వర్ణవ్యవస్థ ఆధారపడియున్నదనుటకు మహాభారతమందలి భీష్మపర్వమునను, అజగర—ఉమామహేశ్వర—ఉపాఖ్యానములందును మనకు విస్పష్టమైన నిదర్శనములు కనబడుచుండ, వీనిని అతడు తనరచనములందు ఉదాహరించి యున్నాడా?

3. పురుషసూక్తమున వర్ణవ్యవస్థను గూర్చిన వర్ణన అయ్యది పరంపరానుగతమని తెలుపుట లేదు.—పరంపరానుగతమనుటకు వేదములందున్న నిదర్శనము లేవి?

4. శూద్రుడు వేదాధ్యయనము చేయరాదని చెప్పుటకు శంకరాచార్యుడు వేదములనుండి ప్రమాణమును దేనిని జూపు

---

* ఈ ప్రశ్న సారాంశ మిది: సూత్రభాష్యమున శంకరాచార్యుడు I. iii. 34-37 సూత్రములను వివరించుచు శ్రుతులలో చెప్పబడినరీతిని కేవలము వారు శూద్రులు కారు కావుననే జానశ్రుతి సత్యకాములకు వైదికబోధ చేయబడినదని నిరూపింపజూచెను. శంకరాచార్య వ్యాఖ్యానానంతరము సైతము ఈఘట్టము సందేహాస్పదముగనే యుండుటచే ఈవ్యక్తులనుగూర్చి వేదములలో నెచ్చటనైనను సూచింపబడినదాయని స్వామి ప్రశ్న.

జాలకపోయెను. యజ్ఞమునకు (శూద్రుడు) అనధికారి కావున ఉపనిషదాదులను పఠించుటకును అనధికారియనుటకు, "యజ్ఞేఽనవక్లృప్తః"* అని మాత్రమే ఆతడు ఉదాహరించును. కాని "అథాతో బ్రహ్మజిజ్ఞాసా"† యను సూత్రమునకు వ్యాఖ్యానమున వైదిక మంత్రబ్రాహ్మణాధ్యయనమునకు పూర్వము ఉపనిషదధ్యయనము అనంగీకృతమనుట కిది విరుద్ధము కావునను, వైదికకర్మకాండకును జ్ఞానకాండకును నడుమ నెట్టి పౌర్వాపర్యము లేకుండుటచేతను (ఈ సూత్రమున) 'అథ' యనగా 'వేదాధ్యయనానంతరము' అని యర్థముకాదని యా యాచార్యుడే వక్కాణించును. కాబట్టి వైదికకర్మకాండను అధ్యయనముచేయకయే బ్రహ్మజ్ఞానము నందవచ్చునని దీనిచే స్పష్టము. యజ్ఞయాగాచరణమునకును జ్ఞానమునకును పరస్పరసంబంధము లేనిచో "ఈ హేతుబలముచేతనే" యని యొక ఉపపాదనమును చేర్చి యాచార్యుడు స్వవచనవ్యాఘాతము చేసికొననేల? శూద్రు డెందుచే ఉపనిషదధ్యయనము చేయరాదు?

ఒక క్రైస్తవసన్న్యాసి రచించిన Imitation of Christ (క్రీస్తుధర్మావలంబనము) అను గ్రంథమును తమకు బంపుచున్నాను. ఇది యొక అద్భుతమైన గ్రంథము. క్రైస్తవులలో సైతము అట్టి యఖండత్యాగ వైరాగ్యములును దాస్య

---

* "శూద్రుడు (వైదిక) యజ్ఞాధికారిగా భావింపబడడు" — తైత్తిరీయ సంహిత, vii. i. 1. 6.

† వ్యాసుని వేదాంతసూత్రములందిది మొదటిది. "కావున ఇపుడు బ్రహ్మజిజ్ఞాస ప్రారంభమగుచున్నది" అని యర్థము.

భక్తియు నెలకొనియుండెనా యని యబ్బురపడుదును. బహుశః తామిది పూర్వమే చదివియుండవచ్చును, లేని యెడల దయతో దీనిని జదివిన నాకు అఖండానందదాయకము.—దాసుడు, —వివేకానందుడు.

(7)

వరాహానగరము, 17-8-1889.

మహాశయా—ఇటీవల మీ రనుగ్రహించిన లేఖనుబట్టి నాడ. భక్తిపూర్వకముగా మిమ్ములను సంబోధించినందులకు మీరు కలవరపడియుండినట్లు కనిపించుచున్నది. మీ దివ్యగుణగణములను జూచి నే నట్లు సంబోధింపవలసి వచ్చినది కావున అది నాదోషము కాదు. మీ యుదారగుణములచే నే నాకృష్టుడ నైన కతనగునుబట్టి పూర్వజన్మముల నుండియు మన కేదియో సంబంధముండియుండవలయునని పూర్వ మొక లేఖలో వ్రాసియున్నాను. మహనీయత, ఉదారత, పవిత్రత— ఇవి యెచ్చటనున్నను పూజ్యభావమున వినమితశిరస్కుడను గావలసినదే— ఈ విషయమున గృహస్థుడనియు సన్న్యాసి యనియు నేను భేదమును పాటింపజాలను—శాంతి శ్శాంతి శ్శాంతిః! ప్రతిష్ఠయందలి పేరాసచే—"ఉదరనిమిత్తం బహుకృత వేషః" అనునట్లు జీవనోపాధికై సన్న్యాసము నటించుచు, ఉభయభ్రష్టులై తిరుగాడు నేటిసన్న్యాసి బ్రువులలో లక్షకొక్కరైనను మీవలె ఉదారహృదయు లగుదురుగాక యని నాప్రార్థన! మీ సద్గుణపుంజములనుగూర్చి వినిన నా బ్రాహ్మణసోదరశిష్యులు మీకు తమ సాష్టాంగవందనములను సమర్పించుచున్నారు.

నే నడిగిన ప్రశ్నలకు మీ రొసగిన సమాధానములచే ఒకదానివిషయమున నాభ్రమ తొలగినది. ఇందులకై శాశ్వతముగా మీయెడ కృతజ్ఞతాబద్ధుడను. మహాభారతాది పురాణములలో దెల్పుపబడిన రీతిని వర్ణవ్యవస్థ గుణములపై నాధారపడియున్నదనుటకు శంకరాచార్యుడు ఇదమిత్థముగా నేయభిప్రాయము నైనను ప్రకటించెనా యనునది నాప్రశ్నలలో మఱియొకటి. ప్రకటించిన అది యెచ్చట నున్నది? సనాతనాభిప్రాయమునననుసరించి ఈ దేశమున వర్ణవ్యవస్థ పరంపరానుగతమనుటకు నాకు సందియము లేదు; మఱియు స్పార్టనులలో బానిసలకంటెను అమెరికనులలో నీగ్రోలకంటెనుగూడ శూద్రులు ఒక్కొక్కప్పుడు విశేషముగా హింసింపబడిరనుటకును సందియములేదు! నన్నడిగితిరా, ఈవర్ణవిషయమున ఏపక్షముననను నాకు అభిమానము లేదు; ఏమందురా, ఇది సాంఘికవ్యవస్థయనియు గుణకర్మవిభేదముపై నాధారపడియున్నదనియు నాకు తెలియును. అదియునుగాక గుణకర్మములకు అతీతుడు కాదలచినవాడు హృదయమున జాతిభేదములకు ఎడమిచ్చుట మహాహానికరము. మదీయ గురుదేవానుగ్రహమున ఈవిషయములలో నాకు గొన్ని స్థిరభావములు కలవు; కాని మీయభిప్రాయములను అరయుటచే కొన్నిభావములు మఱింత బలపడుటకును మఱి కొన్ని పరిష్కృతమగుటకును అవకాశము చిక్కును. వేలువంగనిదే వెన్నైనను దొరకదు—కావున మిమ్ము మఱికొన్ని ప్రశ్నలడిగెదను. వేఱువిధముగా దలపక, నన్ను అజ్ఞునిగను బాలునిగను గణించి,దయతో తగుసమాధానముల నొసగుడు.

1. వేదాంతసూత్రములు తెలుపు ముక్తియు అవధూతగీతాదులలో జెప్పబడిన నిర్వాణమును ఒక్కటియేనా?

2. "జగద్వ్యాపారవర్జం ప్రకరణా దసన్నిహితత్వాచ్చ"* అను సూత్రము ననుసరించి పరిపూర్ణమగు ఈశ్వరత్వమును ఎవ్వరును పొందజాలరనిన్ ఇక నిర్వాణమనగా నేమి?

3. "వ్యాససూత్రములు నాకు అర్థమైనవి. అవి ద్వైతపరము, కాని భాష్యకారుడు వాటిని అద్వైతపర

* వేదాంతసూత్రము, 4-4-17.—సగుణబ్రహ్మోపాసకులు ఈశ్వరసాయుజ్యము నొందుదురు. ఆ స్థితిలో వారల యైశ్వర్యమునకు—శక్తిసామర్థ్యములకు—అవధి కలదా, లేదా యని శంకించినచో, "ఆప్నోతి స్వారాజ్యం" (వారు స్వారాజ్యము నొందుదురు); "సర్వేఽస్మై దేవా బలిమావహన్తి" (దేవతలందఱు నాతని బూజింతురు); "తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి" (సమస్తలోకములందును వారి కోరిక తీఱెడును)— ఇట్టి శ్రుతివాక్యముల ననుసరించి వారల యైశ్వర్యము నిరవధికమని చెప్పవలసియుండుననుట పూర్వపక్షము. ఈ సూత్రము సిద్ధాంతమును దెలుపుచు, వారల యైశ్వర్యము సావధికము—జగద్వ్యాపారవర్జము (అనగా జగత్సృజనాదిశక్తిరహితము) అని చెప్పెను. జగన్నియమనశక్తి వినా ముక్తులకు అణిమాద్యైశ్వర్యములన్నియు గలుగును. జగన్నియమనమనగా దేనియది యన, అది నిత్యపరిపూర్ణుడగు ఈశ్వరునిదే. ముక్తులు తమతో సమానమనస్కులతో గూడియుండుటచే వారివారి సంకల్పములు భేదింపవచ్చును—ఒకడు సృష్టింతమని కోర్న మఱియొకడు సంహారమును నిచ్ఛగింపవచ్చును. కావున జగన్నియమనమున నొక్కయీశ్వరునికే గాని యితరులకు అధికారములేదు: ప్రకరణమువలన అనగా పూర్వోత్తర సందర్భములవలనను, ఏతద్విషయకవచనములు ఇతరము లేవియు లేకుండుటవలనను ఇట్లు తెలియుచున్నదని భావము. (చూ. బ్రహ్మసూత్రశంకరభాష్యము, 4-4-17.) కావున ఈ జగద్వ్యాపారము ఇట్లు

మొనర్చుట నాకు అర్థముకాకున్నది'' అని చైతన్యదేవుడు పూరీలో సార్వభౌమపండితునితో పలికెనట. నిజమా? ఈ విషయమున చైతన్యదేవుడు ప్రకాశానంద సరస్వతితో వాదించి గెలిచెననుట ఇతిహాసప్రసిద్ధము. వ్యాససూత్రములపై చైతన్యదేవకృత భాష్యమొకటి ప్రకాశానందుని మఠమున నున్నట్లు వదంతికలదు.

4. తంత్రశాస్త్రములలో శంకరాచార్యుడు ప్రచ్ఛన్న బౌద్ధుడని చెప్పబడియున్నది; బౌద్ధమహాయాన గ్రంథమగు 'ప్రజ్ఞాపారమితము' న దెలుపబడిన భావములకును ఆచార్యునిచే ప్రతిపాదింపబడిన సిద్ధాంతములకును లేశమును భేదముకానరాదు. మనము దేనిని 'బ్రహ్మము' అందుమో అదియే బౌద్ధుల 'శూన్యము' అని పంచదశీకారుడును వచించును. వీని యన్నిటియొక్కయు తాత్పర్యమేమి?

5. వేదప్రమాణమునుగూర్చి వేదాంతసూత్రములలో హేతువులు తెలుపబడకుండుటకు కారణమేమి? దేవుడు కలడనుటకు వేదములే ప్రమాణమని మొదట చెప్పబడినది; పిమ్మట "యస్య నిశ్వసితం వేదాః" (ఈశ్వర నిశ్వాసమే

---

భగవానునకుమాత్రమే చెందినదైయున్న పక్షమున "నిర్వాణమున జీవుడు పూర్తిగా ఈశ్వరునియందు లీనమగును" అనుటలో అర్థమేమని స్వామిశంక.

వేదాంతవిజ్ఞానపరిపూర్ణతను బడయుటకుముందు స్వామి వైజ్ఞానిక పరిణామమును ఈ ప్రశ్నలు సూచించుచున్నవని మనము గుర్తింపవలసియున్నది. విజ్ఞానవికాసమున వేదశాస్త్రములను ఆచారములను స్వామి యెట్లు క్రమముగా అవగతమొనర్చుకొనెనో మన కిందు ద్యోతకము కాగలదు.

వేదములు) అనువచనము వేదమునకు ప్రమాణమని చెప్ప బడినది, ఇందు అన్యోన్యాశ్రయదోషము లేదా?

6. కేవలతర్కముచే తత్త్వనిర్ణయము చేయజాలము కావున శ్రద్ధ కావలయునని వేదాంతము తెలుపును. అగుచో న్యాయ సాంఖ్యదర్శన సిద్ధాంతములందు లవలేశము దోషము తోచినను వానిపై తార్కికశిరపరంపర కురియింప బడుటకు హేతువేమి? అదిగాక, ఎవరిని నమ్ముట? ప్రతి వ్యక్తియు తన యభిప్రాయమే సిద్ధాంతమనుటకు సిద్ధమాడు చున్నట్లు కాన్పించును; వ్యాసు ననుసరించి చూచిన, "సిద్ధానాం కపిలోమునిః" * అని చెప్పబడిన కపిలమహాముని గూడ భ్రమపతితుడై యున్నాడే కాని వ్యాసుడే విశేషమైన భ్రమ పతితుడేమో యెవరు చెప్పగలరు? కపిలుడు వేదముల నర్థము చేసికొనజాలక పోయునా?

7. న్యాయదర్శనము ననుసరించిచూచిన, "బ్రహ్మానుభూతి నందినవారివాక్యమే శబ్దము లేక వేదము"; కాబట్టి ఋషులు సర్వజ్ఞులు. అగుచో, సూర్యసిద్ధాంతమునుబట్టి చూచినపుడు అతిసామాన్యమైన జ్యోతిష విషయములను వారు ఎఱుగకుండిరని తెలుచున్నదే— ఎట్లు? భూమి త్రికోణాకారముగా నున్నదనియు, వాసుకియను పాము భూమిని భరించుచున్నదనియు— ఇత్యాదివిషయములనుగూర్చి ప్రస్తా

* భగవద్గీత, 10-26. తన వేదాంతసూత్రభాష్యమున 2-1-1-వ సూత్రమును వివరించుచు శంకరాచార్యుడు వైదిక కపిలుడును సాంఖ్య కపిలుడును ఒక్కరేనాయను విషయమున సంశయమును వెలిబుచ్చెను.

వించు వీరిమాటలను తెలివితేటలను నమ్ముకొని మనము సంసారసాగరమును తరించుటెట్లు?

8. సృష్టివ్యాపారమున భగవంతుడు మన సుకృత దుష్కృత కర్మములపై నాధారపడియున్నపక్షమున మనము వానిని భజించుటవలని ప్రయోజనమేమి? "లలాట లిఖితా రేఖా పరిమార్ష్టుం నశక్యతే" యనునట్లు "లలాటలిఖితము ఎట్లైనను జరుగనున్నపక్షమున, ఓ తల్లీ! ఈ దుర్గానామ స్తోత్రాదులవలని ఫలమేమి?" అను నరేశచంద్రుని చక్కని కీర్తన మొకటి కలదు.

9. ఒకేవిషయము నుద్ఘాటించు బహు ప్రమాణ వచనములను ఏ యొకటిరెండు తద్విరుద్ధవచనములచేతనో అప్రమాణములని తలచుట సమంజసము కానేరదు. కాని చిరకాలానుగతములగు మధుపర్కాది ఆచారములు, "అశ్వాలంభంగవాలంభం సన్న్యాసం పలపైతృకం, దేవరాచ్చ సుతోత్పత్తిః కలౌ పఞ్చవివర్జయేత్"*—ఇట్టివే ఒకటి రెండువచనములచేతనో ఎట్లు ఖండితమగును? వేద

---

* అశ్వమేధయాగము, గోమేధయాగము, సన్న్యాసము, శ్రాద్ధమున మాంససమర్పణము. భర్తవలన సంతానమునొందనిచో వంశము నిలువబెట్టుటకుగాను మఱదివలన సంతానముగనుట—ఇవి యైదును కలియుగమునకు నిషేధింపబడినవనుట. ఇందు సన్న్యాసమును శంకరాచార్యులు పునరుద్ధరించెనని కొందఱు.

అతిథిపూజయందు సాధారణముగా తేనె, పెరుగు మొదలగువానితో గోమాంసముగూడ—ఇదియే మధుపర్కము—అతిథికి సమర్పింపబడుచుండెడిది.

ములు సార్వకాలికములైనచో, "ఈ ధర్మము ద్వాపర యుగమునకు" "ఈ ధర్మము కలియుగమునకు"—అని యీ విధముగా ప్రత్యేకించు టేటి న్యాయము?

10. వేదములను వెలువరిచిన భగవానుడే వానిని త్రోసిరాజనుటకు మరల బుద్ధభగవాను డయ్యెను; వీనిలో దేనిని అనువర్తించుట?—ముందటిదా, వెనుకటిదా, ఏది ప్రామాణికము?

11. కలియుగమున వేదమంత్రములు నిష్ఫలమని తంత్రములు వచించును. ఏ శివునియాజ్ఞను—ఏ పరమేశ్వరునియాజ్ఞను—పరిపాలింపవలయును?

12. వాసుదేవ సంకర్షణాదికమగు చతుర్వ్యూహమును ఆరాధించుట తగదని వేదాంతసూత్రములలో వ్యాసుడు తెలుపును; తిరిగి ఆ వ్యాసుడే ఈ యారాధన వలని మహాపుణ్యఫలములనుగూర్చి భాగవతమున ఉపన్యసించును! ఈ వ్యాసుడేమి పిచ్చివాడా?

ఇవిగాక, ఇట్టి సంశయము లనేకములు నాకుగలవు; మీ యనుగ్రహమున వానిని నివర్తించుకొనగలనని ఆశించుచున్నాను. ఇటుపైన వానిని మీకు విన్నవించుకొందును. సముఖముననే కాని యిట్టి ప్రశ్నలన్నిటిని వెలువరుచుట సాధ్యపడదు; అనుకొనినంత తృప్తియు గలుగదు. కావున ఈసంగతుల నన్నిటిని మిమ్ము సందర్శించునపుడు నివేదించుకొన గోరెదను. గుర్వనుగ్రహమున మిమ్ము అచిరకాలముననే కలిసికొన నాశించుచున్నాను.

ధర్మానుష్ఠానమున ఆత్మవిశ్వాసము నందిననే కాని, కేవల హేతువాదముచే ఈ విషయములనుగూర్చి యిదమిత్థమని నిర్ణయింపజాలమని వినియున్నాను. కాని ప్రారంభమున కొంతవఱకైనను సంతృప్తి ఆవశ్యకమైనట్లు కాన్పించును.—దాసుడు, —వివేకానందుడు.

(8)

కలకత్తా, 2-9-18౮౯.

మహాశయా—కొన్నిదినముల క్రితము దయతో మీరు వ్రాసిన రెండు లేఖలను అందుకొంటిని. మీయందు అద్భుతమగు జ్ఞానభక్తి సమన్వయమును గాంచి యమితానందము నందుచున్నాను. తర్కమును—వాదమును—విడిచిపెట్టుమని మీరు నాకుచేసిన హితోపదేశము నిజమే—నిజముగా పరమావధియు అదియే. “భిద్యతే హృదయ గ్రన్థిః, ఛిద్యన్తే సర్వసంశయాః, క్షీయన్తే చాస్యకర్మాణి, తస్మిన్ దృష్టే పరావరే.”* కాని నా గురుదేవుడు వచించెడి రీతిని కూజాను నీటిలో ముంచునపుడు బుడబుడమని ధ్వని చేయును. కాని నిండినంతనే నిశ్శబ్దముగా నుండును; నా స్థితియు నిట్టిదేయని గ్రహింపుడు. బహుశః రెండు మూడు వారములలో మిమ్ము కలిసికొనగలను—భగవాను డీకోర్కె నీడేర్చుగాక!—దాసుడు, —వివేకానందుడు.

* ముండకోపనిషత్తు, ౨-2-8. పరమాత్మ దర్శనమున హృదయ గ్రంథులు(అనగా అజ్ఞానము) భేదితమగును, సర్వసంశయములును విచ్ఛిన్నమగును, (అట్టివాని) సమస్తకర్మములును క్షయించును అని భావము.

(9)

వైద్యనాథము, 26-12-1889.

మహాశయా—...కాని నా హృదయము కాశీయాత్రకై ఆత్రపడుచున్నది. కొంతకాలము అచటనుండి, విశ్వనాథుడును అన్నపూర్ణయు నా భాగ్యచక్రము నెట్లు త్రిప్పుదురో చూడవలయునని నా ఆశయము. నా మనోనిశ్చయము కొంచె మించుగా ఇట్టిది— "జీవితసమర్పణమో, ఆదర్శసిద్ధియో"*—కావున ఓ కాశీవిశ్వేశ్వరా! నాకు తోడ్పడుము!—దాసుడు, —వివేకానందుడు.

(10)

గాజీపురము, 21-1-1890.

మహాశయా—...ఇచట అంతయు బాగుగనే యున్నట్లు కాన్పించుచున్నది. జనులందఱును పెద్దమనుష్యులే కాని వేషభాషాదులలో పాశ్చాత్య వ్యామోహితులై యున్నారు. శోచనీయము—పాశ్చాత్యభావానుకరణమనిన నాకు ఎంత మాత్రము కిట్టదు; నే నిందులకు ప్రబల విరోధిని...ఏమి పనికిమాలిన నాగరికతను ఈ విదేశీయులు మన దేశములోనికి దిగుమతి చేసినారు! ఏమి లౌకిక మహామోహమును సృజించినారు! విశ్వనాథుడు ఈ దుర్బల మనస్కులను కాపాడుగాక!...

మఱియొక మాట. శుకదేవుని జన్మస్థానమగు ఈ భారతదేశమున వైరాగ్యము పిచ్చితనమనియు పాపమనియు భావింపబడుట, ఆహాహా! మన దురదృష్టము గదా!

* "శరీరం వా పాతయామి, మన్త్రం వా సాధయామి."

(11)

ఆయుష్మంతుడగు—, నీవు క్షేమముగా ఉన్నావని తలచెదను. నీ సాధనలను సాగింపుము. వినమ్రతతో సర్వజనులకును సేవకభావమున సేవచేయుము. నీ వెవ్వరి సన్నిధినున్నావో వారి దాసుడనని చెప్పుకొనుటకుగూడ— వారి పాదధూళిని తలదాల్చుటకుగూడ—నే సమర్థుడను— వారంతటి మహనీయులని గ్రహించి, శ్రద్ధాభక్తులతో వారిని సేవింపుము. వారు నిన్ను తిట్టినను, ఒకవేళ బాధించినను గూడ కోపము చెందకు. స్త్రీలతో ఎన్నడును సహవాసము చేయకు. మెల్లమెల్లగా కష్టసహిష్ణుత నలవరుచుకొనుము; క్రమముగా భిక్షాటనముచే శరీరపోషణ చేసికొన నలవాటు చేసికొనవలయును. రామకృష్ణభగవానుని నామస్మరణ చేయువా రెవ్వరైనను వారు నీ గురువులని గ్రహింపుము. ప్రతి వ్యక్తియు యజమానుడై చరింపవచ్చును. కాని సేవకుడై చరించుట బహు కష్టసాధ్యము. స్థిరమైన గురుభక్తియు, అచంచలమైన ఓరిమియు, పట్టుదలయు, లేనిదే ఏమియు సాధింపజాలమని—ఇది ముమ్మాటికిని నిశ్చయమని—గ్రహింపుము. ధర్మనిష్ఠాపరుడవై యుండవలయును. ధర్మమార్గమునుండి ఏమాత్రము చ్యుతినొందినను శాశ్వతముగా అధోగతియే—అప్పుడు, —వివేకానందుడు.

(12)

ఓం నమో భగవతే రామకృష్ణాయ !

గాజీపురము, 1890.

మహాశయా—అనుతాపపూర్వకమగు మీ లేఖ నందుకొంటిని...సాధుసేవవలన గణుతింపదగిన ఫలమేమియు

లభింపలేదని మీరు విచారించుచున్నట్లున్నది—యథార్థమనియు, యథార్థముకాదనియుగూడ చెప్పవలసియున్నది; పరమపురుషార్థసిద్ధిని—పరమానందప్రాప్తిని—మీరు లక్షించినచో ఇది యథార్థము. కాని యేస్థితినుండి మీరు (పారమార్థికసాధనను) ప్రారంభించితిరో గమనించినచో, పూర్వము పశుస్థితిలోనుండి ప్రస్తుతము మానవస్థితినందియున్నారనియు ఇకముందు దేవత్వము నొందగలరనియు, లేదా, సాక్షాత్ దేవుడే కాగలరనియు మీకు వెల్లడి కాగలదు. అదిగాక, ఈ విధమైన విచారము—అసంతృప్తి—కలుగుట చాల మంచిది, వికాసమున కిదిసూచన. ఇది కలుగనిచో ఎవ్వరును ఉన్నతి నందజాలరు. పాగచుట్టి వెంటనే పరమేశ్వరుని దర్శించువాని వికాసము ఇక నంతటితో సరి. హృదయపరితాపకరమగు నిరంతరమైన యీ అసంతృప్తి కలిగినందులకు నిజముగా మీరు ధన్యులు—ఇక నే విధమైన భయమును ప్రమాదమును లేదని నిశ్చయముగా నమ్ముడు... ఓరిమియే విజయమునకు పరమసాధనమని ప్రాజ్ఞులగు మీకు చెప్పనక్కఱలేదు. కుత్తులమగు మేమే ఈ విషయమున మీవద్ద విశేషముగా నేర్చుకోవలసియున్నదనుటకు నాకు సందియములేదు. సమాలోచనాపరులగు మీ కింతకంటె చెప్పవలసినదిలేదు. మానవునకు రెండు చెవులు, కాని ఒకే నోరు. నిష్కపటవాక్కు, పెద్ద వాగ్దానములుచేయ వెనుదీయుట—మీ కివి జన్మసిద్ధములు. వీనిని జూచి మీపై నా కొక్కొక్కప్పుడు కోపము వచ్చుచుండును; కాని ఆలోచించి చూచినమీదట వివేకముతో వర్తించినవారు మీరే యని

తోచును. "Slow but sure" (మందగతియే కాని గమనము నిశ్చయము)...ఏమైనను లోకమున సర్వము మానవుని వచనములపై నాధారపడియున్నది. ఒకని వాక్కుల అంతరార్థమును గ్రహింప నందఱును సమర్థులుకారు. మఱియు ఎవ్వరిహృదయమునైనను చిరసహవాసముననే కాని గ్రహింపజాలము...ధర్మమనునది శాఖాసంప్రదాయములలో లేదు, ఆర్భాటముననను లేదు—మన గురుదేవుని యీ యుపదేశములను మీరేల మఱతురు?...ఇది గమనించి, చపలులము, కుట్టిలము అగు మా లోపములను అన్నిటిని మీ పిల్లవానివిగా భావించి, దయతో సహించి, క్షమింపుడు...—మీ స్నేహాస్పదుడు, —వివేకానందుడు.

మఱియొక మాట. అమ్మ (శారదామాతృదేవి) వచ్చియున్నయెడల నా ప్రణామసహస్రములని తెలిపి, అచంచలదీక్ష కలిగియుండునట్లు నన్నాశీర్వదింప వేడుడు. అది యీ శరీరమున సాధ్యముకాదో, శీఘ్రముగా ఈ శరీరము పతనము నొందుగాక! —వివేకానందుడు.

(13)

గాజీపురము, 4-2-1890.

మహాశయా—దయతో మీరు వ్రాసిన లేఖ అందినది; మహాదృష్టవశమున పవ(నా)హరి బాబా దర్శనమంది, అతనితో ప్రసంగించినాను. ఏమి మహాయోగి! అతని చరిత్ర అంతయు మహాద్భుతము, ఈ కలియుగమున భక్తి యోగ రాజయోగ సంజనితమైన అఖండశక్తియే అతనై

ప్రకాశించుచున్నది!...ఇట్టి మహనీయుల జీవితచరిత్రలను ప్రత్యక్షముగా గాంచిన నేకాని వేదశాస్త్రములందు శ్రద్ధ వృద్ధి కానేరదు. భవదీయుడు, —వివేకానందుడు.

(14)

ఘాజీపురము, 7-2-1890.

మహాశయా—...పవ(నా)హారి బాబా సహవాసభాగ్యము లభింపకున్నను అట్టి మహనీయుని సందర్శనము నిమిత్తము పడినశ్రమ నిష్ఫలము కానేరదు.

(15)

విశ్వేశ్వరో జయతి!

ఘాజీపురము, ఫిబ్రవరి, 1890.

మహాశయా—...సోదరుడు కా— హృషీకేశమున జ్వర పీడితుడైయున్నాడు, జ్వరము తిరుగబెట్టుచున్నది. ఇక్కడ నుండి అతనికి తంతి పంపినాను, నా సాయము కావలసి యున్నట్లు సమాధానము వచ్చిన పక్షమున నేను వెంటనే హృషీకేశము వెళ్లవలసియుందును; లేనియెడల ఒకటి రెండు దినములలో మిమ్ము కలిసికొనవచ్చుచున్నాను. ఈ మాయా జాలమునంతను నిర్మించుకొనుచున్నందులకు, అయ్యా, మీరు నన్ను జూచి నవ్వవచ్చును—నిజమే, ఇది మాయాజాలమను టకు సందియము లేదు. ఐనను ఇనుప సంకెల వేరు, బంగారు సంకెల వేరు. రెండవ దానివలన చాల మేలు కలుగును, మేలునంతను పొందినపిమ్మట దానియంతట అదియే ఊడి పోవును. నా గురుదేవుని పుత్రులు (శిష్యులు) నాకు సంసే

వ్యులు—ఇది యొక్కటే నాకు మిగిలియున్న విధ్యుక్త కర్మము...నా దోషపరశ్శతమును మీ చరణోపాంతమున సమర్పించుచున్నాను—"పుత్ర స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్"*—భవదీయుడు, —వివేకానందుడు.

(16)

ఓం నమో భగవతే రామకృష్ణాయ!

గాజీపురము, ఫిబ్రవరి, 1890

ఆయుష్మంతుడగు అఖండానందునకు—నీ లేఖ అందినది, చాల సంతోషము. టిబెట్‌ను గుఱించి నీవు వ్రాసిన దంతయు నాకు ఎంతో ఆశాజనకముగా నున్నది. అచటికి నే నొకసారి రావలయుననియున్నది. సంస్కృతమున టిబెట్ ఉత్తరకురువర్షమని చెప్పబడుచున్నది—అంతేకాని అది మ్లేచ్ఛదేశము కాదు...నీవు రాజాలకుండుట నాకు విచారకరము—నిన్ను చూడవలయునని నా ఆతురత. అందఱి కంటెను నీయందు నా కెక్కువ ప్రేమయని తోచుచున్నది. ఏమైనను ఈ మాయనుగూడ తొలగించుకోవలయును.

టిబెట్ దేశీయులందు గలవని నీవు తెలిపిన తాంత్రికాచారములు బౌద్ధమతపతనకాలమున భారతదేశముననే బయలుదేఱినవి. మన దేశమున వాడుకలోనున్న తంత్రములు బౌద్ధులు నిర్మించినవేయని నా నమ్మకము. ఆ తాంత్రికాచారములు మన వామాచారములకంటెను ఘోరతరమైనవి;

---

* భగవద్గీత (2-7) ను అనుసరించి కూర్పబడినది. "నీ పుత్రునిగా భావించి నాకు సక్రమమార్గమును జూపుడు" అని భావము.

వలన వానియందు వ్యభిచారము చెలరేగినది; బౌద్ధులు అవినీతిపరులై పతనమునొందినప్పుడే కుమారిలభట్టుచే దేశమునుండి వెడలగొట్టబడిరి. శంకరునిగుఱించి యాతడు ప్రచ్ఛన్నచార్వాకుడనియు, దుర్వ్యసనలోలుడనియు—ఇట్లే శ్రీచైతన్యునిగూర్చియు—కొందఱు బైరాగులు ప్రలాపించు రీతిని నవీనతాంత్రిక బౌద్ధులు బుద్ధదేవునిగూర్చి యాతడు కేవల వామాచారపరుడని ప్రజ్ఞాపారమితమునందలి తత్త్వగాథవంటి మనోహరబోధలను అశ్లీల, అసభ్యవ్యాఖ్యానములను జేయుచుందురు...అనుపమానమైన బుద్ధుని సానుభూతియే యాతని మహత్త్వమునకు హేతువు. బౌద్ధమతమునకు ప్రాముఖ్యమును గల్పించు ఉత్తమసమాధి స్థితులన్నియు ఇంచుమించుగా వేదములందును గలవు. కాని లోకమున "న భూతో న భవిష్యతి" యనదగిన అతని ధీవైభవమును ఔదార్యమును—ఇవియే అందు కొఱవడి యున్నవి.

...ఏమైనను ఆ కాలమునకు అత్యావశ్యకమగుటచే బుద్ధభగవాను డవతరించెను, అతని సిద్ధాంతము కపిలుని సిద్ధాంతమును బోలును..."సంసారము దుఃఖభూయిష్ఠము, దానిని పరిత్యజింపుము—ఓ నరుడా! సంశయింపకు—నీ కిదియే తరణోపాయము"—బుద్ధుడును కపిలుడును సదా చేయు నుపదేశమిదియే...బుద్ధుని మతము ఉపనిషత్తుల మీదనే నెలకొనియున్నది—శంకరుని వేదాంతమును ఉపనిషదాధారముననే స్థాపింపబడియున్నది. కాని అద్భుతమగు బుద్ధుని యౌదార్యము సహస్రాంశమైనను శంకరునకు

లేదయ్యెను—అతని కుండినది శుష్కధీశక్తిమాత్రమే. తంత్రములను జనసామాన్యస్థితిని జూచి భయపడి, వ్రణచికిత్స చేయు యత్నమున చేతినే అతడు ఛేదించి వైచినాడు! * వానినిగూర్చి వ్రాయవలసివచ్చిన ఒక ఉద్గ్రంథమగును కాని నా కందులకుదగు తీటికగాని పాండితిగాని లేదు.

బుద్ధభగవానుడు నా యిష్టదైవము. భగవత్తత్త్వమునుగూర్చి యాతడే సిద్ధాంతమును బోధింపలేదు—ఆతడే స్వయముగా భగవంతుడు—ఇది నా సంపూర్ణవిశ్వాసము. కాని భగవానుని యఖండవైభవమును పరిమితమని చెప్పగలవారెవ్వరు? తాను పరిచ్ఛిన్నుడగుటకు భగవంతునకైనను శక్తిలేదని చెప్పవలసియున్నది...జ్ఞానవిజ్ఞానములచే సంతృప్తుడై, సర్వావస్థలయందును సముడై, జితేంద్రియుడై వెలయునప్పుడే మానవుడు పరమానధి నొందుచున్నాడు—

"జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః." †

శరీరలక్ష్యము లేనివాడే మత్తగజేంద్రములీల నిర్విచారుడై యథేచ్ఛగా విహరింపవచ్చును. నావంటి క్షుద్రుడో—ఒకచోట కూర్చుండి సాక్షాత్కారమునొందు పర్యంతము

* స్వదేశీయులను వలగొనుచున్న తాంత్రికమత సంబంధమగు అత్యాచారములనుండి వైదికమతవిశుద్ధతను గాపాడు నాత్రమున శంకరుడు వైదికులచే శూద్రులని నిందింపబడుచుండిన సామాన్యజనుల సమస్యలను అంతగా పరిగణింపడయ్యెను. ఇదియే స్వామి యభిప్రాయమని తోచును.

† భగవద్గీత, 6–8.

సాధనచేయవలయును; సాక్షాత్కారానంతరము మాత్రమే యట్లు విహరింప గలుగుట—కాని యది యెప్పటిమాట !

చిన్తాశూన్యమదైన్యభైక్ష్యమశనం పానం సరిద్వారిషు
స్వాతన్త్ర్యేణ నిరఙ్కుశా స్థితిరభీ ర్నిద్రా శ్మశానే వనే,
వస్త్రం క్షాళనశోషణాదిరహితం దిగ్వాస్తు శయ్యా మహీ
సఞ్చారో నిగమాన్తవీథిషు విదాం క్రీడా పరే బ్రహ్మణి.

విమానమాలమ్బ్య శరీరమేతద్
భునక్త్యశేషాన్ విషయానుపస్థితాన్,
పరేచ్ఛయా బాలవదాత్మవేత్తా
యోఽవ్యక్తలిఙ్గోఽననుషక్తబాహ్యః.
దిగమ్బరో వాపిచ సామ్బరో వా
త్వగమ్బరో వాపి చిదమ్బరస్థః.
ఉన్మత్తవద్వాపి చ బాలవద్వా
పిశాచవద్వాపి చరత్యవన్యామ్. *

—బ్రహ్మజ్ఞానికి ఆహారము స్వయముగా, అప్రయత్నముగా లభించును—(నదీతటాకాదులందు) ఎచట దొరకినను ఆతడు నీరు త్రాగును. ఒకప్పు డరణ్యమునను మఱియొకప్పుడు శ్మశానమునను నిద్రించుచు నిర్భయుడై ఆతడు స్వచ్ఛందవిహారము చేయును; వేదచోదితము, వేదములకు సైతము అప్రాప్యము అగు బ్రహ్మమార్గమున ఆతడు చరించును. వాని శరీరము ఆకసమువంటిది; పసిబిడ్డవలె ఆతడు పరులయిచ్ఛచే నడుపబడుచుండును; ఒకప్పు డాతడు దిగంబరుడై, లేదా, జ్ఞానాంబరుడై, మఱియొకప్పుడు దివ్యాంబర

* వివేక చూడామణి.

ధారియై వెలయుచుండును; శౌచాశౌచములను పాటింపక, ఒకప్పుడు పసిబాలునివలెను, మఱియొకప్పుడు పిచ్చివాని చందముననును, వేఱొకప్పుడు పిశాచము రీతిని ఆతడు వర్తించును.

ఇట్టి మహోత్తమస్థితినొంది, ఖడ్గమృగము లీల స్వచ్ఛందవిహారము చేయగలుగుదువుగాక యని గురుదేవుని చరణోపాంతమున ప్రణతు లర్పించు—నీ ప్రియసోదరుడు,

—వివేకానందుడు.

(17)

ఈశ్వరో జయతి!

గాజీపురము, 8-8-1890.

మహాశయా—దయతో మీరు వ్రాసిన లేఖ ఇప్పుడే అందినది. నే నవలంబించినవి కర్కశవేదాంత భావము లేయైనను, అయ్యా, నా స్వభావము చాల మెత్తనిదని మీకు తెలియకపోవచ్చును. ఈ స్వభావమే నన్ను ముప్పుతిప్పల బెట్టుచున్నది. ఒరుల కష్టమును జూచిన నా గుండె జల్లుమనును; ఆత్మశ్రేయమునే లక్షింతమని యెంత ప్రయత్నింతునుగాక, నా కెఱుక లేకయే పరులకీడుమేళ్లనుగూర్చి చింతింప నా మనస్సు నన్ను లాగివేయుచుండును. ఆత్మశ్రేయమును సాధింపవలయునను దృఢసంకల్పమును బూని యీసారి బయలుదేఱితిని గదా, అలహాబాదులో ఒక సోదరుని వ్యాధినిగూర్చి విని వెనుకకు పరుగెత్తవలసి వచ్చెను

హృషీకేశమునుండి ఇప్పుడీ వార్త వచ్చినది. ఇక మనస్సు ఒకనిముసమైనను నన్నిచ్చట నిలువనీయదు. . .నడుమునొప్పి చెడ్డబాధపెట్టుచున్నది; ఇది నన్ను వదలునట్లు కనిపించుట లేదు. . .—దాసుడు, —వివేకానందుడు.

మరియొక సంగతి. ఏ మహాత్మునివద్దకును కే నిక వెళ్లదలచుకోలేదు,—

"ఓ మనసా! నీయందే నెలకొనియుండుము, పరుల ద్వారములకడకు పోయి ప్రాధేయపడకుము; ఏకాంతముగ నీ అంతరంగమున వెదకితివా, స్వేచ్ఛగా గూర్చుండియే నీ యభీష్టమును పొందగలవు. చింతామణి అచటనే కలదు—భగవానుడు నీ వేమి కోరినను ఒసగగలడు; వాని మందిర ద్వారమున, మనసా? అసంఖ్యాకములగు రత్నములు విరజిమ్మబడి యున్నవి సుమీ. సంకల్పమాత్రముననే వరము లొసగు భక్తచింతామణి యాతడు." కమలాకాంతకవి యీవిధముగా గాన మొనరించును.

కావున రామకృష్ణుని కెవ్వరును సాటిరారనునది మహా సిద్ధాంతము; అపూర్వమైన యాతని పరిపూర్ణత, అద్భుతము, అవ్యాజమునగు నాతని సర్వజీవ కారుణ్యము, సంసారబద్ధులయం దాతని యఖండ సానుభూతి—ప్రపంచమున మఱియెచ్చటను కానరావు. కానే వచింపెడిరీతిని ఆతడు అవతారమూర్తియై యుండవలయును, లేదా, లోక కల్యాణార్థము శరీరము దాల్చునని వేదాంతము తెలుపు నిత్యముక్తుడై యుండవలయును. ఇది నానిశ్చయము. ఇట్టి

దివ్యపురుషుని గూర్చియే పతంజలి, "వీతరాగ విషయంవా చిత్తమ్" * అని తెలిపియున్నాడు.

కలనైనను అతడు నా ప్రార్థనను నిరాకరించి యెఱుగడు. నా యపరాధ సహస్రములను అతడు క్షమించెను. అట్టి యఖండ ప్రేమ నా తల్లిదండ్రులైనను నాయెడ చూపి యెఱుగరు. ఇది యెంతమాత్రము కల్పితము కాదు, అతిశయోక్తి కాదు, శుద్ధ సత్యము. ఆతని శిష్యులలో ప్రతివ్యక్తికిని ఈ సంగతి తెలియును. మహాప్రమాద సమయములలో, వ్యామోహసమయములలో, "ఓ పరమేశ్వరా! నన్ను రక్షింపుము" అని దుర్భర వేదనతో విలపించితిని, కాని యెవ్వరివలనను సాయము కలుగలేదు; కాని యీ యద్భుత ఋషీశ్వరుడనుడు, అవతారమూర్తి యనుడు, మఱియెవ్వరనుడు—మానవ హృదయాంతర్వేది యగు ఈ మహనీయుడు తన యమోఘశక్తిచే నా పరితాపము నంతను గ్రహించి, నేను వలదన్నను, నన్ను తన సముఖమునకు బిలిపించుకొని పరితాపవిముక్తుని జేసెను.

ఆత్మ మృత్యురహితమగుచో, తత్కారణమున ఆతడింకను సజీవుడై యున్నచో, "ఓ రామకృష్ణదేవా! అనంత కృపాసింధూ! మదేకశరణ్యా! సర్వథా మహనీయుడగు నా యీ మిత్రుని కోర్కెలను సఫలమొనర్పుము" అని పలుమాఱులు ప్రార్థింతును. లోకమున ఎవ్వడు అద్వితీయ అనంత

* పాతంజలయోగసూత్రము, 1-37. విషయవాసనలను పరిత్యజించిన చిత్తమును ధ్యానించుటవలన(గాని) చిత్తస్థైర్యము కలుగునని భావము.

దయాసముద్రుడని కనుగొంటినో ఆతడు మీకు సకల శుభము లొసగూర్చుగాక! శాంతి శ్శాంతి శ్శాంతిః.

దయయుంచి సాధ్యమైనంత శీఘ్రముగా సమాధానము వ్రాయుడు.—దాసుడు, —వివేకానందుడు.

(18)

జయ! రామకృష్ణ!

గాజీపురము, 15-8-1890.

పూజనీయా—దయతో మీరు వ్రాసిన లేఖ నిన్న అందినది. సురేశ బాబునకు ప్రాణముమీదికి వచ్చినందులకు చాల విచారించుచున్నాను. కానున్నది కాకమానదు. మీరును వ్యాధిగ్రస్తులగుట ఎంతయో విచారకరము. మనసులో ''అహం'' అనునది ఉన్నంతవఱకు నివారణోపాయము నవలంబింప వెనుదీయుట కేవలము పాలుమాలిక, తప్పిదము. అహంకారవిరహితునకో అందురా, సహనమే ఉత్తమము. జీవాత్మ నివాసమగు ఈ శరీరము కర్మసాధనము, (ఆధివ్యాధులచే) దీనిని నరకరూపముగా మార్చువాడు మహాపరాధి, అశ్రద్ధచేయువాఁడును అపరాధియే. ఏమాత్రము సంకోచింపక, పరిస్థితుల ననుసరించి వ్యవహరింపుడు.

నాభినన్దేత మరణం నాభినన్దేత జీవనమ్,
కాలమేవ ప్రతీక్షేత నిదేశం భృతకో యథా.

—జీవనముగాని మరణముగాని అభిలషింపక, (యజమానుని) ఆజ్ఞలను పరిపాలింప సంసిద్ధుడై యుండు భృత్యునివలె శక్తి

కొలదియు ప్రాప్తకర్మముల నొనర్చుచు, కాలమును ప్రతీక్షించుటయే మహోత్తమధర్మము.

...అమ్మకు (శ్రీ శారదా మాతృదేవికి) నా అనంతకోటి ప్రణామములు. జన్మసిద్ధమగు సంబంధములనన్నిటిని తొలగించుకొని, స్వకల్పితబంధములలో చిక్కుకొనకుండుటకుగాను, సమదృష్టికలిగి వర్తించుటకుగాను—మీరందఱును నన్ను ఆశీర్వదింపుడు. శ్రేయస్కరుడగు వాడొకడున్నచో వానికి శక్తియు అవకాశమును ఉన్నచో, మీ కందఱకును ఆతడు అఖండశ్రేయము నొసగూర్చుగాక—ఇదియే నా నిరంతర ప్రార్థన. మీ స్నేహాస్పదుడు, —వివేకానందుడు.

(19)

గాజీపురము, 15-3-1890.

ఆయుష్మంతుడగు—, నీవు మనోవ్యధల పాల్పడుచున్నందులకు చాల విచారించుచున్నాను. నాయనా! నీ యభీష్టమేదియో దానినే చేయుము.

యావజ్జననం తావన్మరణం, తావజ్జననీ జఠరే శయనమ్,
ఇహ సంసారే స్ఫుటతరదోషః, కథమిహ మానవ తవ సన్తోషః.

—"జననమున్నంతవఱకు మరణము నున్నది, మఱల మాతృగర్భప్రవేశము నున్నది. ఈ సంసారమున స్ఫుటతరమగు దోషమిదియే. ఓ నరుడా! ఇట్టి యీ సంసారమున సంతోషము నెట్లు అభిలషించెదవు?"—అప్పుడు, వివేకానందుడు మఱియొక మాట. రేపిచటినుండి బయలుదేఱెదను. విధి యెట్లు నన్ను నడుపునో చూతునుగాక!

(20)

ఓం నమో భగవతే రామకృష్ణాయ !

గాజీపురము, మార్చి, 1890.

శ్రీయుష్మంతుడగు అఖండానందునకు—...మంచివిషయము లెచట గోచరించినను నేర్చుకొనవలయునని నా నియమము. నా గురుభక్తి కిది హానికరమని మిత్రు లనేకులు తలచుచుందురు. పిచ్చివాండ్రును స్వమతదురభిమానులును ఇట్లు భావింతురని నే ననుకొందును. గురువులెల్లరును జగద్గురువగు భగవానుని అంశములే, తేజఃప్రసారములే, కాని భిన్నులుకారని నే ననుకొందును...—ఆశీస్సులు, శుభాకాంక్షలు. సదా —మీ వివేకానందుడు.

(21)

ఓం నమో భగవతే రామకృష్ణాయ !

గాజీపురము, 31-3-1890.

మహాశయ—...మఱియొక సోదరుని శరీరస్థితి బాగుగా లేదు; అందుచే ఆతని విషయమై బెంగపెట్టుకొనియున్నాను. ఆతని విషయమున అతి కఠినాత్ముడనై వర్తించినాను—అనగా నన్ను విడిచిపొమ్మని ఎంతో తొందరపెట్టినాను. ఏమి చేయుదును! నేను అమితదుర్బలహృదయుడను, ప్రేమపాశబద్ధుడను! హృదయకాఠిన్యము కలిగియుండునట్లు నన్నాశీర్వదింపుడు. నా మనఃస్థితినిగూర్చి మీ కేమని చెప్పుదును! అహర్నిశలు హృదయమున కార్చిచ్చు—నరకాగ్ని—భగభగ మండుచున్నట్లున్నది! ఇంతవఱకేమియు—అణుమాత్రమైనను—సాధింపజాలనైతిని! ఈ జీవితము వట్టి

గందరగోళమై, తుదకు వ్యర్థమైపోవుచున్నట్లు కనిపించు చున్నది; ఏమి చేయను తోచుటలేదు! దారితెన్ను కాన రాకున్నది! ఆ బాబాజీ (పవ(నా)హారి బాబా యను యోగి) తియ్యనిమాటలు చెప్పుచు నన్ను వెడలనీయకున్నాడు. ఆహా! ఏమి చెప్పుదును? మీ విషయమున నా అపరాధములు వందలు. వాని నన్నిటిని మనోవ్యథలచే మతిమాలినవానివిగా భావించి నన్ను క్షమింతురుగాక! అ—గ్రహణిచే బాధపడు చున్నాడు. దయతో మీ రాతని స్థితిగతులనుగూర్చి విచా రింపుడు. ఇచటినుండి బయలుదేఱి ఆ తావును జేరిన మా సోదరునితో ఆతడు మా మఠమునకు వెళ్లగోరినయెడల మీరు ఆతని నచటికి పంపుదురేని మహోపకారము చేసిన వారగుదురు. అతికఠినుడను అనియు స్వార్థపరుడననియు నన్నుగూర్చి నా గురుభాయులు (అనగా సోదరశిష్యులు) తలతురు కాబోలును. ఆహా! నేనేమి చేయుదును? నా అంత రంగమును అవలోకించు వారెవ్వరు? అహర్నిశలు నేబడు చున్న పరితాపమెట్టిదో గ్రహించువా రెవ్వరు? సహనమును అచంచలదీక్షను గలిగియుండునట్లు నన్ను ఆశీర్వదింపుడు. మీకు శతకోటి నమస్కారములు...—దాసుడు,

—వివేకానందుడు.

(22)

ఈశ్వరో జయతి!

కలకత్తా, 26-5-1890.

మహాశయా—అనేక విషమపరిస్థితులలో జిక్కుకొని పరి తప్తుడనై యీ లేఖ వ్రాయుచున్నాను. ఈ దిగువ వెల్ల

డించునదంతయు ఎంతవఱకు యోగ్యమో, సాధ్యమో, తద్వ్యతిరిక్తమో, విశ్వనాథప్రార్థన పూర్వకముగా ఆలోచింపుడు, దయతో సమాధానము వ్రాయుడు.

1. ''తిలాతులసీదళములతో'' నాతనువును శ్రీరామకృష్ణ పాదకమలములపైని సమర్పించుకొని యాతని దాసుడనై యున్నాననను సంగతి మీకింతకు ముందే తెలిపి యున్నాను. అతని యాజ్ఞను నే నవజ్ఞ చేయజాలను. ఆ మహాత్ముడు నలువది సంవత్సరములు అఖండత్యాగ వైరాగ్యములను బూని మహాతపమొనర్చి, జ్ఞానభక్తిపరమావధిని ప్రాపించి, అమానుషశక్తులనంది, లోకకల్యాణార్థము జీవితము ధారపోయుటంతయు నిరర్థకమైనచో మనమిక దేనిని నమ్ముకొనియుండవలయునో నాకు తెలియకున్నది. అతని వాక్కులు సత్యస్వరూపుని వాక్కులని నేను నమ్మక తప్పదు.

2. తాను నెలకొల్పిన సర్వసంగత్యాగభక్త సంఘను ఆత్మార్పణమొనర్చి సేవింపవలయునని నా కాతని యాన; ఇందు స్వర్గమో, నరకమో, ముక్తియో—ఏమి సంభవించినను సరియే, నేను దీక్షతో కృషి చేయవలసియున్నది.

3. సర్వసంగత్యాగులగు నాతని భక్తులు ఒక సంఘముగా గూడవలయుననియు, కూడునట్లు నేను చూడవలయుననియు అతని యానతి. కాని మాలో ఎవరైనను ఏదేని తావునకు యాత్రార్థము పోవచ్చుననుటకు సందియము లేదు. కాని ఇవి యాత్రలుగనే లేదా, పర్యటనములుగనే యుండవలయును; పూర్ణసిద్ధునకుమాత్రమే శుద్ధపరివ్రాజకజీవనము

తగునని గురుదేవుని యభిప్రాయము. ఎవ్వరైనను ఆ స్థితి ప్రాపించువఱకును ఎచటనో ఒకచోట నిలుకడ కలిగియుండి సాధనలందు నిమగ్నులగుట సముచితము. దేహాభిమానాదులు నమసిపోయిన పిమ్మట ప్రాప్తమార్గమును దేనినైనను అవలంబింపవచ్చును. సదా పరిభ్రమించుచుండుట సాధకునకు హానికరము.

* * * *

4. అనేక కారణములచే రామకృష్ణభగవానుని శరీరమును దహనము చేయవలసివచ్చినది. ఇది బహునింద్యమనుటకు సందియములేదు. ఆతని యస్థులు భద్రపఱుపబడినవి; గంగాతీరమున ఏదేని యొక తావున తగిన యాలయమున వానిని స్థాపించిన గొంతవఱకు పాపపరిహారము చేసికొనినవారమగుదుమని నా యభిప్రాయము. ఆతని యస్థులను ఆసనమును రూపపటమును ఉచితరీతిని మా మఠమున నిత్యము పూజింపబడుచున్నవి; నా బ్రాహ్మణ సోదరశిష్యులొకడు అహర్నిశలు ఈ కార్యమును నిర్వహించుచున్న సంగతి మీకు తెలిసినదే...

* * * *

5. ...యువకులు, సద్వంశసంజాతులు, విద్యావంతులు, వినిర్మలహృదయులునగు ఈ సన్న్యాసులు అందఱును తోడ్పాటును నిలువ నీడయు లేమి శ్రీరామకృష్ణుని దివ్యాదర్శముల నవలంబింపజాలకుందురేని, అహా! అది మన దేశ దౌర్భాగ్యముకాక మఱేమి?

6. "నీవు సన్న్యాసివి కదా, నీకీ తాపత్రయ

యెందుకు ?" అని మీరు నన్నడిగితిరా. "నేను రామకృష్ణుని దాసుడను, ఆతడు జన్మించి, సాధనయొనర్చిన దేశమున ఆతని నామమును నిలుపగలుగుదు నేని, ఆతని పవిత్రాదర్శముల నవలంబింప శిష్యులకు లేశమైనను తోడ్పడగలుగుదు నేని, దోపిడిచేయుటకైనను సంసిద్ధుడను" అని నా సమాధానము. మీరు నా కత్యంతాప్తులని నే నెఱుగుదును. కావున నా మనస్సును విప్పి చెప్పుచున్నాను...—దాసుడు,

—వివేకానందుడు.

(23)

కలకత్తా. 6-7-1890.

ఆయుష్మంతుడగు—...నీవు కలకత్తాకు వచ్చుటకై అంతో శనపడవలయునని నే ననుకొనను. తిరిగినంత తిరిగితివి, మంచిది, అది చాలును. కాని నీవు చేయవలసిన కార్యమును, అనగా ఒకతావున గూర్చుండి ధ్యానదీక్ష బూనుటకు ఇంకను నీవు ప్రయత్నింపవైతివి. సామ్యము చెప్పునట్లు, "పిల్లా! లెమ్ము! నీ పెండ్లి నీకోసము కనిపెట్టుకొని ఉన్నది!" అని అకస్మాత్తుగా వధువును నిద్రనుండి లేపుటవంటిది కాదు జ్ఞానసాధన. ఏ యుగముననైనను ఏ కొలదిమందియో జ్ఞానము నందగలరు; కావున "హాతోవా జిత్వావా" అను రీతిని అఖండదీక్షతో సాధనచేయవలయును—ఇది నా పురాతన పద్ధతి—నీకు తెలిసినదే కదా. నవీన సన్న్యాసినామకుల జ్ఞానాడంబరమునుగూర్చి నాకు బాగుగా తెలియును... బృందావనమున—తోనున్నవాడు బంగారముచేయుట నేర్చు

కొని "పక్కాజ్ఞాని" యైనాడట!...శ్రీరామరక్ష! నీవును "తథాస్తు!" అనవచ్చును!

...నేనిక పవ(నా)హారి బాబావద్దకుగాని, మఱి యే మహనీయునివద్దకుగాని వెళ్లదలచుకోలేదు—వారు పరమ సంకల్పమునుండి దృష్టిని మఱల్తురు. ఇక తిన్నగా గమ్యస్థానమునకే!

...మీ రెవ్వరును ఇచటికి రానక్కఱలేదు. ఆత్మశ్రేయము నరయక అనేకులు ఒకచో గుమిగూడుటవలన ఏమి లాభము? మతిమాలినవారై సదా ఒకచోటినుండి మఱియొక చోటికి తిరుగుచుండకూడదు—అదియంతయు చాల మంచిదే—కాని మీరు వీరులు కావలయును.

నిర్మానమోహా జిత సఙ్గ దోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,
ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖ సంజ్ఞై
ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్.

(గీత. 15-5.)

"మానమోహములు త్యజించి, సంగదోషమును జయించి, ఆత్మనిరతులై, నివృత్తకాములై, శీతోష్ణాది ద్వంద్వములందు సములై జ్ఞానులు నాశరహితమైన పదమును — మోక్షమును — ప్రాపింతురు."— అప్పుడు,

—వివేకానందుడు.

(24)

అల్గొరాగ్, 14-4-1891.

స్నేహాస్పద—, ...స్వార్థరహితుడవు అగుటకు ప్రయత్నింపుము, అకలంకుడవగుటకు ప్రయత్నింపుము—సమస్త ధర్మతత్త్వము ఇదియే...—అప్పుడు,

—వివేకానందుడు.

(25)

అబు, 30-4-1891.

స్నేహాస్పద—, ఆ బ్రాహ్మణబాలునికి ఉపనయనము చేసితివా? సంస్కృతము చదువుచున్నావా? ఎంతవఱకు వచ్చినది?...మొదటిభాగము ముగించినాననుకొందును. నీ శివపూజను శ్రద్ధగా చేయుచున్నావా? లేనియెడల శ్రద్ధ వహింప ప్రయత్నింపుము. "Seek ye first the kingdom of God and all good things will be added unto you." (భగవంతు నన్వేషించువానికి సకల శుభములును చేకూరును—బైబిల్.) * ...వత్సలారా! ధర్మరహస్యము వాదములందును సిద్ధాంతములందును లేదు, ఆచరణలో నున్నది. మానవుడు సజ్జనుడై సత్కార్యములు చేయువల

* అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.
(గీత. 9-22).

"ఎవరు ఇతరచింతలనువీడి నన్నే ఉపాసించుచుందురో వారి యోగక్షేమములను నేను వహింతును."

యును—ఇదియే పరమార్థము. "Not he that crieth 'Lord', 'Lord', but he that doeth the will of the Father." 'ఈశ్వరా!' 'ఈశ్వరా!' యని యఱచునట్టి వాడు కాడు, ఈశ్వరాజ్ఞను పరిపాలించువాడే ఈశ్వరభక్తుడు ...ఆశీస్సులు. —మీ వివేకానందుడు.

మఱియొకమాట. లోకమువలన అప్పుడప్పుడు ఒడుదొడుకులు కలుగుచుండినయెడల 'కంగారుపడకు'; శీఘ్రకాలముననే అంతయు చక్కబడును.

(26)

బొంబాయి, 20-9-1892.

పండితమహాశయా—మీరు వ్రాసిన లేఖ సకాలమున అందినది. అనర్హుడనగు నన్ను మీరు అంతగా శ్లాఘించుటెందులకు? "None is good, save One, that is, God" అని ఏసుప్రభువు చెప్పినట్లు, "ఒక్కరుతప్ప మఱెవ్వరును యోగ్యులుకారు, ఆ ఒక్క రెవ్వరనిన, భగవంతుడు." మిగిలినవారందఱును వానికి నిమిత్తమాత్రులు. భగవానునకును అర్హులగు మహనీయులకును జయమన జెల్లునుగాని నావంటి అనర్హునకు జెల్లునా? "ఈ భృత్యుడు ఈ బహుమానమునకు తగడు." అదిగాక నావంటి యొక పకీరునకు ఏవిధమైన స్తోత్రమునకును అధికారము లేదు. తనవిధిని నిర్వర్తించినందులకు మీ సేవకుని మీరు శ్లాఘింతురా?

...ఇక మఱియొక విషయము...మనదర్శనము లన్నిటియందును ఏదియో యొక సామాన్య ప్రతిపాదనమును పురస్కరించుకొని మహాసూక్ష్మమైన యుక్తులు బయల్వెడలు

చుండును. కాని యీ ప్రతిపాదనములేక ప్రతిజ్ఞ యెంత ఆభాసముగా నుండవలయునో అంత ఆభాసముగా నుండ వచ్చును. ఈ సామాన్య ప్రతిపాదనము లెంతవఱకు సత్యములో అడిగినవారును, అరసినవారును ఎవ్వరును లేరైరి. స్వతంత్రవిజ్ఞానమని చెప్పుకొనదగినది మనకు ఇంచుమించుగా ఏమియు లేదయ్యెను; అందువలననే పరిశీలన ఫలితములును, సామాన్యీకరణము పై నాధారపడియుండునవియునగు శాస్త్రములు మనకు కొఱవడినవి. ఎందుచేత ?—రెండు కారణములు కనిపించుచున్నవి ;—ఒకటి కార్యపరత్వముకంటె విశ్రాంతిని ధ్యానమును విశేషముగా అభిలషింప మనలను నిర్బంధించు ఘోరమైన ఉష్ణము; రెండవది ఆచార్యులు, పురోహితులునగు బ్రాహ్మణులు దూరదేశములకు ఎన్నడును పయనింపకుండుట. దూరదేశములకు ప్రయాణమొనర్చిన వారు లేకపోలేదు. కాని వారు సర్వసాధారణముగా వర్తకులు—అనగా స్వలాభాపేక్షచేనేమి, మతాచార్యకైతవముచేనేమి, ధీవికాసమునొందు సామర్థ్యమునంతను కోల్పోయినవారు. కావున వారు తెల్పిన విషయములు మానవ విజ్ఞానమును పెంపొందించుటకుబదులు దానిని క్షీణింపజేసినవి. వారి పరిశీలన సరియైనదికాదు; వారు తెల్పిన వృత్తాంతములు అతిశయోక్తులు; అవి సత్యమును పూర్తిగా మఱుగు చేసినవి.

కావున మనము ప్రయాణము చేయవలయును, విదేశయానము చేయవలయును. సాంఘికయంత్రము ఇతరదేశములలో ఎట్లు నడచుచున్నదో కనుగొనవలయును, మన

జాతీయతను మరల సజీవమొనర్చుకొనవలయునన్నచో ప్రపంచమందలి యితర జాతుల మానసములెట్లు ప్రవర్తించుచున్నవో బాహాటముగా అరయవలయును, వారితో రాకపోకలు గలిగియుండవలయును. అన్నిటికంటెను జనసామాన్యమును హింసించుట మానవలయును. ఆహా! దేశమెంత దౌర్భాగ్యస్థితిలోనికి దిగినది! మాలడు మాలడుగనే ఎవ్వరియొద్దకైనను వచ్చినపక్షమున వానిని మహామారినవలె తఱుమగొట్టుదురు. కాని యే 'పాదిరి' వలననో తలపై గిన్నెడు నీటిని పోయించుకొని, యెంత శిథిలమైనది కానిండు, ఒక కోటును వెన్నునకు తగిలించుకొని శుద్ధసనాతన హిందువుని గదిలోనికి వచ్చినంతనే, వానికి మనఃపూర్వకమగు ప్రత్యుత్థానములును గంభీరమగు కరచాలనములును! వీనిని (ఈ మర్యాదలను) నిరాకరింప సాహసించువాడెవ్వడును కానరాడు!! ఇంతకంటె దౌర్భాగ్యము వేఱుండునా? ఆ పాదిరీలు ఈ దక్షిణ హిందూదేశమున ఏమిచేయుచున్నారో వచ్చిచూడుడు. 'హీనజాతు' లనబడువారిని లక్షలకొలది మందిని వారు తమ క్రైస్తవమతములోనికి లాగుకొనుచున్నారు; ఇక అగ్రజాతులు ప్రజాపీడనమున సివమాడుచున్న తిరువాన్కూరులో—ఎచ్చట ప్రత్యంగుళము నేలకును బ్రాహ్మణులే భూస్వాములై యున్నారో అట్టి తిరువాన్కూరులో—ఎచ్చట రాజకుటుంబస్త్రీలుకూడ బ్రాహ్మణులకు ఉంపుడుకత్తెలై జీవించుట మహాగౌరవప్రదమని తలతురో అట్టి తిరువాన్కూరులో—ఇంచుమించు నాల్గవవంతు జనాభా క్రైస్తవమతములోనికి దిగినది! నేను వారిని నిందింపజాలను...

ఓ పరమేశ్వరా! లోకమున ఎపుడు, ఎప్పుడు, సౌభ్రాత్రము వెలయునో కదా!—భవదీయుడు, —వివేకానందుడు.

(27)

బొంబాయి, 22-5-1898.

దివాన్ మహాశయా—...లోకమున ఉత్తమోత్తములు సైతము మహాపదలపాలగుచుందురు. దీనికి హేతువు కాన్పింపకుండుగాక, కాని సమస్తము సారమునుబట్టి చూచి నచో యోగ్యముగనే యుండుటయు, బాహ్యమున అల్ల కల్లోలము తోచినను అంతరంగమున అనంత ప్రేమ సౌజన్య ములు వెలయుచుండుటయు నా జీవితానుభవము. ఈ యంత రంగమును ప్రాపింపకుండునంతవఱకు బాధపడుచుందుము, కాని యా యనంతశాంతి మండలమును ప్రాపించినంతనే యిక సుడిగాడ్పులు చెలరేగుగాక, తుపానులు వీచుగాక, యుగాచల నిర్మితసౌధము చలింపజాలదు...—మీ స్నేహి తుడు, —వివేకానందుడు.

(28)

అమెరికాకు వెడలుటకు ముందు వంగదేశమునందలి యొక శిష్యురాలికి స్వామి వ్రాసిన లేఖ

బొంబాయి, 24-5-1898.

అమ్మా—... సదా శ్రీకృష్ణభగవానునకు ఆత్మార్పణము గావించుకొనుము. మనము భగవంతునిచేతిలో కేవలము కీలుబొమ్మలమని సదా జ్ఞప్తిలో నుంచుకొనుము. సదా నిర్మల హృదయవై యుండుము. తల్లీ! వాక్కర్మములందేగాక భావ

మునస్సైతము కాలుష్యము నొందకుండుటకుగాను శ్రద్ధవహింపుము; శక్తికొలదియు ఒరులకు మేలుచేయ బ్రయత్నింపుము. త్రికరణశుద్ధిగా భర్తను సేవించుటయే నారీమతల్లుల పరమ ధర్మమని జ్ఞప్తిలో నుంచుకొనుము. అవకాశము లభించినంతవఱకు భగవద్గీతను పఠింపుము. తల్లీ!...'దాసి' యని సంతకము చేసితివేల? శూద్రులును వైశ్యులును—'దాసుడు', 'దాసి' యని యిట్లు వ్రాలుచేయవచ్చును కాని బ్రాహ్మణులును క్షత్రియులును—'దేవుడు', 'దేవి' యని యిట్లు వ్రాలుచేయవలయును. అదిగాక యీ జాతిభేదాదులు మన నవీన బ్రాహ్మణపండితంమన్యుల కల్పనలు. ఎవరు ఎవరికి దాసుడు, లేక దాసురాలు? ఎల్లవారును పరాత్పరుడగు వారికి దాసులు...తల్లీ! ఇంతకంటె వ్రాయుట అనావశ్యకము; నీ క్షేమార్థము సదా భగవంతుని ప్రార్థించుచున్నానని గ్రహింపుము...—ఆశీస్సులతో విశ్వసనీయుడు.

—వివేకానందుడు.

*(29)*

ప్రియుష్మంతుడగు—, ...ఒక్కమాట. మఱల నిన్ను నేను చూడజాలకపోవచ్చును—ఈ సంగతి మఱవకుము. నీతి నియమములను పాలింపుము. ధీరుడవై యుండుము. ఏ విషయమునకైనను హృదయపూర్వకముగా వర్తించు వ్యక్తివికమ్ము. నైతికనియమములను వీసమైనను దాటరాదు సుమీ. ప్రాణాంతకమగు పరిస్థితులలోనైనను ధైర్యమును విడనాడకుము. వివిధమతసిద్ధాంతములనుగూర్చి మనస్సును

కలవరపెట్టుకొనకుము. పిఱికిపందలు మాత్రమే పాపము చేయువారు, ధీరులు ఎన్నటికిని—భావమందైనను—పాపము చేయరు. స్వయముగా ధీరుడవై ప్రస్తుతము నీ సంరక్షణమందున్న...ను ధీరులుగను ధర్మపరులుగను దీనులయెడ సానుభూతిపరులుగను ఒనర్పుము. వత్సలారా! ధైర్యము, ధార్మికనిష్ఠ—ఇంతకంటె మీకు వేఱొక పరమార్థము లేదు. పిఱికితనము, పాపాచరణము, దౌర్జన్యము, దౌర్బల్యము—అనునవి లేనిచో మిగిలినదంతయు స్వయముగనే లభించును... మఱియు నీతో ఎన్నడును...ఏ నాటకశాలకును దీసికొని వెళ్లకు, దౌర్బల్యహేతువగు ఏ ప్రదర్శనమును వినోదమును ఎన్నడును జూడనీయకు.—అప్పుడు. —వివేకానందుడు.

*(30)*

నాయనలారా! పిఱికిపందలును దుర్బలులును మాత్రమే పాపమునకు ఒడిగట్టుదురు, అసత్యములాడుదురు. ధీరులెప్పుడును ధర్మనిష్ఠులైయుందురు. ధార్మికులై యుండ బ్రయత్నింపుడు, ధీరులై యుండ బ్రయత్నింపుడు, ఆర్ద్రహృదయులై యుండ బ్రయత్నింపుడు. —మీ వివేకానందుడు.

*(31)*

యొకోహామా, 10-7-1898.

స్నేహాస్పద—, ...కొలంబో, పినాంగ్, సింగపూరులకు పిమ్మట హాంగ్ కాంగులో ఆగితిమి. ఇచటికి వచ్చినచో మీకు చైనాను జేరినట్లు తోచును, చైనా దేశస్వభావము అంత విశేషముగా ఇచట గోచరించును. కృషియంతయు,

వ్యాపారమంతయు చైనావారి చేతులలోనే ఉన్నట్లు కాన్పిం చును. ఇక హాంగ్ కాంగే నిజమైన చైనా. ఓడకు లంగరు వేసినంతనే మిమ్ము నేలమీాదికి గొనిపోవుటకు వందలకొలది చైనాదేశపు పడవలువచ్చి చుట్టుముట్టును. రెండు చుక్కానులతో గూడిన యీా పడవలు చాల విచిత్రముగా నుండును. సరంగు కుటుంబసహితముగా పడవలోనే కాపురముండును. ఒక చుక్కానిని తన చేతులతోను మఱియొకదానిని పాదములతోను నడపుచు వానిభార్య సర్వసాధారణముగా చుక్కానివద్ద నుండును. నూటికి తొంబదింట ఒక పసిబిడ్డ ఆమె నడుమునకు గట్టబడియుండుట కాననగును. ఆ బిడ్డ కాలుసేతులుమాత్రము స్వేచ్ఛగా విడువబడియుండును. ఇపుడు బరువుల నీడ్చుచు, ఇపుడు మహాచాకచక్యమున పడవనుండి పడవమీాదికి లంఘించుచు, ఆమె కోలాహలముగా పనిచేయుచుండ మన చిన్నిబుడుతడు—John Chinaman—కిక్కుఱుమనకుండ ఆమె నడుమునుండి వ్రేలాడుచుండుట అతి విచిత్రముగా నుండును. ఇక పడవలును పొగయోడ వెనుకనుండు చిన్నచిన్న నావలును, ఓ! గుంపులు గుంపులుగా లోనికి చొఱుచుకొనివచ్చుచుండును, బయటికి వెడలుచుండును. ఈ కోలాహలమున పిలకతో సహా మన బుడుతని తల ఎపుడు పొడియైపోవునో అనిపించును—కాని యీా కుఱ్ఱనికి కేవలము నిశ్చింత. ఈ వ్యాపారజీవనపు టట్టహాసము పీసమైనను వాని నాకర్షించునట్లు అగపడదు; వ్యాపారాందోళనమున మునిగి తేలుచున్న తల్లి పదేపదే తనకిచ్చు చిన్నబియ్యపు రొట్టెముక్కయొక్క

తత్త్వము నరయుచు అతడు సంతృప్తుడై యుండును. చైనా బిడ్డడు మహా వేదాంతి. మీ హిందూ దేశపు కుఱ్ఱడు ఇంకను ప్రాకుచు, దేకుచుండునట్టి స్థితిలో అతడు పరమశాంతముగా పనిచేయ వెడలును. " ఆవశ్యకతయొక్క తత్త్వము అట్టిది. చైనా దేశీయులును హిందూ దేశీయులు నిర్జీవనాగరికతయందు చదికిలబడియుండుటకు వారి పరమదారిద్ర్యమే ఒక కారణము. సామాన్య హైందవునికిగాని చైనా దేశీయునికిగాని దైనందిన జీవనసమస్యయే మహా ఘోరమైయుండ, మఱి దేనినిగూర్చి కాని అతడు చింతింపజాలకున్నాడు.

...హాంగ్ కాంగులో మేము మూడునాళ్లు ఉండి, ఒక నదియొక్క ఉపరిభాగమున ఎనుబది మైళ్ల దూరమున నున్న కాన్ టన్ అను పట్టణమును జూడబోయితిమి. ఏమి జీవనాందోళనము! ఇంపుమింపుగా నీటిని కప్పివేచిన ఏమి అసంఖ్యాకమైన పడవలు! వాణిజ్యమును సాగించుపడవలే గాక, నివసించుట కుపయోగపడునవి వందలు. వానిలో అనేకము చాల చక్కనివి, బహుదీర్ఘమైనవి. చుట్టును గల వసారాలతో, నడుమ వీథులతో, రెండు మూడు అంతస్తుల యెత్తైన నిజముగా అవి పెద్ద భవనములు—ఇక నివియన్నియు నీటిపై దేలియాడుచుండును!

చైనాప్రభుత్వముచే విదేశీయులుండుట కొసగబడిన చిన్నప్రదేశమున మేము దిగితిమి. మా చుట్టును నదికిరు వంకల మైళ్లపర్యంతము త్రోయుచుకొనివచ్చుచు, పొంగుచు, పోరాడుచు, ఘోషించుచునట్టి మహాజనసముద్రము—మహా

నగరము—వ్యాపించియున్నది. కాని యింత జనాభాతో, ఇంత వ్యాపారసంకులముతో గూడియున్నను ఈ పట్టణమంతటి పరమాసహ్యమైన పట్టణమును నేనెన్నడును చూడలేదు,—ఆ యసహ్యాత పురపారిశుద్ధ్యవిహీనతచే గలుగు మన హిందూదేశపు పట్టణముల అసహ్యాతనంటిదికాదు సుమీ—ఆ మాటకువచ్చిన, చైనాదేశీయులు చెత్తను అణుమాత్రమైనను ఊరక పోనీయరు; ఇక నేమన చైనా మానవుడు జన్మమున నెన్నడును స్నానము చేయునని శపథము పట్టినట్లు కనిపించును! ప్రతి గృహమును ఒక అంగడియే, జనులు పై యంతస్తులో మాత్రమే నివసింతురు. వీధివెంట వెడలుచుండ, ఇరువైపులను ఉన్న అంగడులు మనకు తగులునేమో యనునంతటి ఇఱుకుగా నుండును. ప్రతి పది బారలకును ఒక మాంసపు దుకాణము, ఇక వానిలో కుక్కమాంసమును పిల్లిమాంసమును అమ్ము దుకాణములుగూడ కలవు. కాని చైనావారిలో పరమదరిద్రులు మాత్రమే కుక్కలను పిల్లులను తిందురు.

చైనాలో కులీనస్త్రీలు పరులకు కనిపించరు. ఉత్తర హిందూదేశమున మన స్త్రీలకు ఎంత రాణివాసమో, వారలకంతటి రాణివాసము. కార్మికజాతులలోని స్త్రీలుమాత్రమే పరులకు కనబడుదురు. వీరిలోకూడ మీ చిన్నిబిడ్డ పాదముల కంటెను చిన్నపాదములుగల స్త్రీ అప్పుడప్పుడు కనిపించుచుండును, కాని యీ స్త్రీలు కుంటుదురనియు దూకుదురనియునే కాని నడతురని చెప్ప వలనుపడదు.

నేననేక చైనాదేవాలయములను జూడ వెడలినాను.

కాన్‌టన్‌లో అత్యున్నతమైన దేవాలయము ప్రథమ బౌద్ధ చక్రవర్తియొక్కయు మొదటి ఐదువందల బౌద్ధశిష్యుల యొక్కయు జ్ఞాపకార్థము నిర్మితమైయున్నది. ఐనను అందు ప్రధాన విగ్రహము బుద్ధునిదే, అతనికి పిమ్మట దిగువను చక్రవర్తియు ఇరుప్రక్కలను శిష్యులును ఆసీనులై యున్నట్లు అన్నియు కఱ్ఱతో అతిరమణీయముగా చెక్కబడి యుండును.

కాన్‌టన్ నుండి తిరిగి హాంగ్‌కాంగునకును అటనుండి జపాన్‌నకును పయనించినాము. మేము చేరిన మొదటి ఓడరేవు 'నాగసకి'. కొన్నిగంటలగుసరికి దిగి పట్టణవీధులగుండ బండిపై పయనించినాము. ఏమి వ్యత్యాసము! జపాన్ దేశీయులు ప్రపంచమందలి పరిశుభ్రమైన జనులలో ఒకరు. ప్రతివస్తువును చక్కగా, పొందికగా నుంచును. ఇంచు మించుగా వారి వీథులన్నియు విశాలములై, తిన్ననివై, క్రమగతిని నిర్మితమై యలరారుచుండును. వారి చిన్న యిండ్లు పంజరములవలెనుండ, (Pine) దేవదారువృక్షము లతో సదా పచ్చనివై యొప్పు చిన్నచిన్న కొండలు ఇంచు మించుగా ప్రతిపట్టణమునకును గ్రామమునకును వెనుకతట్టున వెలయుచుండును. కుఱుచకాయములతో, చక్కని శరీర చ్ఛాయతో, విచిత్రమగు దుస్తులతో నొప్పు జపాన్ దేశీయులు,—వారి నడత, ధోరణులు, హావభావములు, అన్నియు చిత్రోపమములు. జపాన్ దేశము సొగసునకు తావలము! చిన్నచిన్న పొదరిండ్లతో, పచ్చికబయళ్లతో, చిన్నజాతివంతెనలతో, కృత్రిమతోయములతో, దేశీయ

వైఖరిని నిర్మితమై యొప్పు నొక యుద్యానము ఇంపుమిరించు ప్రతి గృహమునకును వెనుకతట్టున వెలయుచుండును.

* * * *

ప్రస్తుత కాలావశ్యకతను గుర్తింప జపాన్ దేశీయులు పరిపూర్ణ ప్రబోధము నొందినట్లు కాన్పించును. వారి సైనికోద్యోగులలో నొకడు కనుగొనినదియు, అనుపమానమని చెప్పబడునదియు నగు తుపాకులతో సర్వాంగీణమై వెలయు సైన్యము వారి కిపుడు కలదు. ఇదిగాక వారు తమ యుద్ధ నౌకాదళమును అనవరతము అభివృద్ధి నొందించుకొను చున్నారు.

ఇక వారి నిప్పుపెట్టె కర్మాగారములో! చూడ సొంపైనవి; తమకు కావలసిన సమస్తము వారు తమ దేశము లోనే నిర్మించుకొన దీక్ష వహించియున్నారు. చైనా జపాన్ దేశములకు నడుమ పయనించు జపాన్ దేశపు వాణిజ్యనౌకా దళము ఒకటి కలదు; అది అచిరకాలముననే బొంబాయి యోకొహోమాలమధ్య చరింప నుద్యమించుచున్నది.

నేను దేవాలయములను కావలసినన్ని చూచినాను. పురాతన వంగలిపిలో వ్రాయబడిన కొన్ని సంస్కృతమంత్ర ములు ప్రతి దేవాలయమందును గలవు. అర్చకులలో ఏ కొలదిమందికి మాత్రమో సంస్కృతము తెలియును. కాని వారు ధీమంతులు. అభివృద్ధి నిమిత్తము నవయుగాభి నివేశము అర్చకులనుగూడ ఆవహించినది. జపాన్ దేశమును గూర్చి నా మనసులో నున్నదంతయు ఒక చిన్న లేఖలో

ప్రాయజాలను. మన యువకులు పదులకొలది, వందలకొలది, ప్రతి సంవత్సరము జపాన్ దేశమును దర్శింపవలెనని మాత్రమే నేను కోరెదను. జపాన్ దేశీయులకు భారతదేశ మింకను సద్విషయముల కన్నిటికిని, ఉన్నతతత్త్వముల కన్నిటికిని పీఠస్థలి. ఇక... జీవితమంతయు అర్థరహితప్రసంగ ములుచేయు నట్టి 'కబుర్ల రాయుళ్లు' అగు మీరో,... వచ్చి జపాన్ దేశీయులను జూచి సిగ్గుచే తలవంచుకొనుడు. స్వమత దురభిమానమున మతిహీనులగు మీరు బయటికి వచ్చి నంతనే జాతిభ్రష్టత సిద్ధించును, మీకు, పాపము! ఈ యాహారము స్పృశ్యమా, ఆ యాహారము స్పృశ్యమా—— అను చర్చలతో శక్తిసామర్థ్యములనన్నిటిని శతాబ్దములనుండి వ్యయించుచు, బహుయుగ పర్యంతముగు సాంఘిక రాజుల శాసనములచే మానవత్వ మనునది అడుగంట, కరుడుకట్టిన ఛాందసముచే, మూఢవిశ్వాసములచే, ఇలదిన్మత్తి, శతాబ్దముల కొలది చదికిలబడియున్న మీరో, మీ స్థితి యెట్లున్నది? ఇక మీ రిపుడు చేయుచున్న దేమి!... 'పుస్తకం హస్తభూషణమ్' అనునట్లు చేతులలో పుస్తకములతో సముద్రతీరమున విహరించుచు, ఐరోపాధీసంజాతమైన యే శాస్త్రములనుండియో నాలుగు ముక్కలు ముక్కున కంటించుకొని వాని నేకరువుపెట్టుచు, యావదాత్మను ముప్పది రూకల 'గుమస్తా పదప్రాప్తి' పై, లేదా, యువభారతదేశమునకు ఆశాపరమావధి యనదగు 'లాయరుపదవి' పై లగ్నమొనర్చి——యిక ప్రతి విద్యార్థియు క్షుద్బాధచే అల్లాడు పిల్లలపటాలము ఆహారముకొఱకు 'కాకురు బీకురు' మనుచు

దన వెంటబడి దేవిరించుచుండ—మీ రిపుడు చేయుచున్న దేమి? మిమ్ములను, మీ పుస్తకములను, మీ గౌనులను, మీ విశ్వవిద్యాలయ బిరుదములను—సర్వము ముంచివేయ జాలినంత నీరు సముద్రమున లేదా?

లెండు, మీ పౌరుషమును బ్రకటింపుడు! సదా పురోవృద్ధిని అరికట్టు పురోహితప్రభువులను మతాచార్యులను లేశమును లెక్కసేయకుడు! ఏలందురా, వారి మనస్సు లిక మాఱవు, వారి హృదయములు వికసింపవు. తరతరముల నుండి వచ్చుచున్న మూఢవిశ్వాసములును రాక్షసశాసనములును వారిని కన్నతల్లులు. మతాచార్యకైతవమును కూకటివేళ్లతో పెల్లగించివేయుడు! మీ కూపములనుండి వెలువడి శాహాటముగా నలునైపులను దిలకింపుడు. ప్రపంచమందలి వివిధజాతు లెట్లు ముందంజవేయుచున్నవో చూడుడు. (సోదర) మానవుని మీరు ప్రేమింతురా? స్వదేశమును మీరు ప్రేమింతురా? ప్రేమించుచో రండు, ఉన్నతపరిస్థితులకై, యోగ్యతరస్థితిగతులకై నడుముగట్టుదము; వెనుకకు జూడకుడు. సన్నిహితులును ప్రియతములును విలపించినను వెనుకకు జూడకుడు! ముందునకేగాని వెనుకకు జూడవలదు!

భారతమాత వేలకొలది యువకుల త్యాగమును గోరుచున్నది; వలయునది ఇట్టి యువకుల మనోబలము, పశుబలముకాదు. పాషాణతుల్యమగు మీ నాగరికతను—ఆచారములను—సడలింప భగవత్ప్రేరణముననే ఆంగ్ల ప్రభుత్వ మిచటికి వచ్చినది, ఇక భారతదేశమున ఆంగ్లేయు

లకు ఆస్పదమొసగ మొదట తోడ్పడిన జనులను సమకూర్చి నది చెన్ననగరమే. మీ తండ్రి తాతల నిరంకుశాధికారముచే పశుతుల్యముగా జేయబడిన మీ దరిద్రసోదరకోటి నుద్ధరించుటకై—నూతన పరిస్థితులను గొనివచ్చుటకై—పేదలయెడ సానుభూతిని—క్షుధార్తులగువారి కడుపుమంట చల్లార్ప బట్టెడన్నమును—జనసామాన్యమునకు విద్యను—చేకూర్చుటకై—ప్రాణముల నర్పించు త్యాగులను చెన్న నగరము ఇపుడు ఎందఱను సమకూర్పగలదు ?—అప్పుడు,

—వివేకానందుడు.

మఱియొక మాట. వలయునది శాంతము, నిరాడంబరము, అచంచలమునైన కృషి—అంతియేకాని వార్తాపత్రికా వంచనకాదు, పేరు ప్రతిష్ఠలకై ఉబలాటముకాదు, ఈ సంగతి సదా జ్ఞప్తిలో నుంచుకొనుడు,

—వివేకానందుడు.

(32)

మెటాఫుకాస్, 20-8-1893.

స్నేహాస్పద—, ...ఇక్కడ నే జేయువలసిన వ్యయము అతి ఘోరముగానున్నది. సగటున దినమునకు నాకు ఒక పౌన్డు (అనగా ఇంచుమించు రూ. 18-4-0) అగును; ఒక పొగచుట్టవెల మన లెక్క ననుసరించి ఎనిమిదణాలు. అమెరికాదేశీయులు ధనమును నీటివలె వ్యయింతురు, వారంతటి ధనికులు; శాసననిర్బంధముచే వారు ప్రతివస్తువు యొక్క వెలను ప్రపంచమందలి మఱియే యితర జాతియు

సమీపింపజాలనంతగా పెంచియుంచెదరు. సామాన్యుడగు ప్రతి కూలివాడును దినమునకు తొమ్మిది లేక పది రూపాయిలను సంపాదించి ఖర్చుచేయును. బయలుదేఱుటకు ముందు మనకుండిన పెద్దపెద్ద ఆశలన్నియు పటాపంచలగుటయు ఘోరపరిస్థితులను నేనిపుడు ఎదుర్కొనవలసివచ్చుచున్నది. ఈ దేశమును వీడి భారతదేశమునకు మఱలుదమని నూఱుసార్లు అనుకొంటిని. కాని నేనిపుడు కృతనిశ్చయుడనై యున్నాను. నాకు ఒక ఈశ్వరాదేశము కలదు; మార్గమేదియు కానరాకున్నను పరమేశ్వరుడే మార్గమును జూపును. జీవనమో, మరణమో, ఏమి ప్రాప్తించినను సరియే నా కార్యమును నేను వీడరాదు.

నేనిపుడు బోస్టన్ సమీపమందలి యొక గ్రామమున వృద్ధురాలగు నొక యిల్లాలికి అతిథినై యున్నాను. రైలుబండిలో అకస్మాత్తుగా నా కామె పరిచయము కలుగుటయు నన్నామె తన యింటనుండుమని యాహ్వానించెను. ఆమె యింటనుండుటవలన దినమునకు నా ఒకపౌను వ్యయమును కూడివచ్చుట నాకొక లాభము, తన స్నేహితుల నిచటికి పిలిచి, హిందూదేశమునుండి వచ్చిన వింతను జూపుట ఆమెకొక లాభము! ఇదియంతయు సహింపవలసియున్నది. ఉపవాసము, చలి, నా విచిత్రపు దుస్తులను జూచి వీధులలో వెక్కిరింపులు, లేవిడిగొట్టుచు పిల్లలు నన్ను వెంబడించుటలు—వీని నన్నిటిని నే నెదుర్కొనవలసియున్నది. కాని నాయనా! అష్టకష్టములు పడనిదే ఏ ఘనకార్యమును ఎవ్వడును సాధించియుండలేదు సుమీ.

...ఇది క్రైస్తవుల దేశమని—మతియే యితర మత ప్రభావముగాని ఇంచుమించుగా నిచట లేదనియున్న యని గ్రహింపుడు. ఇక నేనో, లోకమున ఏ మతస్థుల ద్వేషము ను—అన్యుల ద్వేషమును—లేశమును లక్షించువాడను కాను. నే నిచట మేరీ (Mary) మాతృపుత్రుల నడుమ నున్నాను. ఏసుప్రభువే నాకు తోడ్పడగలడు. హిందూమత విశాలాశయములనినను, ఏసుప్రవక్తయెడ నా ప్రేమమునినను వారికి మిక్కిలి మక్కువ. ఆ మహనీయునకు విరుద్ధముగా నేనేమియు బోధింప రాలేదని వారికి తెల్పుదును.

...తామసించకు, నాయనా! ధైర్యము బూనుము. భారతదేశమున మనము ఘనకార్యములోనర్ప విధినిమంత్రితులమైయున్నాము. నమ్ముము నా మాట. మనము చేసి తీరెదము. అనుతాపముగల మనమే—దరిద్రులము, త్యజీకృతులము నగు మనమే—అంతియేకాని—వారు కాదు.

స్త్రీల చెరసాలకు పరీక్షాధికారిణియగు...నామె నిన్న యిచటికివచ్చెను. దీనిని వారిచట చెరసాల యనరు, ప్రవర్తనసంస్కరణశాల (Reformatory) యందురు. అమెరికాలో నేజూచిన మహాఘనవిషయ మిది. ఎంత చక్కగా, ఎంత యద్భుతముగా ఖైదీల నాదరించి, వారి ప్రవర్తనమును దిద్ది, సమాజమున కుపకరించు సభ్యులుగా జేయుదురో చూచితీరవలయును. ఇక భారతదేశములోని దీనులను, నిమ్నజాతులను గూర్చి తలచిన గుండె బ్రద్దలగును. వారి కిక తరణోపాయమే లేదు. పేదలకు, దీనులకు, పాపు

లకు భారతదేశమున మిత్రులెవ్వరు? విశ్వప్రయత్నము చేసినను వారికి గతి కానబడదు...క్రూరసంఘ తాడనములచే క్రుంగి కృశించుచు వారు తాము మానవులమను మాటనే మఱచిరి. ఇందులకు ఫలితము దాస్యము, బాని సత్వము. ఇటీవల ఆలోచనాపరులు దీనిని కనుగొనిరి కాని, ప్రారబ్ధవశమున సనాతనధర్మమున కీ దోషము నంటగట్టిరి. లోకమున అతిదివ్యమైన మతమును ధ్వంసముచేయు టొక్కటే బాగుచేయుటకు వారికి కనబడిన మార్గము. నాయనా! నామాట వినుము, భగవదనుగ్రహమున కీలకము కనుగొంటిని. మతమున—ధర్మమున—ఏ దోషమును లేదు. సమస్తజీవులును కోటిగుణితమైన మీ యాత్మయే యని మీ మతము—మీ సనాతనధర్మము—బోధించుచున్నది. ఏతదనుష్ఠానలోపము, సానుభూతిలోపము—ఉన్నలోపమిది. భగవానుడు బుద్ధమూర్తియై మఱల మీ వద్దకు వచ్చి సానుభూతి నందుటెట్లో, పేదలయెడ—దీనులయెడ—పాపులయెడ—సానుభూతి నందుటెట్లో బోధించినాడు, కాని మీరు వినలేదు. మాయాసిద్ధాంతములచే రక్కసులను భ్రమింపజేయుటకై ఆత డిచటికి దిగెనని మీ మతాచార్యులు ఒక ఘోరగాథను గల్పించినారు! నిజమే, మనమే ఆ రక్కసులము, కాని యాతని తత్త్వములను నమ్మినవారు కారు. యూదులు ఏసుప్రభుని కాదని, నాటినుండియు ప్రతివారి చేతను మొట్టికాయలను దినుచు, కొంపయును గోడును లేక ప్రపంచమంతటను బికారివాండ్రై యెట్లు తిరుగుచున్నారో అట్లే మీరును మిమ్ములను పాలించుట పాడియని తోచి

జాతికెల్ల దాస్యము చేయుచున్నారు. ఓ బ్రాహ్మణులారా! మన దేశమున నొకవైపున మీ రాజ్యసాధికారమును మఱియొక వైపున నీచదాస్యమును తాండవించుచుండుట మీకు గోచరించుచుండుట లేదే! జాతిసత్వమును రాజ్యసాధికారమును ప్రత్యామ్నాయములు.

సముద్రయానమునుగూర్చి పుదుచ్చేరిలో ఒకనాడు సాయంకాలము మేమొక పండితునితో చర్చించుట... జ్ఞప్తి యుండవచ్చును; ఆతని బ్రాహ్మ చేష్టలను 'కదాపినా' * లను ఎన్నటికిని మఱవజాలను! హిందూదేశము ప్రపంచమున అత్యల్పభాగమని ఈ పండితు లెఱుగరు, పాపము! ఆ సుందర దేశమున ఒండొంటి కణప యత్నించుచు ప్రాతులాడు ముప్పదిమూడుకోట్ల వానపాములను లోకమంతయు అతి హేయముగా జూచుచున్నదని వా రెఱుగరు, పాపము! మతధర్మములను ధ్వంసము చేయుటచే గాక, సనాతనధర్మ మహోపదేశములను అవలంబించుచు, సహజముగనే, సకారణముగనే, అందుండి బయలుదేఱిన బౌద్ధమతమందలి అద్భుత సానుభూతిని క్రైవసము నర్చుకొనుటచే ఈ ఘోర కలిని దొలగింపవలయును.

పవిత్రహృదయులు, ప్రచండదీక్షాదక్షులు, భగవద్విశ్వాస బలోపేతులు,—పేదలపై, దీనులపై, అధఃకృతులపై, సానుభూతికలిన సింహసాహసాన్వితులు—ఒకలక్షమంది స్త్రీ పురుషులు మాతృసందేశమును సంఘోద్ధరణ

---

* ఎన్నటికిని కాదు అనుట.

సందేశమును సమత్వ సందేశమును బోధించుచు, యావ ద్భారత దేశమునను సంచరింపవలసియున్నది.

కారుణ్య మహత్త్వమునుగూర్చి హిందూమత మంతటి మహత్తరముగా బోధించు మతము లోకమున వేఱులేదు; పేదల—దీనుల—కులహీనులపై పరమనీచముగా హిందూమతమువలె కాలిడి త్రొక్కు మతమును లోకమున వేఱులేదు. సనాతనధర్మమున కీ దోషము నంటగట్టుట తగదని—పారమార్థికములనియు వ్యావహారికములనియు సర్వ విధ క్రూరసిద్ధాంతముల గల్పించు పండితంమన్యుల, వంచకుల, దోషమిది యని—పరమేశ్వరుడు నాకు దెలిపియున్నాడు.

అధైర్యపడకుము. "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన" * యని భగవానుడు గీతలో జేసిన మహోపదేశమును స్మరింపుము. వత్సా! లెమ్ము, నడుము గట్టుము. ఈ కార్యమును నిర్వహించుటకు పరమేశ్వరుడు నన్ను నియమించియున్నాడు. నా జీవితము యాతనలతో, దుఃఖపరంపరలతో నిండిపోయినది. నా యాప్తబంధువులు, మిత్రులు నిరాహారులై నా కన్నెదుట మరణించిరి— దీనులను దరిద్రులను జూచి వెక్కిరించి, యేవగించుకొనువా రెవ్వరో వారియెడలనే నా యనుతాపమును జూచి, సానుభూతిని జూచి జనులు నన్నెగతాళిచేసిరి. "వీనిని నమ్మ

* భగవద్గీత, 2-47. "కర్మాచరణమునకేకాని తత్ఫలమునకు నీకు అధికారములేదు" అని భావము.

కాదు'' అనిరి. శుభమస్తు! నాయనా! ఈ లోకయాతనలు మనకు గుణపాఠములు! సానుభూతిని సహనమును, విశేషము ఈ నిఖిలప్రపంచము మన కట్టెదుట తుత్తునియలైనను చలింపని వజ్రసన్నిభ సంకల్పమును అలవఱుచుకొనుటకు గాను మహాత్ములకును ఆచార్యులకును సైతము ఈ లోక యాతనలు గుణపాఠములు. ఆహా! ఈ లౌకికులను జూచిన నాకు జాలివేయుచున్నది! ఇది వారి దోషముకాదు. సంఘమున అగ్రజాతివారగుదురుగాక, ధనులనిపించుకొందురు గాక, వారు, అభము, శుభము నెఱుగని బిడ్డలు, కాను, అవివేకులగు పసిబిడ్డలు, కూపస్థమండూకములు—ఎప్పటి దైనందినచర్య— తినుట, త్రాగుట, బిడ్డలను గనుట, సంపాదించుట—ఈ క్రమమున, ఈ నిష్ఫలోద్యమము 'తు,చ్ఛ' తప్పరనుట నిజము—ఇంతకంటె వారికి మఱియొకటి తెలియదు, తోచదు. ఈ యల్పబుద్ధులు, 'ఇక మనయంతటివారు లేరు' అని, 'మనకేమి కొదవ' యని మురియుచుందురు. వారినిద్ర కెన్నడును భంగమువాటిల్లదు. అనేక శతాబ్ద పర్యంతమగు ప్రజాపరిపీడనమునకు ఫలితముగా భారతదేశము నాక్రమించిన దారిద్ర్యముచే, హైన్యముచే, దుఃఖపరంపరచే జనించు ఘోషవలన—హాహాకారములవలన—వారి సుఖస్వప్నముల కెన్నడును భంగము వాటిల్లదు. సాక్షా దమృతపుత్రుని (మానవుని) కేవలము మాటలు రాయు పశువుగా జేసివేసిన — జగన్మాతృచిహ్నమును (స్త్రీని) బిడ్డలను గను కానిసగా మార్చివేసిన—జీవనమునే నరకముగా జేసిన—అనేకయుగపర్యంతమగు బాధసాధ

కారమునుగూర్చి—శారీరమానసిక నైతిక రాత్మసాధికార మునుగూర్చి—వారు కలనైనను దలపెట్టరు. కాని యీ ఘోరకలినంతను జూచి, అనుతాపపడి, అంతరంగమున రక్తాశ్రువులను రాల్చువారు—ఇందులకు తరణోపాయము కలదని తలచువారు—ప్రాణార్పణ పర్యంతము ఆ తరణోపాయమును ఆచరణమున జూపువారు—కొందఱు లేకపోలేదు. (And "Of such is the kingdom of Heaven.") వారే మోక్షసామ్రాజ్యమును బొందువారు. నాయనలారా! మిత్రులారా! తుచ్ఛమగు తమవిషమును వెలిగ్రక్కు ముందంజవేయు నీ క్షుద్రకీటకములను—అసహ్యమగు నీ యల్పక్రిములను—తమ మహోన్నతస్థితినుండి దిగి తిలకింప నా మహనీయులకు తీఱిక లేకుండుట సహజము కాదా?

ధనికులను నమ్మకుడు. వారు వట్టి జీవచ్ఛవములు. సంఘమున సామాన్యులయ్యును వినయవిధేయులగు మీ యందే నే నాశపెట్టుకొనియున్నాను. భగవానుని నమ్ముడు; యుక్తిలో—తంత్రములో—ఏమున్నది? దీనులకోసము తపింపుడు. సాయము అయాచితముగా వచ్చితీరును. ఈ దుఃఖ భారముతో, ఈ యాశయములతో, నేను పండ్రెండు సంవత్సరములు తిరుగాడితిని. ధనికులనువారి—ఘనులనువారి—యింటింటికి దిరిగితిని. దుర్భరదుఃఖాగ్నిచే గుమిలిపోవుచు, ప్రపంచార్ధభాగమును దాటి సాయమునిమిత్తము ఈ నూతన దేశమునకు వచ్చితిని. సర్వేశ్వరుడు నాకు సాయపడునను ధైర్యము కలదు. ఒకవేళ నే నీవిదేశములో ఆకలిబాధచే,

శీతయాతనచే, నాశమందవచ్చును. కాని యువకులారా! దరిద్రులను, దీనులను, అజ్ఞులను లేనసత్తు నీ సానుభూతిని, ఈ కార్యదీక్షను, ఈ పోరాటమును స్థిరాస్తిగా నేను మీ కొసగుచున్నాను. ఈ నిముసముననే పార్థసారథి దేవాలయమునకు వెడలి, గోకులమందలి పేద గోపబాలకుల నెచ్చెలియగు నా దీనబాంధవునకు—అంత్యజుడగు గుహుని యాలింగనమొనర్చుకొన వెనుదీయని యా భక్తవత్సలునకు—తన బుద్ధావతారమున ఉన్నతవంశజుల యాహ్వానములను విడిచిపుచ్చి యొక వ్యభిచారిణి యాహ్వానమును అంగీకరించి యామెను బ్రోచిన యాపతితపావనునకు—ఆ పార్థసారథికి—సాష్టాంగవందన మొనర్చి, యెవ్వరి నిమిత్తము యుగయుగములందాత డావిర్భవించునో, విశేషము ఏ దీనులను, ఏ పేదలను, ఏ యధఃకృతులను అతడు మిగుల ప్రేమించునో వారికై మహాత్యాగ మొనరింపుడు, మీ యావజ్జీవమును వారికై ధారపోయుడు. నానాటికి అధఃపతనము జెందుచున్న యీ ముప్పదికోట్లదీనుల నుద్ధరించుటకై మీ యావజ్జీవితమును ధారపోయ బ్రతిన బూనుడు.

ఇది యొకనాటితో దీరు పనికాదు; మార్గమో—మహాకంటక భూయిష్ఠము. కాని పార్థసారథి మనసారథియగుటకు సంసిద్ధుడై యున్నాడు, అది మనకు తెలియును; యుగయుగములనుండియు భారతావనిపై బ్రోగొనరింపబడిన దుఃఖరాశిని వాని పావననామస్మరణముచే, వాని యందలి సుస్థిరవిశ్వాసముచే, భస్మీపటల మొనర్తముగాక! రండు, సోదరులారా! గమనింపుడు, ఇది మహోద్యమము,

మనమో — అత్యల్పుల మైయున్నాము. కాని నిజముగా మనము అమృతపుత్రులము, భగవంతుని బిడ్డలము. భగవదనుగ్రహమున మనయత్నము తప్పక సిద్ధించును. ఈ మహా సమరమున వందలకొలది పడిపోయిన, మఱల వందలకొలది వచ్చినిల్వ సంసిద్ధులై యుందురు. అపజయమునకు ఆహుతినై నేనిచట మరణింపవచ్చును—మఱియొకడు ఈ యుద్యమమును నిర్వహించును. వ్యాధిగూనూ మీకు తెలియును, నివారణోపాయమును తెలియును, శ్రద్ధ నహింపుడు, చాలును. ధనికులనబడువారి, ఘనులనబడువారి, సాయమును ఆసింపకుడు; శుష్క రచయితలను సానుభూతిరహితములగు వారి వార్తాపత్రికా వ్యాసములను వీసమైనను లక్షింపకుడు. వలయునది ఉజ్జ్వలమగు విశ్వాసము, సముజ్జ్వలమగు సానుభూతి! జన్మము లేదు, మరణము లేదు—ఆకలిలేదు, దప్పిలేదు. పరమేశ్వరుని స్మరింపుడు—ముందునకు సాగిపొండు. పరమేశ్వరుడే మన నాయకుడు. పడిపోయినవారికై వెనుకకు జూడకుడు! సోదరులారా! ఇదియే మార్గము!

ఈ గ్రామమునుండి రేపు నేను బోస్టను వెళ్లుచున్నాను. రామాబాయికి ఇచట సాయముచేయుచున్న ఒక పెద్ద స్త్రీ సమాజమున మాటలాడనున్నాను. మొదట బోస్టను వెళ్లి కొన్నిదుస్తులను గొనవలసియున్నది. చాలకాలమిట నుండవలసివచ్చుచో, ఈ విచిత్రపు బికారిదుస్తులు పనికిరావు. వీధులలో వందలకొలది జనులు నన్ను జూచుటకై మూగుచున్నారు. అందుచే నొక పెద్ద నల్లకోటును

ధరించుటయు నుపన్యసించునపుడు ఒక యెఱ్ఱనిదుస్తును దల పాగను దాల్చుటయు నావశ్యకమైయున్నది. మిత్రులు ఒసగు సలహాయు నిదియే. ఏమేని పలుకుబడిని సంపాదింపవలయునన్న, కొంతకాల మిచట నుండుట ఆవశ్యకము.

కెనడాలోదక్క అమెరికాదేశమున రైలుబండ్లలో తరగతులులేవు. ఉన్నదియే అది కావున నేను మొదటి తరగతిలోనే పయనింపవలసియున్నది; పుల్‌మాన్స్ (Pullmans) అను నొక తరహాబండ్లలో పోవచ్చును గాని అందుకు నేను సాహసింపను. అవి చాల సదుపాయముగా నుండును—హోటళ్లలోవలెనే వానిలో మీరు తినవచ్చును, త్రాగవచ్చును, నిద్రపోవచ్చును, స్నానముకూడ చేయవచ్చును; కాని వ్యయమో, అపారము.

సంఘమున ప్రవేశమందవలయునన్నను, పలువురు మీ మాటలను వినవలయునన్నను బహుకష్టసాధ్యము. ఇపుడు పట్టణములలో నెవరును లేరు, అందఱును వేసవిలో నివసింపఁదగిన శీతలప్రదేశములకు వెళ్లినారు. శీతకాలమున తిరిగి వత్తురు. అంతవఱకును నేను వేచియుండవలయును. కానిండు, ఇన్నితిప్పలుపడి కార్యమును ఇంతలో సులభముగా విడుచువాడను గాను. తలచినంతనే తారపెండ్లి యగునా?...

తుదముట్టువఱకును నా యత్నమును విడువను. ఆకలిబాధచేతనో, శీతయాతనచేతనో, మఱియే వ్యాధిచేతనో నేనిచట చనిపోయినను మీరు ఈ యుద్యమమును విడ

నాడక పూనుకొనవలయును. వలయునవి విశుద్ధత, నిష్కాపట్యము, శ్రద్ధ. మొదట అమెరికాలో ప్రయత్నింతును, విఫలమైనచో ఇంగ్లాండులో ప్రయత్నింతును, అటను సాను కూలముగాదా, తిరిగి భారతభూమిని జేరి యట పరమేశ్వ రాజ్ఞకై నిరీక్షించెదను. —మీ వివేకానందుడు.

(33)

షికాగో, 2-11-1898.

స్నేహాస్పద—,...సర్వమత మహాసభ ప్రారంభమగు నాటియుదయమున Art Palace (కళాసౌధము) అను భవనమున మే మందఱము సమావేశమైతిమి; సభాకార్య క్రమమునకుగాను అందు బ్రహ్మాండమైన యొక చావడియు తాత్కాలికమైన చిన్నచిన్న చావడులును నిర్మింపబడినవి. నానాదేశములనుండియు సంఘములనుండియు వచ్చిన సభ్యులు అందుండిరి. బ్రాహ్మసమాజ ప్రతినిధియగు మజూందారును బొంబాయినివాసియగు నాగర్కారును జైనమత ప్రతినిధియగు గాంధిగారును * దివ్యజ్ఞానసభా ప్రతినిధులగు చక్రవర్తి, ఆనిబిసెంటులును అందు భారతదేశమునుండి వచ్చిన ప్రతినిధులు. వీరిలో మజూందారును నేనును పూర్వ స్నేహితులమని చెప్పనక్కఱలేదు. చక్రవర్తికిని నాకును ముఖ పరిచయము. (సభాప్రారంభదినమున మేమందఱము) దివ్యోత్సవమున సభావేదికను జేరితిమి. దేశమందలి శిష్టు లలో నుత్తమోత్తములగు నేడెనిమిది వేలమంది స్త్రీ పురు

* ఈయన గాంధిమహాత్ముడు కాడు.

ష్ములతో కిటకిటలాడుచున్న యీ సభాస్థలి, ప్రపంచమందలి నానాజాతులనుండియు విచ్చేసిన పండితప్రకాండులతో గూడిన యీ సభాస్థలి యెట్టులుండునో భావింపుడు. జన్మమున నెన్నడును బహిరంగసభలలో నుపన్యసించియెఱుగని నేను ఈ సభాసమక్షమున నుపన్యసించుటయా! దివ్యగానములతో, ఉత్సవములతో, ఉపన్యాసములతో, మహావైభవముగా సభ ప్రారంభింపబడియెను. ప్రతినిధుల నొకరి వెంబడి నొకరిని అధ్యక్షుడు సభ కెఱుకపఱచుచుండ, ముందున కుఱికి వారు ఉపన్యసింపసాగిరి. నా గుండె దడదడ కొట్టుకొనసాగెను, నాలుక పిడుచకట్టుకొనిపోయెను, సభాకంపముచే నాటియుదయము మాటాడ సాహసింపజాలనైతిని. మజూందారు మంచి యుపన్యాస మొసర్చెను,—చక్రవర్తి యంతకంటెను చక్కగా నుపన్యసించెను, సభ్యులు చాల మెచ్చుకొనిరి. వారిందఱును సిద్ధోపన్యాసములతో వచ్చిరి. నేనో, మూఢుడను, ఉపన్యాసము నాయితమొనర్చుకొని రాలేదు. కాని సరస్వతీదేవికి మ్రొక్కి, వేదిక నెక్కితిని; డాక్టరు బారోస్ (Dr. Barrows) నన్ను సభ్యులకు పరిచితు నొనర్చెను. నేనొక చిన్నయుపన్యాసము చేసినాను. సభ్యులను "అమెరికా సోదరసోదరీమణులారా!" యని సంబోధించినాను—సభ్యుల హర్షధ్వనులు మిన్నుముట్టసాగెను, అట్లు రెండు నిముసములు గడచెను, ఉపన్యాసమును సాగించినాను, అంతమున జదికిలబడుసరికి ఇంచుమించుగా అలసిపోయినాను. నా యుపన్యాసము నాటి మేలుబంతియని మఱునాడు పత్రికలన్నియు ప్రకటించినవి.

యావదమెరికా దేశమునకును నా పేరు వెల్లడియైనది. ''మూకం కరోతి వాచాలమ్''— ''మాధవుడు కటాక్షించుచో మూగవానిని మహావక్తను చేయును'' అని భాష్యకారుడగు శ్రీధరుడు వచించినదెంతయు యథార్థము కదా! భగవన్మహిమ! నాటినుండియు నేను విఖ్యాతుడ నగుటయు నా 'హిందూమత ప్రకాశిని' (Paper on Hinduism) చదివిననాడు అపూర్వరీతిని సభాభవనము క్రిక్కిరిసిపోయినది. ఒక వార్తాపత్రికనుండి గ్రహించెదను: ''ఎల్లెడలను దొరసానులు, దొరసానులు, దొరసానులు—ఇసుకచల్లిన రాలకుండునట్లు సభాస్థలివారితో క్రిక్కిరిసిపోవ, వివేకానందునుండి తమ్ము వేఱుచేయు పత్రికలు ఒకటొకటిగా జదువబడుచుండ, చాతకపక్షులవలె వారతని యమృతవాక్కులకై నిరీక్షించుకొని యుండిరి,'' ఇత్యాదికము. వార్తాపత్రికలనుండి యీ ఘట్టములను మీకు బంపిన మీరు ఆశ్చర్యచకితులగుదురు, కాని పేరుప్రతిష్ఠలనిన నాకు పరమాసహ్యమనుసంగతి మీ కిదివఱకే తెలియును. సభావేదికపై నే నడుగిడినపుడెల్ల సభ్యుల హర్షధ్వనులు మిన్నుముట్టుచుండెనని తెల్పిన జాలును. ఇంచుమించు పత్రికలన్నియు విశేషముగా నన్ను అభినందించినవి. సంకుచితభావములకును స్వమతదురభిమానమునకును పేరువడసిన పత్రికలుసైతము ఇట్లు అంగీకరింపవలసివచ్చెను: ''సుందరవదనముతో, మోహనమూర్తితో, అద్భుత వాగ్ధాటితో నొప్పు నీ వ్యక్తి మతమహాసభకెల్ల మహాప్రముఖుడగు మూర్తి'' ఇత్యాదికము.

...నాకిపు డేలోపము లేదు. ఈ మహానగరమందలి దివ్యభవనము లనేకములు నాకు ఆతిథ్య మొసగ పోటి పెట్టుకొనుచున్నవి. ఇంతవఱకును ఎవరియింటనో ఒకరి యింట అతిథినై మనుచున్నాను. నూతనవిషయములను గ్రహింప నీ దేశీయులకుగల కుతూహలము ప్రపంచమున మఱియెచ్చటను గానరాదు. వారు తెలియగోరని విషయమే లేదు—వారి నారీమణులో, ప్రపంచమున సంతటివికాసము నొందినవారు లేరు. అమెరికా దేశమున సామాన్యురాలగు స్త్రీ సామాన్యుడగు పురుషునికంటె విశేష విద్యావంతురాలు, విజ్ఞాన సంపన్నురాలు. పురుషులు యావజ్జీవము డబ్బుకొరకు దాస్యముచేయుచుండ, స్త్రీలు అభివృద్ధినొందుటకుగాను సమస్తమైన యవకాశములను జూచుకొనుచున్నారు. వీరు (ఈ దేశీయులు) అతిదయార్ద్ర హృదయులు, నిష్కపటులు. ఏ వెఱ్ఱిమొఱ్ఱి అవకతవక సిద్ధాంతములనో బోధించు ప్రతివ్యక్తియు నిచటికి వచ్చును, వీరికి ఆలోచన లేకుండుట శోచనీయము. అమెరికా దేశీయుల దోసగులు లేకపోలేదు. ఆ మాటకు వచ్చిన దోసగులు లేని జాతియేది? నా యభిప్రాయ మిది: ఆసియా (ఖండము) నాగరికతాబీజములను జల్లినది, యూరోపు మానవుని వికాసము నొందజేసినది, అమెరికా స్త్రీలను జనసామాన్యమును వికాసమునొందించుచున్నది. స్త్రీలకును కార్మికులకును ఈ దేశము భూతలస్వర్గము. అమెరికా స్త్రీలను జనసామాన్యమును మన దేశమువారితో బోల్చిచూడుడు, నిగ్గు తేలును. అమెరికా దేశీయులు త్వరితగతిని ఉదారాశయముల వల

వలచుకొనుచున్నారు. హిందూదేశమున మీకు గాన్పించు "Hard-shelled Christians" పరమత సహన విహీనులగు క్రైస్తవులను (అమెరికాదేశీయు లుపయోగించు మాటయే ఇది) బట్టి చూడకుడు. వారు ఇచటను ఉన్నారు కాని వారిసంఖ్య విశేషముగా క్షీణించుచున్నది. హిందువులు తమ వాక్కుని ప్రజ్ఞలు పలుకునట్టి పారమార్థికసంపదను అలవఱచుకొనుటకై ఈ దేశీయులు ముందంజ వేయుచున్నారు.

హిందువులు తమ సనాతనధర్మమును విడువరాదు, ఐనను మతమునకు దగు మర్యాద జూపుచు సంఘము వికాసము జెందుటకు వలయు స్వేచ్ఛ [illegible]సగవలయును. ఘోరమగు మతాచార్యుకై తవమునకేమి, దేశపతనమునకేమి, కారణము మతమని—మన సనాతనధర్మమని—తలచుట అగ్గమైన పిచ్చి భ్రమ; భారతదేశ సంస్కర్తలందఱును అనశ్వరమైన యీ వ్యవస్థను గూడ బెఱుకబూనుట వారి భ్రాంతి; ఫలమేమి? అపజయము!! బుద్ధుడు మొదలుకొని రామమోహనరాయలవఱకును ప్రతివ్యక్తియు వర్ణవ్యవస్థతో బాటు మతమును—ధర్మమును—ధ్వంసముచేయబూని విఫలులైరి! పురోహితులును మతాచార్యులును ఎంత ప్రలాపించినను, గగ్గోలుచేసినను వర్ణవ్యవస్థ కేవలము కరుడుగట్టిన సాంఘికసంస్థ; తనపని తీఱిన వెనుక నిపుడు అది భారతవాతావరణమును దన దుర్గంధముతో నింపుచున్నది; జనులు కోల్పోయిన సాంఘికవ్యక్తిత్వమును మఱల వారికి ఒసగుటయే ఈ దుర్గంధమును—ఈ క్రుళ్లును—దొలగించు

మార్గము. ఇచట (అనఁగా అమెరికా దేశమునఁ) బుట్టిన ప్రతివ్యక్తియు తాను మానవుఁడనని యెఱుఁగును. ఇఁక హిందూ దేశమందలి ప్రతి వ్యక్తియు సంఘమునకుఁ దాను బానిసనని యెఱుఁగును. స్వాతంత్ర్యములేని దే వికాస మున్నటికిని గలుగఁజాలదు; స్వాతంత్ర్యము తొలగించితిరా, పతనమే అందులకు ఫలితము. ఉద్యోగములలో, పనులలో—నేఁటి పోటిచే వర్ణవిభేదములు ఎట్లు అదృశ్యమైపోవుచున్నవో చూడుఁడు! వానిని నిర్మూలించుటకు మఱి యే మతమును అక్కఱలేదు. బ్రాహ్మణవర్తకుఁడు, బ్రాహ్మణచర్మకారుఁడు (Brahmin shoemaker), బ్రాహ్మణ సాంధికుఁడును (Brahmin wine-distiller) ఉత్తరహిందూస్థానమున సర్వసామాన్యముగాఁ గనిపించువారేకదా! కారణము? పోటి. నేఁటిప్రభుత్వమున జీవనోపాధికిఁగాను ఎవ్వరేపని చేయుటకైనను అభ్యంతరము లేదు; పోటి—హోరాహోరీయైన పోటి—తత్ఫలితము. సంఘమున అధోగతిపాలై దేవులాడుటకుబదులు ఈరీతిని వేనవేలమందిని జనులు తమ 'జన్మహక్కును'—మహోత్తమమైన తమ 'తాహతు' ను గనుగొని సాధించుచున్నారు.

అధమము శీతకాలమువఱకైనను నే నీ దేశములో ఉండి, అనంతరము ఐరోపాకు వెళ్లవలసియున్నది. సర్వేశ్వరుఁడే సమస్తము నాకు సమకూర్చును. ఆ విషయమై నీవు బెంగపెట్టుకొనక్కఱలేదు. నాయందలి నీ ప్రేమకు నా కృతజ్ఞత యిట్టిదని తెలుపఁజాలను.

పరమేశ్వరుఁడే నా ప్రాపు—ఇది నా నిత్యానుభవము. పరమేశ్వరుఁ డెట్లు నడపునో అట్లు నడువఁ బ్రయత్నించు చున్నాను. వాని సంకల్పమే నెఱవేఱుఁగాక! జగద్ధితార్థము మనము మహాకార్యములను జేయవలసియున్నది—జగద్ధితార్థముకాని పేరుప్రతిష్ఠలకోసముగాదుసుమీ!

"Ours not to reason why, ours but to do and die" (పరమవిధేయులమై కర్తవ్యాచరణమున జీవితమును ధారపోయుటే మనవిధి). ఉత్సాహపూరితుఁడవు కమ్ము, నమ్ముము నామాట—మహాకార్యముల నొనర్ప మనము విధినిమంత్రితులమై యున్నాము, మనము చేసి తీరుదుము. సంసిద్ధుఁడవు కమ్ము—అనఁగా, అకలంకుఁడవై, పవిత్రుఁడవై, అవ్యాజప్రేమ నవలంబింపుము. దీనులను, పేదలను, అధఃకృతులను అవ్యాజముగాఁ బ్రేమింపుము, భగవంతుఁడు నిన్ను అనుగ్రహించును.

...పేదలను వారెట్లు హింసించుచున్నారో తెలిపి, వారిని ఉద్ధరింపఁబూననిచో, "మీరు మానవు లనిపించు కొనఁదగరు" అని...చెప్పుము. నిర్భయుఁడవై వర్తింపుము. పరమేశ్వరుఁడు నీదండ నున్నాఁడు. పరమేశ్వరుఁడే భారత దీనజనకోటిని మూర్ఖజనకోటిని ఉద్ధరించును. మీ యువకులలో అనేకులకంటె, మీ ప్రభువులలో మూఁడునంతుల ముప్పాతికమందికంటె, ఇచట నొక రైలుబండి మూటలు మోయువాఁడు అధిక విద్యావంతుఁడు. ప్రతి అమెరికాదేశ స్త్రీయును హిందూస్త్రీజన బాహుళ్యము ఆసింపఁజాలనంతటి

ఉత్తమవిద్యావంతురాలు. అట్టివిద్యను మన మహిళలును ఏల పొందరాదు ? పొందితీరవలయును.

మేము పేదలమని కుందకుడు; దౌర్భాగ్యత, పవిత్రత— శక్తిసామర్థ్యములనఁగా నివి కాని ధనము కాదు. ప్రపంచమున ఎచటనైనను ఇవి యెల్లు వాస్తవమూ వచ్చుచూండును.

—వివేకానందుఁడు.

(34)

చికాగో, 28-12-1898.

స్నేహాస్పద—, భారత దేశ వార్తాపత్రికలలో నా షికాగో ఉపన్యాస సమాచారము వెలువడుట చాల విచిత్రముగానున్నది, నే నేమిచేసినను చాటింపు లోలఁగించుకొనఁ బ్రయత్నింతును. ఈ దేశమున గమనింపఁదగిన విషయములు అనేకములు కలవు. దారిద్ర్యమనునది ఇచట లేనేలేదని చెప్పవచ్చును. ఈ దేశ స్త్రీలవంటి విదుషీమణులను విజ్ఞానవతులను నేను మరెచ్చటను జూడలేదు. మన దేశమున విద్యాధికులు కలరు, కాని యిచటి మహిళలవంటివారిని మరెచ్చటను మీరు కనఁజాలరు. సాక్షాత్ భాగ్యదేవతలు పుణ్యవంతులగృహములందు మనుచుందురనుట అతిశయోక్తి కాదు. హిమసన్నిభ నిర్మలమానసలగు మహిళామతల్లులను వేనవేలమందిని నే నిచటఁ గాంచినాను. ఆహా! వారెంత స్వతంత్రలు! సాంఘిక పురపాలక విధులనన్నిఁటిని స్వాధీనముచేసుకొని వారే నడపుదురు. పాఠశాలలును కళాశాలలును స్త్రీలతో నిండియుండును. మన దేశమునన్,

మున విహరించు విహంగములంతటి స్వతంత్రలు వారు. బజారునకేమి, పాఠశాలలకేమి, కళాశాలలకేమి, స్వయముగా వెడలి సర్వవిధకార్యములను నిర్వహింతురు. ధనిక రాండ్రగు స్త్రీలు దీనజనోద్ధరణార్థము పాటుపడుదురు. ఇఁక మనము చేయుచున్నదేమి? పాపము, స్త్రీ లెక్కడ చెడిపోవుదురో యని మనపిల్లలకు పదునొకండేండ్లు దాటక మునుపే పెండ్లిచేయ జాగరూకలమగుచున్నాము. మనువు ఏమని విధించియున్నాఁడు? * ముప్పదియేండ్లు పర్యంతము బ్రహ్మచర్యమును బరిపాలించిన పిమ్మట పుత్రుల నెట్లు వివాహితులను జేయవలసియున్నదో అట్లే పుత్రికలను బ్రహ్మచర్య మవలంబింపఁజేసి తల్లిదండ్రులు విద్య చెప్పింపవలసియున్నది. కాని నిజముగా మనము చేయుచున్నదేమి? మీ స్త్రీల స్థితిగతులను మీరు బాగుచేయలేరా? లేనిచో ఎప్పటివలె మీకు అధోగతియే.

మనదేశమున నెవ్వరైనను హీనకులమునఁ బుట్టినచో వారికిఁక దుర్గతియే. ఏల? ఏమి క్రౌర్యము! ఏమి ఘోరకలి! ఈ దేశమునఁ బ్రతివ్యక్తియు బాగుపడుటకు అవకాశము గలదు, సదవకాశము గలదు. నేఁడు ఇచట దరిద్రుఁడై

* శ్లో॥ షట్త్రింశదబ్దికం చర్యాం గురౌ త్రైవేదికం వ్రతమ్,
తదర్ధికం పాదికం వా గ్రహణాన్తిక మేవ వా,
వేదానధీత్య వేదౌ వా వేదం వాపి యథాక్రమమ్,
అవిప్లుత బ్రహ్మచర్యో గృహస్థాశ్రమ మావిశేత్.
—మనుస్మృతి. 3. 1. 2.

యున్నవాఁడు రేపు ధనవంతుఁడు కావచ్చును, విద్యాధికుఁడు గావచ్చును, పూజనీయుఁడు గావచ్చును. ఇచట ప్రతి వ్యక్తియు పేదలకు సాయముచేయ నాతురపడుచుండును. మేము పరమ దరిద్రులమని హిందూదేశములో పెద్ద గందరగోళము చేయుచున్నారే కాని పేదలశ్రేయమునకుఁగాను ఏ ధార్మికసంస్థలు నెలకొల్పఁబడినవి? భారతదరిద్రజనకోటి దురవస్థనుగూర్చి నిజముగా పరితపించు వారెవ్వరు? ఏడ్చువారెవ్వరు? మానవులమేనా మనము? వారి జీవనోపాధికై, పురోవృద్ధికై, మనము చేయుచున్నదేమి? వారిని మనము ముట్టుకొనము, వారినీడ మనమీదఁ బడరాదు! మానవ నామార్హులమేనా మనము? వేలకొలఁది యీ బ్రాహ్మణులు—అథఃకృతమగు భారతదీనజనకోటిని లేవనెత్తుటకు వారు చేయుచున్నదేమి? "నన్నుముట్టుకోకు", "నన్ను ముట్టుకోకు"—ఎంతసేపు ఇదియే వారుచ్చరించుచున్న మహామంత్రము! వీరి చేతులలోఁ బడి మన సనాతన ధర్మము ఎంత భ్రష్టమై, అడుగంటినదో! మన మతము—మన సనాతనధర్మము—ఇపు డెచటనున్నది? "నన్ను ముట్టుకోకు", "ననుముట్టుకోకు" మని మిట్టిపడుటలో నున్నది!

నే నిచటికి వచ్చినది కుతూహలముచేఁగాదు, పేరు ప్రతిష్ఠలకై కాదు—భారతదేశమందలి కోట్లకొలఁది పేదల జీవనోపాధి కేమైనమార్గము కనఁబడు నేమోయని వచ్చినాను. పరమేశ్వరుఁడు నాకుఁ దోడ్పడు నెడల ఆ మార్గమేమో మీకుఁ దెలియఁగలదు.

ఆధ్యాత్మికవిషయమున మనతోఁ బోల్చిచూచిన, అమెరికావారు పిల్లలు; కాని సాంఘికముగా మనకంటె వారు కోటిరెట్లు ఘనులు. వారి సంఘములో నున్న మంచి విషయములను గ్రహించుచు మన పరమార్థమును వారికి బోధింతముగాక. మీ యందఱును నాకు అత్యంతప్రేమాస్పదులని గ్రహింపుఁడు,—మీ శ్రేయోభిలాషి,

—వివేకానందుఁడు.

(35)

## కుటుంబమున విపత్తునొందిన చెన్నపురి వాస్తవ్యుఁడగు నొక మిత్రునకు 1893-వ సంవత్సరమున స్వామి వ్రాసిన లేఖ

స్నేహాస్పద—, మహాపదల ననుభవించుచు పూర్వమొక మహానీయుఁడగు యూదుఁడు ఇట్లు పలికి యున్నాఁడు: “దిగంబరుఁడనై మాతృగర్భమునుండి వెలువడినాను, దిగంబరుఁడనై అచటికి వెడలనున్నాను; భగవంతుఁడొసఁగినాఁడు, భగవంతుఁడే కైకొనిపోయినాఁడు.” అతఁడు భ్రమపడ లేదు. ఇదియే జీవనరహస్యము. ఉపరిభాగమున అలలు లేచుఁగాక, తుపానులు వీచుఁగాక, గర్భమున అనంత శాంత్యానందములు నెలకొనియున్నవి. “Blessed are they that mourn, for they shall be comforted” (దుఃఖితులు ధన్యులు, ఏలన వారే ఓదార్పఁబడువారు). ఏల? మహాపదల ననుభవించునపుడు—తండ్రిరోదనమును తల్లి యార్పు

లను గమనింపని యీ ప్రచండవిధిచే హృదయము మథింపఁ బడునవుడు—ఘోర దుఃఖభారమున, నిరాశా భారమున లోకము గాంధాంధకారబంధురమై తోఁచునవుడు—అంతరంగికదృష్టి కలుగును, ఆకస్మికముగా జ్ఞానతేజము భాసించును, సంసారస్వప్నము అదృశ్యమగును, సృష్టిరహస్యము—బ్రహ్మము—సాక్షాత్కరించును. దుఃఖభారము దుర్బలనౌకలను సంసారసాగరమున బుడుంగున ముంచివేయఁ జాలియున్నపుడే ప్రతిభాఢ్యుఁడు, బలాఢ్యుఁడు, ధీరుఁడునగు వాఁడు అఖండసచ్చిదానందబ్రహ్మమును—వివిధనామములచే, వివిధదేశములం దుపాసింపఁబడెడి పరమాత్మను—సందర్శించును. దుఃఖభాజనమగు ఈ సంసారమునఁ దన్ను బంధించు కర్మపాశములు విచ్ఛిన్నమైనంతనే జీవుఁడు అనంతశాంతి నిలయమగు సచ్చిదానంద సామ్రాజ్యమును ప్రాపించును. "పరమేశ్వరా! నీ సంకల్పమే సిద్ధించుఁగాత!" మని యహర్నిశము ప్రార్థించుట మానకుము, సోదరా! మానకుము.

"పరమవిధేయులమై కర్తవ్యాచరణమున జీవితమును ధారపోయుటే మనవిధి."

పరమేశ్వరా! నీ కల్యాణనామమునకు జయము! నీ సంకల్పమే సిద్ధించుఁగాక! తండ్రీ! లోకేశ్వరా! నిన్ను శరణుసొచ్చుటయే మా విధియని యెఱుంగుదుము. శిక్షించినచో అది తల్లిచేయియని యెఱుంగుదుము. తండ్రీ! ప్రేమస్వరూపా! నీవు ఉపదేశించు ప్రశాంతశరణాగతిని ప్రతిఘటించు పరితాపము నా హృదయమును మథించుచున్నది.

కట్టెదుట నీ యదువంశమంతయు నశింప, నోమ్మునఁ గర
కమలముల నిడుకొని నిర్వికారుఁడవై వీక్షించిన యో పురు
షోత్తమా! మాకు బలము ననుగ్రహింపుము! జగమువిధే
యుఁడై వర్తించుటే భక్తుని విధియని మాకు బోధించిన
యో గురూత్తమా! జగత్ప్రభూ! రమ్ము, నన్నేలుకొనుము!
నిన్ను శరణుసొచ్చుటయే జీవితపరమార్థమని మున్ను పార్థు
నకు బోధించిన యో పార్థసారథీ! ఓ యోగేశ్వరా! రమ్ము,
నన్నేలుకొనుము! ప్రాచీన ఋషిపుంగవులవలె నేనును,
“ఓం శ్రీ కృష్ణార్పణమస్తు!” అని స్థైర్యముతో, కృత
నిశ్చయుఁడనై ఘోషింతునుగాక! “భగవంతుఁడు నీకు
శాంతి నొసఁగూర్చుఁగాత” మని యహర్నిశము ప్రార్థించు

—వివేకానందుఁడు.

(36)

చికాగో, 24-1-1894.

ప్రియమిత్రులకు—...అమెరికాజనులును వారి మతా
చార్యులలో అనేకులును నన్ను విశేషముగా ఆదరించు
చున్నారు. (మీరు తెల్పిన) ఆ పత్రిక సమాజముచేఁ గొని
యాడఁబడువానినిగూర్చి కువిమర్శచేసి కొంచెము అపఖ్యాతి
గడించుకొననెంచినది. ఈ కుయుక్తి యెల్లరకును ఇచట
బాగుగాఁ దెలిసినదే. వారు దానిని ఇసుమంతయుఁ బాటిం
పరు. కాని మనహిందూదేశపు మిషనరీలు దీనినిగూర్చి
గడబిడచేయుదురనుటకు సందియము లేదు. వారేమైన

చిందులుత్రొక్కినచో నిట్లు తెల్పుఁడు : "పిల్లయ్యలారా! జాగ్రత! ఇఁక మీ యాటలు సాగవు!" వారి పురాతనపు టిల్లు పునాదులదాఁక నూఁగిసలాడుచున్నది, వారెంత ప్రలాపించినను అది కూలిపోక తప్పదు. ప్రాచ్యమతములు ఇటఁ బ్రవేశించుటవలన హిందూదేశములో వారి సుఖజీవనసాధనములు అడుగంటినవి కాఁబోలును!—ఆ నిర్భాగ్యు లేమిచేయఁగలరు, పాపము! కాని వారి మతాచార్యులలోఁ బ్రముఖుఁడైన వాఁడొక్కఁడైనను నాకుఁ బ్రతికూలుఁడుగా లేఁడు. ఏమైనను గజ్జెకట్టినప్పుడు నృత్యముచేయ వెనుదీయఁదగునా?

మతమహాసభలో మన సనాతనధర్మమును గుఱించి నేను జదివిన చిన్నవ్యాసమును ఇచటి యొక వార్తాపత్రిక నుండి కైకొని మీకుఁ బంపుచున్నాను. నా యుపన్యాసములు సర్వసాధారణముగా ఆశువులు. ...హిందూదేశమునుండి నాకు ఎవ్వరును దోడ్పడనక్కఱలేదు, ఇచ్చటనే కావలసినంత తోడ్పాటు లభించుచున్నది. మీవద్దనున్న ధనమును ఈ చిన్నవ్యాసమును ముద్రించి ప్రకటించుటకుఁగాను వినియోగింపుఁడు ; వివిధదేశభాషలలోనికి దానిని అనువదించి బాహాటముగా వ్యాప్తిచేయుఁడు—మన జాతీయవిజ్ఞానమును అది మన దృక్పథమున నిల్పును. ఈ సందర్భమున (ముఖ్యముగాఁ బ్రాచ్యవిజ్ఞానమును బోధించు) కేంద్రకశాలలను గూర్చియు, నందుండి నలుదెసలను భారతదేశమున వివిధ శాఖలను స్థాపించు మనకార్యక్రమమునుగూర్చియు మఱవకుఁడు. తీవ్రకృషిచేయుఁడు....

అమెరికా స్త్రీలవిషయమున నాయెడల వారి దయను గూర్చి నా కృతజ్ఞత యిట్టిదని వర్ణింపఁజాలను. పరమేశ్వరుఁడు వారికి సకల శుభము లొనఁగూర్చుఁగాక! ఈ దేశమునఁ బ్రత్యుద్యమమునకును స్త్రీలు పట్టుకొమ్మలు, జాతీయ విజ్ఞానమునకుఁ బ్రతినిధులు; పురుషులకు స్వయముగా విద్య గడించుటకే వ్యవధి లేకున్నది.

...లేఖలు అందినవి. వర్ణవ్యవస్థ నిలుచునా, నిలువదా యను విషయముతో నాకు లేశమును జోక్యము లేదు. భారతదేశమునను వెలుపలనుగూడ మానవజాతీయ హృదయమునుండి వెలువడిన యుదారాశయములను దీననారాయణ సన్నిధికి—దరిద్రనారాయణ సన్నిధికి—దోడ్కొని వచ్చుట, తమకేది శ్రేయస్కరమో స్వయముగా వారి నాలోచింపనిచ్చుట—ఇదియే నా ఆశయము. వర్ణవ్యవస్థ నిలువవలయునా, పోవలయునా; స్త్రీలకు సంపూర్ణ స్వాతంత్ర్యము కూడునా, కూడదా...యను నీ సమస్యలతో నాకు సంబంధము లేదు. "ఇచ్ఛాస్వాతంత్ర్యము, క్రియాస్వాతంత్ర్యము ననునవి లేనిచే చైతన్యముగాని వికాసముగాని, శ్రేయముగాని యెన్నఁటికిని గలుగనేరదు." స్వాతంత్ర్యము లేని మానవుఁడు, స్వాతంత్ర్యములేని సంఘము, స్వాతంత్ర్యములేని జాతి యధఃపతనము నొందితీరును.

వర్ణవ్యవస్థ నిలువనిండు, నిలువకపోనిండు; శాఖా సంప్రదాయములు ఉండనిండు, ఊడనిండు; వ్యక్తిగతమైన యిచ్ఛాస్వాతంత్ర్యమును క్రియాస్వాతంత్ర్యమును నరికట్టు

నే మానవుఁడైనను, కులమైనను, జాతియైనను, సంఘమై నను, మఱి యే సంస్థయైనను గానిండు,—పరులను అది బాధింపకున్ననుగూడ—పరమదుష్టము, అది నశించి తీర వలయును.

ప్రతివ్యక్తికిని ఉన్నతాశయములను దెలిపి, స్త్రీపురుషులను దమకర్తవ్యమును దాము నిర్ణయించుకొన నవకాశ మొసఁగు నొక వ్యవస్థను నిర్మించుటయే నా జీవితాశా పరమావధి. జీవితమున నతిముఖ్యమైన సమస్యలనుగూర్చి మన పూర్వులును నితర జాతులును నేమని తలఁచిరో వారిని దెలిసికొననిండు. ముఖ్యముగా నితరు లిపుడేమి చేయు చున్నారో చూచి తమకర్తవ్యమును వారిని నిర్ణయించుకొన నిండు. రసాయనములను ఒండొంటితోఁ జేర్చునంతవఱకే మనపని, తన నియమముల ననుసరించి ప్రకృతియే స్ఫటికీ కరణకృత్యమును నెఱవేర్చును. తీవ్రముగాఁ బనిచేయుఁడు, ధైర్యస్థైర్యములను విడువకుఁడు, భగవానుని నమ్ముఁడు. కార్యరంగమున దిగుఁడు, ముందుగనో వెనుకనో నేనును వచ్చుచున్నాను. "మతమునకు — ధర్మమునకు—హానికలు గని రీతిని జనసామాన్యమును ఉద్ధరింపవలయును" అను మూలమంత్రమును విస్మరింపకుఁడు.

కుటీరమే మనజాతీయ జీవననిలయము—ఈ సంగతి సదా జ్ఞప్తిలో నుంచుకొనుఁడు. ఆహా! జనసామాన్యము నకై ఏమియుఁ జేసినవారెవరును లేరైరి! విధవా వివాహ

ములనుగూర్చి మన నవీన సంస్కర్తలు పరవళ్లు త్రొక్కు-చున్నారు. ఏ సంస్కారము విషయమునైనను నాకు సాను-భూతి కలదు. ఇది నిస్సంశయము; కాని దేశముగతి జనసామాన్యస్థితిపై నాధారపడియుండునది కాని విధవల కెంతమంది భర్తలు దొరకదురను దానిపై నాధారపడి యుండునట్టిది కాదే! జనసామాన్యమును మీరు ఉద్ధరింపఁ గలరా? సహజముగు వారి పారమార్థికశీలమునకు హాని కలుగని రీతిని వారి వ్యక్తిత్వమును—భ్రష్టమైన వారి సాంఘిక వ్యక్తిత్వమును—మఱల వారి కొసఁగఁగలరా? సమత్వమున, స్వాతంత్ర్యమున, కర్మమున, సామర్థ్యమునఁ బాశ్చాత్యులకెల్లఁ బాశ్చాత్యులై, తోడ్తోడనే పారమార్థిక విజ్ఞానమున, శీలమునఁ బరిశుద్ధ భారతీయులై వర్తింపఁ గలరా? ఇదిగో మన విధ్యుక్తధర్మము—దీనిని మనము సాధించి తీరుదుము. ఇందులకే మీరందఱును జన్మించి యున్నారు. ఆత్మవిశ్వాసమును బూనుఁడు. మహాశయములు మహాకార్యములను గన్నతల్లులు. సదా అగ్రసరులు కండు! పేదలయెడ, దీనులయెడ, అధఃకృతులయెడ సాను-భూతి—ఇదియే మన మంత్రము.

ధైర్యసాహసాన్వితులగు వత్సలారా! ముందంజ వేయుఁడు!—ఆప్తుఁడు, —వివేకానందుఁడు.

మఱియొక మాట. ఒక కేంద్రకళాశాలను స్థాపించి, యందు సుశిక్షితులైన ధర్మప్రచారకుల మూలమున విద్యను ధర్మమును దరిద్రనారాయణులకు అందఁజేయుచు దీనజనో

ద్ధరణసందేశమును వ్యాప్తిచేయుఁడు. ప్రతి వ్యక్తికిని ఈ యుద్యమమున నభిరుచి గలుగఁజేయఁ బ్రయత్నింపుఁడు.

—వివేకానందుఁడు.

(37)

చికాగో, 29-1-1894.

దివాన్ మహాశయా—ఇటీవల మీరు వ్రాసిన లేఖ కొలఁది దినముల క్రితము అందినది. దీనులగు మా అమ్మను దమ్ములను జూచుటకు మీరు వెళ్లియుండుట నాకు సంతోష కరము. కాని నా హృదయమున నే విషయమున దౌర్బల్య మింకను మిగిలియున్నదో దానినే మీరు నా స్మృతిపథము నకుఁ దెచ్చియున్నారు. దివాన్ జీ! నిజముగా నేను బాషాణ హృదయుఁడను గానని మీరు గ్రహింపవలయును. లోకమం దంతటను నేను అత్యంతము ప్రేమించు వ్యక్తి యెవ్వరైన నున్నచో అది మా తల్లియైనను సంసారమును త్యజింపనిదే నా గురుదేవుఁడగు శ్రీరామకృష్ణ పరమహంస యవతరించి లోకమునకు బోధింపఁబూనిన మహాసందేశము వ్యాప్తి నొందదని నమ్మినాను, నేఁటికిని నమ్ముచున్నాను; మఱియు ననాత్మవాదము, విషయలోలతయునను నేఁటి ప్రచండతరంగ ముల ధాటి నెదిర్చి హిమశైలములై నిల్చిన యీ యువకుల గతి * యేమగునో యని పరితపించినాను. భారతదేశము నకు—అందు ముఖ్యముగా వంగదేశమునకు—వారు విశేష హితమొనర్చిరి, కాని యిది కేవల ప్రారంభము. దైవసాహా

* అనఁగా తన సోదర శిష్యులగతి.

య్యమున వారు ఆ చంద్రార్కము లోకము తమ్ము ఆశీర్వ దించునట్టి కార్యములను జేయఁగలరు. కావున నా దృక్పథ మునను్న విషయము లివి: ఒకవైపున భారతీయుల సనాతనధర్మమురొయొక్కయు ప్రపంచముయొక్కయు భావిస్థితి, దిక్కును దివాణమును లేక క్రుంగి కృశించుచున్న భారత దీనజనకోటిమెడ నా ప్రేమ; మఱియొకవైపున పరమాప్త వర్గమును దుఃఖభాజనము చేయవలసివచ్చుచున్నది గదా యను పరితాపము. ఇందు మొదటిదే నాకు వరణీయము, మిగిలినదంతయు అల పరమేశ్వరున కెఱుక. పరమేశ్వరుఁడు నాదండ నున్నాఁడు—ఇది నా నిశ్చయము. నేను నిష్కపటినై యున్నంతవఱకు ఆ పరమేశ్వరుఁడు నాకుఁ బ్రాపై నిల్చును గాన నన్ను అడ్డఁజాలినదేదియు నుండదు. హిందూ దేశములో అనేకులు నా తత్త్వము నవగాహన చేసికోనఁ జాలకపోయినారు—పాపము, ఆహారనిద్రాదులు తప్ప మఱి యొక విషయము నెఱుఁగని—మఱియొక చింతలేని—యా నిర్భాగ్యులు అవగాహన చేసికొనుటెట్లు! మీవంటి యుదార హృదయులు ఏ కొలఁదిమంది మాత్రమో నన్ను గొనియాడు దురని నాకుఁ దెలియును. పరమేశ్వరుఁడు మిమ్ము అను గ్రహించుఁగాక! పరులు నన్ను గొనియాడనిండు, కొని యాడకపోనిండు—ఈ యువకులను ఒక కట్టుపాటులోనికిఁ గొనివచ్చుటకు నేను జన్మించియున్నాను, విశేషము ప్రతి పట్టణమునను వందలకొలఁది యువకులు వచ్చి నాతోఁ గృషి చేయ సంసిద్ధులైయున్నారు; అప్రతిహతమైన పొంగిపొరలు రంగములవలె వారిని యావద్భారతదేశమునకును బంపి,

పరమదీనులకు— అధఃకృతులకు— మతమును ధర్మమును విద్యను సౌకర్యమును గరతలామలక మొనర్పవలయునని నా కోరిక. ఈ కార్యమును నేను సాధింతును, లేనిచో నిందులకై ప్రాణములు ధారపోసెదను.'

ఆలోచన యనునది మన జనులకు లేదు, గుణ గ్రహణమనునది యంతకు ముందే లేదు. సరికదా. అనేక యుగపర్యంతదాస్యసంజనితమై, ఘోరమైన యీ అసూయ, ప్రతివిషయము నెడలను ప్రతివ్యక్తి యెడలను అపరిమిత మైన యీ అనుమానము నూతనాశయములన్నిటికిని వారిని ఘోరవిరోధులుగాఁ జేయుచున్నది. ఐనను భక్తవత్సలుఁడగు పరమేశ్వరుఁడు లేఁడా?

హారతినిగూర్చియు నితర విషయములను గూర్చియు మీరు వెలువరించిన శంకలకు నా సమాధాన మిది: భారత దేశమున నానాభాగములందునుగల మతములలో నీ యాచారము లేకపోలేదు. గురుపూజ వేదములు శాసించు నట్టి ప్రధానవిధి. కీడుమేళ్లు ఇందును గలవు; కాని మాది యద్వితీయమైన యొక సమాజమనియు మామత మవలం బింపవలయునని యితరులను నిర్బంధింప మాలో నెవ్వరికిని హక్కులేదనియు మీరు గమనింపవలసియున్నది. ఏ విధ మైన విగ్రహారాధనమునను నమ్మకములేనివారు మాలో ననేకు లున్నారు, కాని యితరులు దానిని జరుపుచున్నపుడు వలదనుటకు వారికి అధికారములేదు. మన మతధర్మము లందలి ప్రధాన సూత్రములకే అది విరుద్ధము గదా. అదిగాక మానవునియందే, మానవుని మూలముననే

భగవంతుని దెలిసికొననగును. తేజస్స్పందనములు ప్రతిచోటను గలవు, ఐనను దీపమునందే అవి మనకు ద్యోతకమగుచున్నవి. భగవంతుఁడును ఇట్లే సర్వత్ర నెలకొనియున్నను వానిని ఒకపెద్ద మానవునిగా మాత్రమే భావింపఁగలుగుచున్నాము. కారుణ్యమూర్తి, జగద్రక్షకుఁడు, దీనబాంధవుఁడు—ఇత్యాది భగవద్విశేషణములన్నియు, భావనలన్నియు మానవభావనలే కదా, బ్రహ్మమునకు మానవరూపారోపణ జేయునవే కదా, మఱియు గురువనుఁడు, ప్రవక్తయనుఁడు, అవతారమూర్తియనుఁడు—ఎవరో యొక మానవు నాశ్రయించుకొనియుండునవే కదా యీ భావములు. మానవుఁడు తన స్వభావము నతిక్రమించుట మీ శరీరమునుండి మీరు బయటికి దుముకుటవలె నసాధ్యము. మఱియుఁ గొందఱు తమ గురువును ఆరాధించుచో, ఆ గురువు చారిత్రకప్రశస్తిగనిన మన ప్రవక్తలందఱను ఏకముగాఁ గైకొని చూచినను వారందఱికంటెనుగూడ సహస్రగుణాధిక మహనీయమూర్తియై యుండునెడ, వానిని ఆరాధించుచో, నుపద్రవమేమి? క్రీస్తునుగాని, కృష్ణునిగాని, బుద్ధునిగాని యారాధించుటవలన బాధలేనిచో, దుష్కార్యముల నెన్నఁడును జేసియెఱుఁగని, యపవిత్రభావమును గలనైనను దలఁచి యెఱుఁగని యీ పురుషోత్తముని—కేవల సహజజ్ఞానమువలననే యెవ్వని ధీవైభవము లితరప్రవక్తలందఱి ధీశక్తిని—వారందఱును బాహ్యికాశయములుకలవారు కావున—అతిశయించిన యీ మహనీయు నారాధించుటవలన హానియేమి? ప్రతి మతము నందును సత్యముకలదనికాక, ప్రతి మతమును సత్యమేయని

మొట్టమొదట లోకమునకు జాటిన దీ మహనీయుడే కదా! మఱియు నే భౌతికశాస్త్రము యొక్కయు, నే వేదాంతము యొక్కయు, మఱియే యితర శాస్త్రములయొక్కయు సాయము లేకయే ఆ గంభీరరహస్యమును గనుగొనెనే! నేడు ప్రపంచమంతటను అతని సిద్ధాంతము వ్యాపించుచున్నదే!

కాని దీనిని (గుర్వారాధనమును) జరిపి తీరవలయునను నిర్బంధము లేదు. ఎల్లరును గురువును (ధూప దీప నైవేద్యాదులతో) ఆరాధించి తీరవలయునని నా సోదర శిష్యులలో మీ కెవ్వరును జెప్పియుండ లేదు, ముందెన్నటికిని లేదు. కాని యొకరు ఆరాధించుచో, వలదనుటకు ఇతరులకు అధికారము లేదు. ఏల? వేర్వేఱు భావములును వేర్వేఱు ఆశయములును గల పలువురు సంపూర్ణ సమరసభావముతో మనుచున్న యీ సంఘము—ప్రపంచము ఇతఃపూర్వమెన్నడును గని విని యెఱుంగని యీ అద్వితీయసంఘము—దానివలన నశించి పోవుటకు అవకాశముండుటచేత. దివాన్ జీ, ఓపిక బట్టుడు, దేవునిదయవలన నింకను విశేషము కనబోయెదరు.

ప్రతిమతము నెడలను ధర్మము నెడలను మేము సహనము గలిగియుండుట యేగాక, అయ్యవి సత్యపూర్ణములని మనఃపూర్వకముగా నంగీకరింతుము; భగవదనుగ్రహమున ఈ తత్త్వమును నేను బాహాటముగా లోకమునకుఁ జాటఁ బ్రయత్నించుచున్నాను.

ప్రతినాయకుడును మహాపురుషుఁడగుటకు, ప్రతి సంఘమును మహిమాన్వితమై వెలయుటకు, మూఁడు విషయములు ఆవశ్యకములు :—

1. సౌజన్యము సాధింపఁజాలని నేదియు లేదను విశ్వాసము.

2. అసూయాసంశయ రాహిత్యము.

3. సజ్జనులై మనుటకును సత్కార్యముల నాచరించుటకును బ్రయత్నించువారి కెల్లరకును సాయపడుట.

అద్భుత స్వభావాదులచే నెగడిన హైందవజాతి ఐకమత్యమును గోల్పోయి చెల్లాచెదరై పోవుటకు కారణ మేమి? అసూయయని నేను చెప్పెదను. ఒండొరులయెడ నేఁడు పరమనికృష్టముగా ననసూయపడుటలో, ఒండొరుల పేరు ప్రతిష్ఠలనుజూచి కండ్లలో నిప్పులు పోసి కొనుటలో, ఈ నిర్భాగ్య హిందూజాతిని మించినజాతి జగత్తున లేదు. మీరు బయలుదేఱి యొకసారి పశ్చిమఖండమునకు వచ్చినపక్షమున, ఈ నీచగుణము లేకుండుట పాశ్చాత్యసంఘములందు మీకు గోచరించు ప్రథమలక్షణము.

హిందూదేశములో ముగ్గురు ఐదునిమిషములు ఐకమత్యముగలిగి పనిచేయుట యసాధ్యముకదా! ప్రతివ్యక్తియుఁ దనగొప్పకై —తన యధికారమునకై — ప్రాఁకులాడుటయుఁ గాలక్రమమున సంఘమంతయు ధ్వంసమైపోవుటయు! ప్రభూ! సర్వేశ్వరా! ఎన్నఁడు మేము అసూయారహితవర్తనమును

నేర్చుకొందునుగదా! ఇట్టి సంఘమున, ముఖ్యముగా వంగ దేశమున, భేదాభిప్రాయములను పాటింపక, అనశ్వర ప్రేమ సూత్రబద్ధమై యైకమత్యముతో మెలఁగు నొక సంఘమును నెలకొల్పుట యద్భుతముగదా! ఈ సంఘము అభివృద్ధి నొంది తీరును. అద్భుతౌదార్యముతో అఖండ సామర్థ్యమును వికాసమును మేళవించెడి యీ పరమాశయము భారతదేశమందంతటను వ్యాప్తి నొందవలయును, జాతిని నూతనచైతన్యముచేఁ బులకింపఁజేయవలయును, జానిసలతోఁగూడిన యీ జాతికి పరంపరానుగతము, ఘోరమునగు నజ్ఞానము, ద్వేషము, ఆభిజాత్యము, ఛాందసము, ఈర్ష్యయును పిశాచముల నావలకుఁ ద్రోలి సంఘమున నీ పరమాశయము అస్థిగతము కావలయును.

కదలికయనునది లేక చదికిలఁబడియున్న యీ జాతీయసాగరమునుండి పర్వతములవలె వెలువడు కొలఁది మంది యుదారచరిత్రులలో మీరు ఒకరు. పరమేశ్వరుఁడు సదా మీకు సమస్త శుభము లొనఁగూర్చుఁగాక!—— చిర స్నేహాస్పదుఁడు, ——వివేకానందుఁడు.

(38)

షికాగో, 8-8-1894.

స్నేహాస్పద——, విశ్వాసము అద్భుతమగు నంతరవలోకనమును అద్వితీయతరణోపాయము నను నంతవఱకు నీతో నే నేకీభవింతును; కాని యది పురోవృద్ధి నరికట్టు

స్వమతాభినివేశమును దురభిమానమును గలుగఁజేయ వచ్చును—ఇందలి ప్రమాదమిది.

జ్ఞానము మంచిదే, కాని యది మిట్ట వేదాంతముగాఁ బరిణమింపవచ్చును—ఇది యిందలి ప్రమాదము. భక్తి దొడ్డదియే, మనోహరమైనదియే, కాని యది నిరర్థక భావోద్రేకమున నశింపవచ్చును. వలయునది వీనియన్నిఁటి యొక్కయు సామరస్యము. రామకృష్ణుఁడిట్టి సమరసమూర్తి. ఇట్టి మహనీయులు అరుదుగాఁగాని కానరారు; కాని యీ మహనీయు నాదర్శముగాఁ గొని—ఈతని యుపదేశములను ఆదర్శముగాఁగొని— మనము బ్రహ్మమార్గమునఁ జరింప వచ్చును. మనలోఁ బ్రతివ్యక్తియు నాతని పరిపూర్ణతను బొందఁజాలకపోయినను, అన్యోన్యలోప పరిహారమూలమున, అన్యోన్యవ్యత్యయ సమీకరణమూలమున, అన్యోన్యాశయ సాఫల్యమూలమున, నట్టిపరిపూర్ణతను సాధింపవచ్చును గదా. ఇది పలువుర నేకీభావముచేఁ గలుగు సామరస్యమై యితరమత సంప్రదాయములనన్నిఁటి నధిగమింపఁగలదు.

మతధర్మములు పటుత్వము గలిగియుండవలయుననిన, నుత్సాహము ఆవశ్యకము. దీనికేఁదోడు శాఖాసంప్రదాయములు పెరుగకుండఁ జూచుకొనవలయును. పక్షపాతరహితమగు సంప్రదాయము నవలంబించుటవలన మన కీప్రమాదము తొలఁగును, అందు విశ్వమానవ మతౌదార్యముతోఁ బ్రత్యేక సంప్రదాయములందలి లాభములన్నియు మేళవించును.

భగవంతుఁడు సర్వాంతర్యామియైయున్నను మానవ రూపమునను మానవశీలమునను మాత్రమే మనకు గ్రాహ్యము కాఁగలఁడు. రామకృష్ణునంతటి పరిపూర్ణమైన వ్యక్తియు రామకృష్ణుని శీలమంతటి పరిపూర్ణమైన శీలమును మున్ను ఎన్నఁడును వెలసియుండలేదు—అతని శీలవ్యక్తిత్వములే మనకు గమ్యము కావలయును; మఱియుఁ బ్రతివ్యక్తియుఁ దన దృక్పథము ననుసరించి యాతని భగవంతుఁడుగనో, రక్షకుఁడుగనో, ఆచార్యుఁడుగనో, ఆదర్శమూర్తిగనో, మహాపురుషుఁడుగనో పరిగణింప మనము అంగీకరింపవలయును.

సాంఘిక సమత్వమునుగాని, యసమత్వమునుగాని బోధింపక, ప్రతివ్యక్తికిని సమానాధికారములు గలవని తెలుపుచు, సర్వవిధములను భావస్వాతంత్ర్యమును క్రియాస్వాతంత్ర్యమును ఆవశ్యకమని మనము చాటుదము.

ఆస్తికులను నాస్తికులను, విశిష్టాద్వైతులను అద్వైతులను, అజ్ఞేయవాదులను (Agnostics)—ఎవ్వరినైనను మనము నిరాకరింపఁదగదు; శిష్యుఁడగుటకును సాధకుఁడగుటకును వలయునది యొక్కటే నియమము—మహోదారము, మహాగంభీరము నగు శీలము నలవఱుచుకొనుటయే.

ప్రవర్తనమునుగూర్చి కాని, శీలమునుగూర్చి కాని, అన్నపానీయములను గూర్చి కాని—అవి యితరులకు బాధ కలిగింపకుండునంతవఱకు—మనము ఏవిధమైన ప్రత్యేక నియమమును విధింపఁబోము.

పురోవృద్ధి నరికట్టునట్టిది, లేదా, పతనమునకుఁ దోడ్పడునట్టిది, ఏదిగ్దున్నను పాపమే; ఉద్ధరించునదియు సమన్వయము నొందించునదియు నేదిగ్దున్నను పుణ్యమే.

తన కేది యనుకూలించునో, తోడ్పడునో దాని నెన్నుకొని యవలంబించుటకుఁ బ్రతివ్యక్తికిని స్వాతంత్ర్యము కలదని మనము అంగీకరింతుము. ఉదాహరణమునకు మాంసాహారము ఒకనికిని ఫలాహారము మఱియొకనికిని దోడ్పడవచ్చును. ప్రతివ్యక్తియు యథేష్టముగాఁ దన వైచిత్ర్యమును అభిరుచిని అనుసరించుఁగాక; ఇతరుల ప్రవర్తనను—దానిని దాము అవలంబించిన దమకది హానికరమగునను కారణమున—నిరసించుటకుఁగాని, వారు తమ మార్గము నవలంబింపవలయుననుటకుఁగాని యెవ్వరికిని హక్కులేదు. ఇట్టి యాత్మవిశ్వాసమునఁ గొందఱకు భార్య యున్నచో సాయపడవచ్చును, గొందఱకామె కేవలము హానికరము గావచ్చును. కాని యవివాహితుఁడగు శిష్యునకు (లేదా, సాధకునకు) వివాహితుఁడగువాని మార్గము తప్పు అనుటకుగాని, తనయాదర్శమునే తన సోదరుఁడును అవలంబింపవలయుననుటకుఁగాని యధికారము లేదు.

ప్రతిజీవియు సాక్షాద్భగవంతుఁడని మనము నమ్మెదము. జీవుఁడు, లేక జీవాత్మ అజ్ఞానమేఘములచే నావరింపఁబడిన జ్ఞానభాస్కరుఁడు; ఈ మేఘముల సాంద్రతయందుఁగల వ్యత్యాసమే ఒక జీవికిని మఱియొక జీవికిని గల వ్యత్యాసము. తెలిసినను తెలియకున్నను సర్వమతధర్మ

ములకును ఇదియే మూలాధారమనియు సాహిత్యకముగాఁగాని, యామ్మిష్కకముగాఁగాని, వైజ్ఞానికముగాఁగాని మానవాభ్యుదయచరిత్రమున కంతకును నిదియే ప్రధానసూత్రమనియు మనము నమ్మెదము—ఒకే ఆత్మతత్త్వము వివిధావస్థలయందు వ్యక్తమగుచున్నది.

ఇదియే వేదసారమని మన నమ్మకము.

ఇతరజీవుల నిట్లు, అనఁగా వారు భగవత్స్వరూపులని గణించుటయు వారియెడ తదనుగుణముగా వర్తించుటయు ప్రతి జీవియొక్కయు కర్తవ్యమని మనము నమ్మెదము; ఇతరజీవులను ద్వేషించుటయు నిరసించుటయు, ఏ రూపముననను, ఏ విధముననను హింసింపఁ దలపడుటయుఁ దగదని మనము నమ్మెదము. ఇది సన్న్యాసులకు మాత్రమే కాక, సమస్త స్త్రీ పురుషులకును విధ్యుక్తమగు ధర్మము.

ఆత్మయందు జాతిభేదము లేదు, లింగభేదము లేదు, ఏ విధమైన కళంకమును లేదు.

వేదములలోఁగాని, దర్శనములలోఁగాని, పురాణములలో గాని, తంత్రములలోఁగాని, యెచ్చటను ఆత్మయందు జాతి మత లింగభేదములున్నట్లు తెలుపఁబడలేదని మనము నమ్మెదము. కావున "మతతత్త్వములకు సంఘసంస్కారముల జోలి యేల?" యనువారితో మనము ఏకీభవింతుము. సాంఘిక సూత్రములను విధించి వ్యక్తులనడుమ భేదమును బాటింపవలయుననుట మతతత్త్వములకుఁ దగదని వారికి మనము తెలుపునపుడు వారును మనతో నేకీభవింపవలయును. భేద

దృష్టిచేఁగలుగు సమస్తభ్రమలను వైషమ్యములను దొలఁగించుటయేగదా మతతత్త్వముల గమ్యము!

కాని యీ భేదములమూలముననే పరమసామ్యమును పరమైక్యమును మనము సాధింపఁగలమని వారు వాదించుచో, బురదచే బురద యెన్నఁటికిని క్షాళితముకాదని మతధర్మము తెలుఁగత్తి ఘోషించుచున్నదని వారికి మన సమాధానము.

దుర్మార్గమూలమున మానవుఁడు సన్మార్గుఁడు కాఁగలఁడు కాఁబోలును!

మతధర్మముల సమ్మతి నాగరికపరిస్థితుల ననుసరించి సాంఘికనియమము లేర్పడియున్నవి. సాంఘికవిషయములలోఁ గలుగఁజేసికొనుటయే మతముచేయు గొప్పతప్పు. కాని, "సంఘసంస్కరణములతో మతతత్త్వములకు సంబంధము లేదు" అని పలుకుచు మతము ఎట్లు మఱల ఆత్మవిరుద్ధముగా నడచునో! మతము సంఘసంస్కర్త కాఁదగదనియే మన మతము. సాంఘికశాసనకర్తృత్వమునకు మతమునకు అధికారము లేదు. ఓ మతతత్త్వములారా! చాలుచాలును! మీ బాగోగులను మీరు చూచుకొనిన, మిగిలినదంతయుఁ జక్కఁబడును లెండు!

1. పరిపూర్ణత మానవునియందుండనే యున్నది, తత్ప్రకటనమే విద్య.

2. దైవత్వము మానవునియం దుండనేయున్నది, తత్ప్రకటనమే ధర్మము, పరమార్థము.

కావున నాటంకములను దొలఁగించుట కీ యీ రెండింటి యందును (అనఁగా విద్యావిషయమునను బరమార్థవిషయమునను) ఆచార్యుని విధి. నే నెప్పుడును జెప్పెడి కేవలని మనము లేనిపోని జోక్యము కల్పించుకొననిచో సమస్తము చక్కఁబడును. మార్గమునుండి యాటంకములను దొలఁగించుటయే మనవిధి. మిగిలినదంతయు భగవంతుఁడే యొనరించును.

కావున మీరు ముఖ్యముగా గమనింపవలసిన విషయమిది: ఆత్మతోడనే మతతత్త్వములకుఁ గల సంబంధము; సాంఘికవిషయములలోఁ గలుగఁ జేసికొనుటకు వానికి హక్కు లేదు: ఈ విషయము గమనింపకపోవుటయే ఇంతవఱకు జరిగిన గందరగోళమున కంతకును మూలకారణము. ఒకని సొత్తు బలాత్కారముగా నపహరించి, యాతఁడు తిరిగి దానిని సంపాదింప యత్నించుచో, మొఱ్ఱపెట్టుచు, మూలుగుచు, స్వత్వాధికార పవిత్రతనుగూర్చి ధర్మసూక్తులను సాయించి నట్లున్నదీ కథ !

తమ కేమి హక్కు గలదని—కోట్లకొలఁది జనులజీవితము దుఃఖభాజనము చేయుచు—ప్రతి సాంఘిక విషయమునను బురోహితులును మతాచార్యులును గలుగఁ జేసికొనినారు?

క్షత్రియులు మాంసాహారులని నీ వేమో అధిక్షేపించి నావే ! మాంసమో, గింసమో—హిందూమతమందలి యుత్తమాశయముల కన్నింటికిని, మహోత్తమధర్మముల కన్నింటికిని వారే మూలపురుషులు ! ఉపనిషత్తులు రచించిన దెవరు ? రాముఁడెవరు ? కృష్ణుఁడెవరు ? బుద్ధుఁడెవరు ? జైన

తీర్థంకరు లెవరు ?...గీతను వ్యాససూత్రములను జదువుము, లేనిచో నెవరిచేతనైనను జదివించుకొనుము. గీతలో సమస్త స్త్రీ పురుషులకును సర్వవర్ణములకును మోక్షమార్గము బాహాటముగా, సమానాధికారముతోఁ బ్రకటింపఁబడి యున్నది, కాని వ్యాసుఁడు శూద్రులను వెఱ్ఱివాండ్రను జేసి, వారి కనుమూయుటకై వేదములకు పెనిపోసి యర్థములు గల్పించును. ఒక మాంసపుముక్క మూలమున వాని కరుణారస మింకిపోవుననుటకు భగవంతుఁడు మీవలె భయగ్రస్తుఁడగు మూర్ఖుఁడా యేమి? అగునేని నట్టి భగవంతుఁడు కేవలతృణ ప్రాయుఁడు!

నామీఁద నేమియు నాశపెట్టుకొనకుఁడు, కాని మీకు నేను వ్రాసియున్నటుల, మీతోఁ జెప్పియున్నటుల, భారత దేశము ఎన్నఁటికైనను భారతీయులవలననే యుద్ధరింపఁబడ వలయును. కావున మాతృదేశీయయువకులారా! మీలో వందలకొలఁదిమంది యీ నూతననాశయమునుగూర్చి యించు మించుగా వీరావేశపరులు కాఁగలరా? సమాలోచనాపరులై సామగ్రిని సంపాదించి, యమానుషక్రియలను అద్భుతములను అన్నిఁటినిఁ బ్రయత్నపూర్వకముగాఁ ద్రోలఁగించి రామ కృష్ణుని జీవితమును వ్రాయుఁడు. ఆతని సిద్ధాంతములకు నిదర్శనముగానుండునట్లు జీవితచరిత్ర వ్రాయఁబడవలయును. ఆతను చరిత్రమాత్రమే నుఁడీ—నన్నుఁగాని, సజీవులగు మఱెవ్వరినిగాని యందుఁ జొనుపకుఁడు. లోకమున కాతఁడేమి బోధించెనో, అందులకు నిదర్శనమగు నాతని చరిత్ర మెట్టిదో—తెలుపుటయే మీ ముఖ్యాశయమై యుండ

వలయును. అనర్హుఁడనైనను నా యధీనమందుంచఁబడిన రత్నపేటికను వెలికిఁగొనివచ్చి దానిని మీకు అందఁజేయుటయే నా కాతఁ బొసఁగిన యాజ్ఞ. ఎందువలననో తెలియునా? ఐహికవిషయలాలసులగు నంచకులు, ఈర్ష్యాళువులు, శానిసలు, పిఱికిపందలు ఎన్నఁడును ఏమియుఁ జేయఁజాలరు కావున. శానిసజాతికి స్వతస్సిద్ధమగు ననూయ మన జాతీయశీలమునకు వేఱుపురుగు. సర్వశక్తిసంపన్నుఁడగు సాక్షాత్పరమేశ్వరుఁడు కూడ...అసూయాగ్రస్తులగు నీ నిర్భాగ్యుల కేమియుఁ జేయఁజాలఁడు.

తన కర్తవ్యమును నెఱవేర్చి యిప్పుడు గతించిన వానిగా నన్నుగూర్చి భావింపుఁడు. కార్యభారమంతయు మీ భుజములమీఁదనే యున్నదని భావింపుఁడు....యువకులారా! భారతమాతృపుత్రులారా! ఈ కార్యమును నిర్వహింప విధినిమంత్రితులమని భావింపుఁడు. మీరే యీ మహోద్యమమునకుఁ బూనుకొనుఁడు. భగవంతుఁడు మిమ్ము ననుగ్రహించుఁగాక! నన్ను విడిచిపెట్టుఁడు. నన్ను లక్షింపకుఁడు. నూతనాదర్శమును, నూతనసిద్ధాంతమును, నూతన జీవనవిధానమును జనులకు బోధింపుఁడు. ఏ వ్యక్తిని నిరసింపకుఁడు, ఏ యాచారమును నిందింపకుఁడు, వర్ణ వ్యవస్థను దూషింపకుఁడు; మఱియు భూషింపకుఁడు. ఏ సాంఘిక లోపమును గూర్చియు ననుకూలముగాఁగాని ప్రతికూలముగాఁగాని బోధింపకుడు; "అనవసరమైన జోక్యము వలదు" అని మాత్రమే బోధింపుఁడు. మిగిలినదంతయు స్వయముగనే చక్కఁబడును.

ధీరులారా! సుస్థిరులారా! వత్సలారా! మీకందఱి కిదె నా యాశీర్వచనములు. —వివేకానందుఁడు.

(39)

## అమెరికాదేశీయుఁడగు నొక మిత్రునకు

చికాగో, 15-3-1894.

ఉపన్యాసాదికమైన యీ గందరగోళమనిన నాకు విసుగు పుట్టుచున్నది. వేయివిధములైన యీ మానవవ్యగములతోడి యీ సమావేశములు నా మనస్సును గలంచినవి. నా యభిరుచి యేమో చెప్పెదను, వినుము. నేను వ్రాయఁ జాలను, ఉపన్యసింపఁజాలను. కాని గంభీరముగా నాలోచింపఁగలను, ఆవేశపూరితుఁడనైనపుడు భావవిస్ఫులింగములను వెలిగ్రక్కఁగలను. కాని యిది యేర్పికూర్చిన యే కొలఁదిమందికో మాత్రమే సుమీ. నేను గాక, యిచ్చవచ్చినచో వారే నా భావములను గ్రహించి నలుదిక్కులను వ్యాప్తిచేయుదురుగాక. ఇది కేవల పరిశ్రమవిభజనము. సమాలోచించుట, తన భావములను దానే వ్యాప్తి చేయుట—రెంటిని ఒకే వ్యక్తి యెన్నఁడును గొనసాగించియుండలేదు. ఒకవేళ నున్నచో, ఆ భావములకు విలువ లేదు. ఏమందువా, ఆలోచించుటకు, ముఖ్యముగా నాధ్యాత్మికవిషయములను సమాలోచించుటకు, వలసినంత స్వేచ్ఛావిరామము లుండవలయును.

ఈ స్వాతంత్ర్యప్రకటనము, మానవుఁడు కేవల నిర్జీవ యంత్రము కాదను నీ స్థిరీకరణము సమస్త మతతత్త్వముల

కును హృదయము. కావుననే యివి కేవలము పరిపాటిగా, 'అహామోహీ'గాఁ జింతింపఁదగిన విషయములు కావు. ప్రతి విషయమును యంత్రస్థితికిఁ దీసికొనివచ్చు మనఃప్రవృత్తియే పాశ్చాత్యలోకమునకు అద్భుతమైన కలిమి కలుగఁజేసినది. మఱియు నిదియే మతధర్మములను పశ్చిమఖండమునుండి యావలకు సాగనంపినది. లేశమైన మిగిలియున్నచో నది కేవలము కవాతులోనికి దిగినది.

నిజముగా నే నెంతమాత్రము "ప్రచండుఁడను", "తుపానువంటివాఁడను" గాను. నా ప్రకృతి కేవలమిందులకు వ్యతిరేకము. నేను గోరునది యిచట లేదు, ఈ "ప్రచండ" పరిస్థితులను నిఁక సహింపఁజాలను. ఆత్మమోక్ష యత్నముతోఁబాటు కొలఁదిమంది స్త్రీలను బురుషులను ముక్తులను జేయఁ బ్రయత్నించుట—ఇదియే మోక్షమార్గము: ఆధ్యాత్మిక సింహములను గొలఁదిమందిని వెలువడఁజేయుట, అతిహీనకాని భస్మహవ్యములతో నాయువును బలమును ఆరోగ్యమును దుర్వినియోగము చేసికొనుట కాదు—ఇదియే నా జగద్ధితాచరణ విధానము.

కొన్ని సంవత్సరములపాటు మూకీభావము వహించి మాటాడనే మాటాడకుండునట్టి విరామము నాకెపుడు ప్రాప్తించునో కదా! ఈ లౌకిక సమరములు, ఈ గందరగోళమును నా తత్త్వమునకుఁ గేవల వ్యతిరిక్తము. ఏవో స్వప్నము లల్లుకొనుచు, మనోరాజ్యమున నల్లన విహరించుటయే నా స్వభావము. స్వతస్సిద్ధముగా నేను లౌకికవిషయ

మిథ్యావాదిని, భావనాప్రపంచమే నా జీవనరంగము. లౌకిక విషయస్పర్శ నా మనోరథములను కలంచి నాకు అశాంతిని కల్గించును. ఐనను, పరమేశ్వరా! నీ సంకల్పమే జరుగుఁగాక!

(40)

ఓం నమో భగవతే రామకృష్ణాయ!

చికాగో, 19-3-1894.

శ్రీయుతుష్మంతుఁడగు——... ఈ దేశమున నాకేమియు లోటు లేదు; కాని భిక్షాటనము ఇచటి యాచారము కాదు— అందుచే నేను కృషిచేయవలయును, అనగా నందందు ఉపన్యసింపవలయును. ఇచట శీతోష్ణములు అత్యధికములు. వేసవి కలకత్తా వేసవికిఁ దీసిపోదు. ఇఁక శీతకాలమందలి చలియో, చెప్పనలవికాదు! మూఁడు నాలు గడుగుల యెత్తున, ఏల, కొన్నిచోట్ల నాలేడడుగులయెత్తున దేశమంతయు మంచుతోఁ గప్పఁబడియుండును! దక్షిణప్రాంతములందు మంచుండదు. ఐనను చలిని మంచును ఇచటి వారేమియు లెక్కచేయరు... కెనడాలో నుత్తరభాగమున నుష్ణమాపకమునందలి పాదరసము (అపరిమితమైన చలిచే) గడ్డకట్టిపోవును... మంచు కురియుదినమనఁగా నపరిమిత శీతలమైయుండవలయు ననుకొనువాఁడను, వాస్తవ మది కాదు; ఇంచుమించుగా నుక్కపోయు దినములలోఁ గూడ మంచు కురియును. అమితమైన చలి యొక విధమైన మత్తు గొల్పును. బండ్లు నడవవు; చక్రములులేని Sledge అను

నొకవిధమైన మోటుబండి నేలమీఁదినుండి జాఱుచుపోవును! సర్వము గడ్డకట్టియుండును— నదులమీఁదను గాలువల మీఁదను చెఱువులమీఁదను ఏనుఁగులుకూడ నడవవచ్చును. బ్రహ్మాండమైన నయాగరా జలపాతము —అంత యురవడి గలిగిన జలపాతము—చలువరాతివలె గడ్డకట్టుకొనిపోవును!! కాని నేను హాయిగనే యున్నాను. మొదట కొంచెము భయపడినానుగాని క్రమముగా—ఆవశ్యకతచే ననుఁడు— కెనడా ప్రాంతములకు నేఁడు రైలుబండిలోఁ బయనించుచు మఱునాఁడు దక్షిణామెరికాలో నుపన్యసించుట జరుగుచున్నది! ఆవిరిగొట్టముల మూలమున మనగదివలెనే తోఁచు రీతిని బండ్లు వెచ్చగా నుంచఁబడును, వాని చుట్టును నెటు చూచినను స్వచ్ఛమైన తెల్లని మంచుగుట్టలు కన్నులపండువు చేయుచుండును!

నా ముక్కును చెవులును ఊడిపోవునేమో యని చాల భయపడినాను, కాని నేఁటివఱకు యథాప్రకారముగనేయున్నవి. ఏమైనను మోపెఁడు వెచ్చని దుస్తులతో— ఒక బొచ్చుకోటు, కాళ్లకు జోళ్లు, ఉన్నితోఁ జేయఁబడిన నిలువుటంగీ—ఇంత పెద్ద హంగామాతో నేను బయటికి వెళ్లవలసియుండును. ఊపిరి విడిచియు విడువకమునుపే అది గడ్డమునను మీసమునందును చేరుకొనిపోవును! దీని కంతకును దోడు, విచిత్రము, నీటిలో నొక మంచుగడ్డను వేయనిదే యిండ్లలో వీరు మంచినీళ్లు త్రాగరు. ఏలన నిండ్లలో వెచ్చగానుండును. ప్రతిగదియుఁ బడికట్టును ఆవిరిగొట్టముల మూలమున వెచ్చగా నుంచఁబడును. కళలలో నుపకరణ

నిర్మాణములో, సంపాదనములో, భోగభాగ్యములలో వీరిదే ముందంజ; వ్యయమునను వీరిదే ముందంజ. దినమునకు ఒక కూలివానికి లేదా, సేవకునకు జీతము ఆఱు రూపాయిలు; గుఱ్ఱపుబండి యద్దె అధమము మూడు రూపాయిలు; ఒక పొగచుట్ట వెల కనీసము నాలుగణాలు; ఒక మంచి జోడు పాతిక రూపాయిలు; 'సూ్యటు' ఐదునందల రూపాయిలు. సంపాదన యెట్లో వ్యయమును వారికి అట్లే. ఒక యుపన్యాసమునకు రెండువందలు మొదలుకొని మూడువేల రూపాయిలవఱకును దొరకును. నేను ఐదువందల వఱకును ఎక్కినాను.* నా యదృష్టము ఇపుడు ఉచ్చస్థితి నందియున్న దనుటకు సందియము లేదు. నే నన్న ఈ దేశీయులకు మక్కువ; వేలకొలది జనులు నా యుపన్యాసములను వినుటకై వత్తురు.

ప్రైవికముగా...మహాశయుని గలిసికొంటిని. మొట్ట మొదట ఆతఁడు నాయెడ విశేషమైన సద్భావముఁ జూపెను, కాని షికాగో పౌరులందఱును గుంపులు గుంపులుగా నా వద్దకు రానారంభించినంతనే ఆతని కళ్లు కుట్టినవి, మనస్సులో కుళ్లు బయలుదేఱినది!...క్రైస్తవమతాచార్యులు నన్ను

* షికాగో విశ్వమతమహాసభలో నుపన్యసించిన పిదప స్వామి యొక యుపన్యాససంస్థ యాజమాన్యమున (అమెరికాలో) నుపన్యసింప సాగెను; కాని తన కది స్వాతంత్ర్య ప్రతిబంధకమను కారణమున నచిరకాలముననే యా సంస్థతో సంబంధమును వీడి, తానార్జించిన ధనము విశేషభాగము భారతదేశమందలి వివిధభాగములలో ననేక ధర్మకార్యములకుఁ గాను వినియోగింపసాగెను.

అణఁచుటకు విశ్వప్రయత్నము చేసిరి. కాని గురుదేవుఁడు నా దండనుండఁగా నెవ్వ రేమిచేయఁగలరు? అమెరికాదేశ మంతయు నన్ను ప్రేమించుచు, గౌరవించుచు, నా వ్యయమును భరించుచు, నన్ను గురునివలెఁ బూజించుచున్నది... నాకుఁ బ్రతికూలముగా నేమిచేయుటకును మీ మతాచార్యులకు శక్తిలేకపోయినది, పాపము! ఇచట వీరందఱును విద్యాధికులు, పండితులు. "మేము విధవా వివాహము చేయుదుము", "విగ్రహారాధన చేయము" అని యేమేమో ఏకరువుపెట్టుటవలన నేమియుఁ బ్రయోజనము లేదు. వీరు చూచునది పాండిత్యము, వేదాంతవిజ్ఞానము. కల్లబొల్లి మాటలవలన నేమియు లాభము లేదు....

సోదరా! వాస్తవస్థితిగతులు బోధపడుచున్నవి. "యేతుఘ్నన్తి నిరర్థకం పరహితం తే కే న జానీమహే"— "వృథాస్వార్థభంగము గావించెడు వారలెవ్వరో యెఱుంగన్ శక్యమే యెవరికిన్." * అన్నా! మనము అన్నింటిని తొలఁగించుకోవచ్చునుగాని పరమ దుర్భాగ్యమైన యీయీర్ష్యను మాత్రము తొలఁగించుకోఁజాలము ... పరదూషణము— పరుల గొప్పతనమును జూచినంతనే కడుపుమంట—మన

---

* మ. తమ కార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్, దమకార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్, దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్ వృథా స్వార్థభంగము గావించెడు వార లెవ్వరో యెఱుంగన్ శక్యమే యెవరికిన్.

—భర్తృహరి నీతిశతకము, 64 (ఏనుఁగు లక్ష్మణకవి యనువాదము).

కిది జాతీయపాతకము. నా ఘనతయో ఘనత, పరులెవ్వరును
దీనిని బొందరాదు !!

ఈ దేశ స్త్రీలవంటివారు జగత్తున మఱెచ్చటను లేరు. వారెంతటి వినిర్మలహృదయలో! స్వతంత్రలో! ఆత్మవిశ్వాసవతులో! దయానిధులో! జాతీయజీవనమునకు వారే పట్టుగొమ్మలు. వైదుష్యము—విజ్ఞానము—వారియందే నెలకొనియున్నది. "యా శ్రీః స్వయం సుకృతీనాం భవనేషు" (శ్రీమహాలక్ష్మి పుణ్యవంతుల యిండ్లలో నెలకొనియుండును) అను వచనము ఈ దేశమునకే చెల్లును; ఇంక, "పాపాత్మనాం హృదయే హ్యలక్ష్మీః" (పాపాత్ముల హృదయము అభాగ్యదేవతకు వాసస్థానము) అను వచనము మనకు వర్తించును. సమాలోచింపుడు. ఆహా! పరమేశ్వరా!?..అమెరికా స్త్రీలనుజూచి నేను నిశ్చేష్టుఁడనైనాను. "త్వం శ్రీస్త్వమీశ్వరీ త్వం హ్రీః—నీవే శ్రీమహాలక్ష్మివి, నీవె యీశ్వరివి, నీవే లజ్జవు." "యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణసంస్థితా—శక్తిరూపమున నేదేవి సర్వభూతములందును నెలకొనియుండునో"—ఇత్యాది వచనములన్నియు ఈ దేశమునకు వర్తించును. హిమసన్నిభ వినిర్మలమానసలగు మహిళామతల్లులను వేనవేలమందిని నేనిచటఁ గాంచియున్నాను. ఇంక పదునాలుగేండ్లనను నిండకమునుపే పిల్లలతల్లులగు మన బాలికలో! ఆహా! సర్వేశ్వరా! ఏమి యీ దారుణకృత్యము! నా కిపుడంతయు బోధపడుచున్నది. సోదరా! "యత్రనార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః—స్త్రీ లెచట పూజింపఁబడుచుందురో దేవతలచట రమించు

నాయనా! ఈ దారుణమును దలంచినకొలందియు, ముఖ్యముగా మన దేశీయుల దారిద్ర్యమును అజ్ఞత్వమును దలంచినకొలందియు నాకు నిద్రపట్టకుండెను. కన్యాకుమార్యగ్రమున, కుమారీ మాతృదేవి యాలయమున, భారత దేశాంతిమశిలపైఁ గూరుచుండియుండ నాకొక మార్గము తట్టినది. జనులకు వేదాంతము చెప్పుచుఁ, ద్రిమ్మరులమగు సన్న్యాసుల మిందఱము ఉన్నామే—ఇదియంతయు నున్మాదము. "'అన్నమో రామచంద్రా!' యని పలవించు నార్తులకు మతబోధ లెందులకు?" అని మన గురుదేవుఁడు వచింపలేదా? అజ్ఞతవలననే కదా, నిరతురాస్యతవలననే కదా, వారు కేవల పశుప్రాయులై మనుచున్నారు! తరతరములనుండియు మనము వారి రక్తమాంసములను బీల్చి పిప్పి చేసి వారి కుత్తుకలపైఁ గాలిడి త్రొక్కుచున్నాము.

...స్వార్థరహితులు, పరోపకారపరాయణులు నగు సన్న్యాసులు గొందఱు నోటిపాఠముల మూలముననుఁ భూగోళపటములు, చిత్రప్రదర్శకదీపములు, గోళములు మొదలగు సాధనముల మూలముననుఁ విద్యావ్యాప్తి చేయుచు నాచండాలము జనుల స్థితిగతులను జక్కఁజేయ బహు విధములఁ బ్రయత్నించుచు నూరూర సంచరింతురను కొనుము—ఇది సకాలమున లోకకల్యాణము నొనఁగూర్పదా? ఈ యుపాయముల నన్నింటిని ఒక చిన్న లేఖలో వివరింపఁ జాలను. సారాంశమిది: కొండ మహమ్మదుగారివద్దకు రానపుడు మహమ్మదుగారే కొండకుఁ బోవలయునుగదా. పేదలు పాఠశాలలకుఁ బోజాలనంతటి నిరుపేదలై యున్నారు,

మఱియు వారి కావ్యాదులను జదువుటవలనఁ బొందఁదగిన లాభమేమియుఁ గాన్పింపదు. సాంఘికముగా మనము వ్యక్తిత్వమును గోల్పోయియున్నాము; దేశక్షోభ కంతకును ఇదియే కారణము. జనులకు మరల వ్యక్తిత్వమును జేకూర్చి జనసామాన్యమును లేవనెత్తుటయే మనము చేయవలసినపని. హిందువులేమి, మహమ్మదీయులేమి, క్రైస్తవులేమి—ఎల్లరును వారిని దిగఁద్రొక్కినారు. మరల వారి నుద్ధరించునట్టి శక్తి దేశమునుండియే, అనఁగా సనాతన హిందువులనుండియే, వెలువడవలయును. ఏ దేశమునందైనను మతధర్మముల మూలమునఁగాక, వానిని నిరసించుటవలననే కీడు వాటిల్లుచుండును.

ఈ మహాకార్యమును గొనసాగించుటకు మనకు వలయు సాధనములు రెండు—(1) మనుష్యులు, (2) ధనము. గుర్వనుగ్రహమునఁ బ్రతి పట్టణమునను బది పదునైదుగురు ధీరులు దొరకకపోరని నిశ్చయించుకొంటిని. తరువాత వలయు ధనమును సంపాదించుటకై తిరుగాడితిని, కాని హిందూదేశీయులు ఇందులకు ధనము వ్యయింపఁబోరెదరా!!...మూర్తీభవించిన స్వార్థపరత యనఁదగు వారా, డబ్బు ఖర్చుచేయుట! కావున స్వయముగా ధనమార్జించుటకు ఈ దేశమునకు వచ్చినాను, పిమ్మట స్వదేశమునకు మఱలి నా యీ జీవితపరమాశయమును సాధింప నా మిగిలిన యాయువును ధారపోయుదును.

మన దేశము సాంఘిక సుగుణములకుఁ గొఱవడి యున్నట్లే ఈ దేశము పారమార్థిక శీలమునకుఁ గొఱవడి

యున్నది. వీరికి నేను పరమార్థమును దెలుపుచున్నాను, నాకు వీరు ధనమొసంగుచున్నారు. నా గమ్యప్రాప్తి కింకను నా కెంతకాలము పట్టునో తెలియకున్నది...వీరు వంచకులు కారు, అన్యాయ యనునది వీరియందు కానరాదు. హిందూ స్థానమున నే నెవ్వరిమీఁదను నిర్భరపడువాఁడనుగాను. శక్తికొలఁదియు స్వయముగనే వలయు ధనమును సంపాదించి నా కార్యక్రమమును గొనసాగింపఁ బ్రయత్నింతును, లేదా, తత్ప్రయత్నమునఁ బ్రాణములు ధారపోయుదును—"సన్నిమిత్తే వరం త్యాగో వినాశే నియతే సతి"—మరణము ధ్రువమైయుండ సదుద్యమమునకై ప్రాణములు ధారపోయుట మంచిదికాదా?

ఇదియంతయు నేమి భ్రాంతియని బహుశః మీరు అనుకోవచ్చును! నా మనఃపరితాప మెట్టిదో మీకుఁ దెలియకున్నది. నా యుద్యమమును గొనసాగించుటకు మీ రెవ్వరైనఁ దోడ్పడిన సరియే, తోడ్పడరా, గురుదేవుఁడే నాకు దారి చూపును...ఈర్ష్యను విడిచి మనమందఱ మేకీభవింపఁ జాలకున్నాము. ఇది మన జాతీయపాతకము! ఈ దేశమున నీర్ష్య కలికమునకైనను గానరాదు, ఇందువలననే వారింత గొప్పవారైనారు.

మనవంటి కూపస్థమండూకములను లోకమున మఱెచ్చటను నేను గనలేదు. నూతనతత్త్వము అనునది యే దేశమునుండియైనను వెలువడనిండు, అమెరికా దానిని స్వీకరింప ముందంజవేయును. ఇఁక మనమో,—అర్యులమని

విజ్ఞులగు మనవంటి సంకుచితబుద్ధులు లోకమున మఱి లేరు!! ఆ పారంపర్యము. ఆ జాతీయత, ఏ కోశమున నున్నదో నాకుఁ గానరాకున్నది...మనము వీరు ఆర్యసంతతి యఁట!

—సదా మీ వివేకానందుఁడు.

(41)

న్యూయార్క్, 9-4-1894.

స్నేహాస్పద—, ..."కార్యదర్శి సాహెబు" గారు నేను భారతదేశమునకు రావలయుననియు అదియే నా కార్య రంగమనియు వ్రాయుచున్నారు. నిజమే, అందులకు సందియములేదు, కాని నాయనా! భారతదేశ మంతటిని వెల్గొందఁజేయు దివ్యజ్వాలను మనము వెలిఁగింపవలసి యున్నది. అందుచే మనము తొందరపడిన ప్రయోజనము లేదు, భగవదనుగ్రహమున సర్వము సిద్ధించును. అమెరికాలో ననేకమైన పెద్దపెద్ద పట్టణములలో నుపన్యసించి యున్నాను...అనేకులు నాకిచట మిత్రులైనారు, వారిలోఁ గొందఱు విశేషమైన పలుకుబడి గలవారు. మనము క్రైస్తవ మతాచార్యులలో సనాతనులు మాత్రము నాకుఁ బ్రతికూలురై నన్ను గబళించుట సులభసాధ్యముకాదని గ్రహించి, విశ్వ ప్రయత్నము చేయుచున్నారు—ఎందుకు? నాకు ఆటంకములు గల్పించుటకు, నన్ను దూషించుటకు, నాపేరు చెఱచుటకు. నాయనా! విఘ్నములులేనిదే యే సత్కార్యము సాగినది? తుదివఱకును గార్యదీక్షాపరులై యుండువారే విజయము నందఁగలరు. ఒకేజాతియు నొకేవేదమును శాంతి సామరస్య

ములును నెపుడు వెలయునో అపుడు సత్యయుగము వెలయునని నా నమ్మకము. ఈ సత్యయుగాశయమే భారతదేశమును బునరుజ్జీవింపఁజేయఁగలదు. నమ్ముఁడు, నామాట...

వత్సలారా! లెండు, ఈ యుద్యమమునకు బుజము లొడ్డుఁడు!...జయ! సనాతనధర్మమునకు జయ! వత్సలారా! లెండు, లెండు! మనము జయించి తీరుదుము.

...మన మండలము కార్యాంగణమున నడుగిడినంతనే విజయోత్సవసూచకమగు "కోలాహలము" ఉదయింపవలయును—కాని కృషిచేయనిదే మాటాడనొల్లను...ఆశీస్సులు. —సదా మీ వివేకానందుఁడు.

(42)

చికాగో, 28-6-1894.

స్నేహాస్పద—, న్యూయార్కునుండి బోస్టనునకును, బోస్టనునుండి న్యూయార్కునకును దిరుగుచుండుటచే వెంటనే మీకు వ్రాయఁజాలనైతిని. భారతదేశమున కెపుడు మరలుదునో నాకే తెలియకున్నది. నా కాధారభూతుఁడై నన్ను నడుపుచున్నయల పరమేశ్వరుఁడే సర్వము నిర్ణయించుఁగాక! నేను లేనని భావించి, నన్ను విడిచిపెట్టి, మీయంతట మీరే కృషి సాగింపఁ బూనుఁడు. "అయ్య వచ్చువఱకును అమావాస్య ఆఁగదు"—దేనికోసము, ఎవ్వరికోసమును నిరీక్షింపకుఁడు.

...ఇంతలో మీరొక సంఘముగా నేర్పడి మన కార్యక్రమమును నడపఁ బ్రయత్నింపుఁడు. సమస్తము మనకు

సాధ్యమని నమ్ముఁడు. పరమేశ్వరుఁడు మనకుఁ బ్రాప్తి యున్నాఁడని గ్రహింపుఁడు, కావున ధీరులారా! అగ్రసరులు కండు!

మాతృదేశమున వలసినన్ని పొగడ్తలను బొందితిమి. ఒకరు మిమ్ముఁబొగడినను బొగడకున్నను దదేక దీక్షతోఁ బనిచేయుఁడు. వెనుకంజవేయకుఁడు. మన కార్యక్రమ మున లేశమును ఇంకను గొనసాగలేదని మీరు గుర్తింప వలసియున్నది.

విద్యార్థులగు యువకులను వశమొనర్చుకొనుఁడు, వారి నేకీభవింపఁజేసి యొక సంఘమును నెలకొల్పుఁడు. మహాత్యాగమువలననే కాని మహాకార్యములు సిద్ధింపవు. స్వార్థపరత్వము అణుమాత్రమును గూడదు, మీవగుఁగాక, నావగుఁగాక, తుదకు నా గురుదేవునివే యగుఁగాక,— పేరుప్రతిష్ఠల నిమిత్తము మనము ప్రాఁకులాడరాదు. వత్స లారా! ధీరోదారులారా! సహృదయులారా! ఉజ్జ్వలకీర్తా దత్తులు కండు, ఆశయ సాఫల్యమునకుఁగాను కృషి చేయుఁడు, కార్యక్రమమును గొనసాగింపుఁడు! పేరు ప్రతి ష్ఠలనుగాని, మఱియే మూర్ఖతనుగాని యోచింపకుఁడు. స్వార్థమును బాఱఁద్రోలి కార్యాంగణమున నుఱుకుఁడు! గడ్డి పోఁచలను పేని పెంటిగాఁ జేసినచో వానితో మదించిన యేనుఁగును బంధింపవచ్చునని జ్ఞప్తిలో నుంచుకొనుఁడు. సర్వేశ్వరుఁడు మిమ్మందఱ ననుగ్రహించుఁగాక! సర్వేశ్వర శక్తి మీ యందఱియందును వెల్గొందుఁగాక!— వెల్గొందు

చున్నదని యే నా నమ్మకము. "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరాన్నిబోధత!" (కఠోపనిషత్తు)—లెండు, మేల్కొనుడు, పరమపదప్రాప్తి పర్యంతము ఆఁగవలదు అని వేదము ఉద్ఘోషించుచున్నవి. లెండు, లెండు! దీర్ఘనిశీథము పటాపంచలగుచున్నది, ప్రభాతము సమీపించుచున్నది, ఉత్సాహతరంగము బయల్వెడలినది, తత్ప్రభావమును నెవ్వరరికట్టఁజాలరు. ధైర్యసాహసములు, వత్సలారా! ధైర్యసాహసములు! ప్రేమ, నాయనలారా! విశ్వమానవప్రేమ; విశ్వాసము— ఆత్మవిశ్వాసము; ఇఁక భయములేదు! భయమే మహాపాతకము!

ఎల్లరకును నా యాశీర్వచనములు. మన యుద్యమమునఁ దోడ్పడిన యచటి యుదారహృదయులందఱకును నా శాశ్వత ప్రేమకృతజ్ఞతలను దెలియఁజేయుఁడు. కాని, దీక్ష విడువవలదని వారికి నా ప్రార్థన. మన యాశయములను దశదిశలను వ్యాప్తిచేయుఁడు. అహంభావము నొందకుఁడు. హేతురహితమగు నే యాచారములను పాలాయింపకుఁడు, దేనిని నిరసింపకుఁడు— రసాయనముల నొండొంటితోఁ జేర్చుటయే మన పని, స్ఫటిక మెప్పుడెట్లు తేర్పడునో పరమాత్మున కెఱుక. అన్నిటికంటెను నా విజయమును గూర్చిగాని, మీ విజయమునుగూర్చిగాని గర్వింపకుఁడు. ఘనకార్యములు జరుగవలసియున్నవి. భావిభాగ్యోదయముతోఁ బోల్చిచూచినచో నీ యల్పవిజయము ఏపాటిది? నమ్ముఁడు, నామాట—భారతదేశము ఉద్ధారణ నొందితీరును, జనసామాన్యమును బేదలును సుఖవంతులొనర్పఁ

బడి తీరెదరు—ఇది విధాయకము, ఈశ్వరాజ్ఞ ఆసంధిం పుడు...ఆధ్యాత్మిక వాహిని బయల్వెడలినది. అపారము, అప్రతిహతము, సర్వప్లావనమునై యీదివ్యవాహిని మాతృ భూమిపైఁ బ్రవహించుట నాకుఁ బ్రత్యక్షమై భాసించు చున్నది. ప్రతివ్యక్తియు ముందునకేగఁ బ్రతిశక్తియుఁ దత్ప్రతి భావము నుద్దీప్తమొనర్పఁ బ్రతిమానవుఁడును దన్మార్గమును రాజమార్గ మొనర్పంగ దోడ్పడును! జయ పరమేశ్వరా!...

నాకు సహాయమును అక్కఱలేదు. కొంత మూల ధనమును కూర్పఁ బ్రయత్నించి, కొన్ని చిత్రప్రదర్శక దీపములను భూగోళములను పటములను గొన్నిరసాయనము లను—ఇట్టి వానిని సంపాదింపుఁడు. ప్రతి సాయంకాలమును బేదలను నిమ్నజాతివారిని మాలమాదిగలను బ్రోగుచేసికొని దేశభాషలో వారికి మొదట మతధర్మములనుగూర్చి యుప న్యసింపుఁడు, తరువాత చిత్రప్రదర్శక దీపాదులమూలమున భూగోళశాస్త్రము, ఖగోళశాస్త్రము మొదలగు వానిని బోధింపుఁడు, కార్యపరాయణులగు యువకులను గొందఱను సుశిక్షితుల నొనర్పుఁడు, మీ ధైర్యోత్సాహములను వారి కలవడఁ జేయుఁడు, క్రమముగా ఆయువజన సమాజమును అభివృద్ధిచేయుఁడు. ఈ కార్యార్థము మీ యావచ్ఛక్తిని ఇపుడు వినియోగింపుఁడు. ఈతరుణమును దాఁటనీయకుఁడు. పత్రికాప్రకటనాదులు మంచివే, సందేహము లేదు, కాని నాయనలారా! నిజమైనకృషి లవలేశమైనను ఊరక నేమి యో గిలుకుచుఁ గూర్చుండుటకంటె మంచిది కాదా?...సభ జరిపి, కొంతధనము వసూలుచేసి, నేను దెలిపిన పరికరము

లను గొనుఁడు. ఒక కుటీరము నద్దెకుఁ దీసికొని యుద్యమ మారంభింపుఁడు. పత్రికలు ప్రకటించుట తరువాతి సంగతి, కాని యిది ప్రధానము. జనసామాన్యమును మీరు వశ మొనర్చుకొనవలయును, భయపడకుఁడు. "అల్పారంభం గరీయసీ" యనునటుల అల్పారంభములే మహాకార్యములుగాఁ బరిణమించును. ధైర్యముఁ బూనుఁడు. మీ సోదరులపైఁ బెత్తనము వహింపఁ బ్రయత్నింపక వారిని సేవింపఁ బూనుఁడు. పెత్తనము వహింపవలయునను వెఱ్ఱియే అనేక సమాజములను నశింపఁజేసినది. ముఖ్యముగా నీ విషయమున శ్రద్ధవహింపుఁడు; ప్రాణముపైనను ధారపోయుటకు వెనుదీయక స్వార్థరహితులై కృషిచేయుఁడు, నాహృదయమున నున్నదంతయు వ్రాయఁజాలకున్నాను, వత్సలారా! ధీరులారా! భగవంతుఁడే సర్వము మీకు గలుగఁజేయుఁగాక! వత్సలారా! ప్రచండదీక్షఁ బూనుఁడు! జయ! పరమేశ్వర!— ఆప్తుఁడు,

—వివేకానందుఁడు.

(43)

చికాగో, 20-6-1894.

దివాన్ మహాశయా—నాయందు విశేషదయతో మీరు వ్రాసిన లేఖ నేఁ డందినది. నాదుడుకు మాటలచేఁ, గఠిన వాక్కులచే, మీవంటి యుదారహృదయునకు బాధ కలిగించినందులకుఁ జాలవిచారించుచున్నాను. ప్రేమపూర్వకములగు మీ సవరణలను శిరసావహించెదను. "పుత్రస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్"—వినతుఁడనగు నన్ను మీ

పుత్రునిగా భావించి నాకు బోధింపుఁడు. కాని దివాన్ జీ, నాప్రేమయే నన్నిట్లు పలుకఁ బురికొల్పినదని మీకు బాగుగాఁ దెలియును. మన హిందువులు తమకు నేను ప్రతినిధిగా వచ్చియున్నానని యమెరికా జనులకుఁ బ్రకటింపఁ బెదవి నైనను మెదపని కారణమున నిచ్చటి 'పాదిరీలు' నాకుఁ బరోక్షముగా హాని కలిగించినవారని చెప్పవలసియున్నది. మనవారు నేను దమ ప్రతినిధనని తెలుపుడు నాయందు అమెరికాజనులు చూపినదయకుఁగాను వారి నభినందించుచు నాలుగుముక్కలు వ్రాసిన పాపమునఁ బోయిరా? అమెరికా యందే నే నీ 'కపట సన్న్యాసివేషము' వేసితిననియు నేను వట్టి మాయలమారిననియు నాకెవ్వరును ఆతిథ్యమీయరా దనియు...అమెరికాజనులతోఁ జెప్పుచున్నారు. అమెరికా జను లీ యపవాదములను పాటింపరు, నా యుద్యమమునకుఁ గాను వారు చేయు ధనసాహాయ్యమునట్ల మాత్రము వారి చేయూఁతను నిరమింపఁజేయుటలో ఈ దుష్ప్రచారము ఘోరముగాఁ బనిచేయుచున్నది. నేనిచటికి వచ్చి యొక సంవత్సరమైనను భారతదేశమునుండి పేరుప్రతిష్ఠలుగల వ్యక్తి యొక్కఁడైనను నేను "వంచకుఁడను" గానని యమెరికా జనులకుఁ దెలుపు టుచితమని తలఁపఁడయ్యె. ఇంకఁ గ్రైస్తవప్రచారకులు నామీఁద నిందలుమోపుటకుఁ దడవు లాడుచు—వారి కెంతిసేపు ఇదియే గొడవ—హిందూదేశపుఁ గ్రైస్తవపత్రికలు నాకుఁ బ్రతికూలముగా నేమేమి వ్రాసినను వానిని బ్రకటించుచుఁ బెద్దగందరగోళము చేయుచున్నారు. హిందూదేశమునందలి క్రైస్తవాభిప్రాయమున

కును భారతీయాభిప్రాయమునకునుగల భేదము ఇచటి జను లకుఁ దెలియనే తెలియదని మీరు గ్రహింపవలసియున్నది.

నా యుద్యమనిర్వహణమునకు ధనము సంపాదించు నుద్దేశము నేనిచటికి వచ్చుటకు ముఖ్యకారణము. ఆకథను మీకు వివరించెదను.

ప్రాక్పశ్చిమదేశములకుఁ గల భేదమంతయు నిది: పశ్చిమదేశములు జాతీయాశయములు గల సంఘములు, మనము కాము, అనఁగా నాగరికతయు విద్యయు నిచట సర్వ జన సాధారణములు, జనసామాన్యమున నివి ప్రవేశమంది నవి; హిందూదేశమునను అమెరికాదేశమునను అగ్ర జాతులు సమానమే కాని రెండిటియందలి నిమ్నజాతులకును గలభేదము హస్తిమశకాంతరము. ఆంగ్లేయులు హిందూ దేశము నంత సులభముగా జయించుటకుఁ గల కారణమేమి? వారొక సంఘమైయుండుటయు మనము కాకుండుటయునే. మనదేశములోని ఘనులలో నొకఁడు గతించిన మఱి యొకఁడు లభించుటకు మనము శతాబ్దములపర్యంతము కని పెట్టుకొని యుండవలయును—ఆంగ్లేయసంఘమో, తన యందు ఘనులగువారు గతించియు గతింపకమునుపే యిత రుల నట్టివారిని వెలువరించును. మన దివాన్ మహా శయుఁడు గతించుచో, (దేశక్షేమార్థము భగవానుఁ డిందుకు చిరకాల విలంబము చేయుఁగాక !) ఆయనస్థాన మును బూర్తిచేయు టెంతకష్టమో మనసంఘమునకు వెంటనే గోచరించును—రాష్ట్రము మీసేవలను విడనాడఁ

జాలకుండు టెందువలననో విదితమేకదా! మన దేశమున నిట్లు ఘనులగువారు కొఱవడియుండుటకుఁ గారణమేమి? ఎప్పటికప్పుడు ఘనులను జేకూర్చుకొనుటకు ఆంగ్లేయులు మున్నగు వారికి విశేషావకాశముండుటయు మనకు లేకుండుటయు నే. ఏ మూఁడు నాలుగు, లేదా, ఆఱుకోట్ల జనాభానో కలిగి యున్న సంఘములతోఁ బోల్చి చూచినచో, ముప్పదికోట్ల జనాభాగల (మన) సంఘము ఎప్పటికప్పుడు ఘనులను సమకూర్చుకొనఁ జాలకున్నది. దేశమున వలసినంతమంది విద్యావంతులగు స్త్రీపురుషులు లేకుండుటయే యిందులకు హేతువని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. మిత్రమా, దయ యుంచి నా మాటల నపార్థము చేసికొనకుఁడు; మన సంఘము నందలి మహాలోపమిది, దీనిని మనము తొలఁగించుకో వలయును. జాతీయభావముగల సంఘము నిర్మింపఁబడ వలయునన్నచో, విద్యగఱపి జనసామాన్యమును లేవనెత్త వలయును. పుం జీచట నున్నగో మన సంఘసంస్కర్తలు చూడరు, విధవావివాహముల మూలమున వారు మన సంఘము నుద్ధరింపఁదలఁతురు — సంఘసముద్ధరణము విధవలకు లభింపఁగల భర్తలసంఖ్యపై నాధారపడియుండు ననియా మీ యభిప్రాయము? దోషము మన సనాతనధర్మమునకును అంటఁగట్టఁదగదు, ఏమందురా, ఒక విగ్రహా మిక్కడైనను దక్కడైనను దుదకొక్కటియే. ఉన్నదోషమంతయు, లోపమంతయు, నిది: కుటీరమున నివసించు నిజమైన సంఘము తన మానవత్వమును వ్యక్తిత్వమును గోల్పోయినది, మఱచిపోయినది. ఏ హిందువులో, తురకలో,

క్రైస్తవులో, కాలిక్రిందవైచి త్రొక్కివేయుచుండ, చేతఁబడికాసులున్న ప్రతివ్యక్తిచేతను దాను త్రొక్కఁబడుటకే పుట్టితినని తలఁచునట్టి దుఃస్థితికి దిగినది మనసంఘము. పేదలు కోల్పోయిన వ్యక్తిత్వమును దిరిగి వారి కొసఁగవలయును. వారిని విద్యావంతులను గావింపవలయును. విగ్రహములు నిలుచునా నిలువవా, విధవలకు వలసినంతమంది భర్తలు దొరకుదురా దొరకరా, వర్ణవ్యవస్థ మంచిదా చెడ్డదా—యనునిట్టి సమస్యలను గూర్చి నాకేల లేనిపోని తాపత్రయము? ప్రతివ్యక్తియుఁ దనమోక్షమును—తరణోపాయమును—దానే సాధింపవలసియున్నది. రసాయనముల నొండొంటితోఁ జేర్చునంతవఱకే మనపని, స్ఫటికీకరణము దైవనియమములననుసరించి జరుగును. జనులకు మన ముత్తమాశయములను గలుగఁజేయుదము, మిగిలినదంతయు వారు చేయవలసినపనియే. అనఁగా జనసామాన్యమునకు మనమిప్పుడు విద్యగఱపవలసియున్నది. ఇందలి చిక్కులివి: దరిద్రప్రభుత్వమేమియుఁ జేయఁజాలదు, చేయదు. కావున ఆవైపు నుండి సాయము లభించుననుకొనుట కలలోని వార్త.

ఒకవేళ నూరూరను ఉచితపాఠశాలలను నెలకొల్పఁగలమనుకొన్నను జీవనోపాధికై పేదబాలుడు మీ బడికి వచ్చి బలపము చేపట్టుటకంటె (మడికి వెడలి) అరకను చేపట్టుటయే మేలుగా నెంతురు. మనకుఁ దగినంతధనమూ, లేదు; పిల్లలను బడికి రావించు సామర్థ్యమూ, అంతకు ముందే లేదు. ఇది మహావిషమ సమస్య; నాకుఁ దోఁచిన యుపాయమిది. కొండ మహమ్మదుగారివద్దకు రానిచో,

మహాత్ముడుగారే కొండకుఁ బోవలయును. పేదలు విద్యనార్జించుటకు రాఁజాలనిచో, నాగలివద్దను కర్మాగారమునందును, వేరేల? ప్రతిచోటను స్వయముగా విద్యయే పేదలను చేరవలయును. మార్గము? నా సోదరులను (అనగా సోదరసన్న్యాసులను) మీరు చూచియున్నారుకదా. ఇప్పుడట్టి స్వార్థరహితులు, యోగ్యులు, విద్యావంతులును వందలకొలఁదిమంది నాకు లభింపఁగలరు. ప్రతివ్యక్తిపాదములకడకును ధర్మమునే కాక, విద్యను గొనివచ్చుచు వీరు ఊరూర సంచరింతురుగాక. ఇట్లే మన స్త్రీలకు వితంతువులను విద్యాబోధకురాండ్రుగ నేర్పఱచు కార్యక్రమము బీజావస్థయందున్నది.

తమ పనులైన వెనుక జానపదులు ఊరిలోనే చెట్టు క్రిందనో కూరుచుండి, చుట్ట కాల్చుకొనుచు లోకాభిరామాయణము చెప్పుకొనుచున్నారనుకొనుడు. విద్యావంతులగు మన సన్న్యాసు లిరువురు వారిని గలిసికొని, చిత్రప్రదర్శక దీపముతో ఖగోళచిత్రములను వివిధజాతీయ దృశ్యములను చారిత్రక పటములను ఇత్యాదులను బ్రదర్శింతురనుకొనుడు. దివాన్‌జీ! తన్మూలమున నెంతపని చేయవచ్చునో యూహింపుఁడు. జ్ఞానేంద్రియము — జ్ఞానద్వారము — కన్ను ఒక్కటియేనా? చెవిమూలమునఁగూడ జ్ఞానము సంపాదింపవచ్చునుగదా. ఈ రీతిని వారు సదాశయములను ధర్మములను అవలంబించి బాగుపడుట కెంతేని యవకాశము గలదు. మన కర్తవ్యము అంతటితో సరి, మిగిలినది వారి పని. సన్న్యాసుల నీ త్యాగమునర్పు—నీ మహాకార్యమును

నిర్వహింపఁ—బురికొల్పునదేమి? ధార్మికోత్సాహము. ప్రతినూతన ధార్మికసంచలనమునకును నూతన గమ్యము—నూతనాశయము—ఒకటి యుండుట యావశ్యకము. నూతనాశయమువలననే ప్రాచీనధర్మము సముద్ధరింపఁబడఁగలదు....దివ్యశీలము—దివ్యవర్తనము-అపారస్ఫూర్తి—త్రోవచూపవలయును: ఇట్టి వ్యక్తులును సాధనసంపదయు స్వీయముగనే వానిని జుట్టువారును. తదీయదివ్య ప్రభావమపుడు మహోత్తుంగతరంగమై సంఘమునఁ బ్రసరించి సర్వమును దనతోఁ గొనిపోవును, సమస్తమాలిన్యమును గడిగివేయును. పీఁచు లేఁగకుండ నైపునుండియో కత్తును సులభముగాఁ గోయఁగలుగు రీతిని నేఁటి వెఱ్ఱిమొఱ్ఱి సంస్కరణోద్యమములమూలముగాఁగాక సనాతనధర్మమూలముననే మన ప్రాచీన మతమును సంస్కరింపఁగలము. అదిగాక సంస్కర్తలగువారు ప్రాక్పశ్చిమ విజ్ఞాన సమన్వయస్థానీయులు కాఁగలిగియుండవలయును. ఇట్టి మహోద్యమ ప్రభాతము మీకు గోచరించుట లేదా? దేశమును ముంచియెత్తఁబోవు పారమార్థికమహోత్తుంగతరంగఘోష మీకు వినవచ్చుట లేదా? ఆ యాదర్శమూర్తి—ఆ మహానాయకుఁడు—ఆ యవతారమూర్తి—భారతదేశమునఁ బ్రాదుర్భవించెను. అతఁడే శ్రీరామకృష్ణ పరమహంస—ఈ యువజనబృందము మెల్లమెల్లఁగాఁ దత్కేంద్రమును జుట్టువారుచున్నది. వీరే యీ యుద్యమమును నిర్వహింతురు. దివాన్ జీ మహాశయా! ఇపుడిందుల కొక సంస్థ కావలసియున్నది, ధనము కావలసియున్నది—ఈ యంత్రమును నడపుట కధమము

కొంచెమైనను గావలసియున్నది. హిందూదేశమున మాకు ధనమొసఁగియుండెడి వారెవరు?... దివాన్ జీ మహాశయా! అందువలన నేను సముద్రమును దాఁటి యమెరికా చేరినాను. (యాత్రికు వలెయు) ధనసుంతియుఁ బేదలకడనే యాచించితి నని మీకు జ్ఞప్తికొనుండవచ్చును. పేదలనేల యాచింప వలెయు నందురా, ధనికులు నా యాశయములను గ్రహింపఁ జాలకుండుటచే వారివద్ద నేను చేయిచాపఁ దలచుకోలేను. ఈ దేశమున నొకసంవత్సరముపాటు ఉపన్యసించినాను కాని కార్యసాఫల్యము నొందనైతిని. కాని స్వయముగా నాకే కొఱంతయు లేదు, ఐనను నా యుద్యమమునకుఁ బునాదులను నిర్మించుటకై కొంత మూలధనము కావలసియున్నదికదా. మఱియొక విషయము: అమెరికాలో ఈ సంవత్సరమంతో యననుకూలమైనది. వారిలో వేలకొలఁది మంది పేదలకుఁ బనివొసఁగుట లేదు. క్రైస్తవప్రచారకులును... నాయాశయముల నన్నిటిని దాఱుమాఱు చేయఁ జూచుచుండుట మఱియొక సంగతి. (నే నిచటికి వచ్చి) యొక సంవత్సరము దాఁటినను మనవారు నేను 'దగాకోరు'ను గాననియు నిజమైన సన్న్యాసి నేయనియుఁ దమమత ప్రతినిధిననియు నమెరికాజనులకుఁ జెప్పినపాపమునఁ బోరైరి. ఈ మాత్రము—నాలుగు మాటలవ్యయము—వారు చేయఁజాలకున్నారు!! సెబాసు! నా దేశీయులారా!! దివాన్ జీ! వారిని నేను ప్రేమింపకపోను. ఛీ! మానవసాహాయ్యమున నే పాటిది? కొండలలో, కనుమలలో, అడవులలో, ఎడారులలో నేను సంచరించునపుడెవ్వఁడు నాదండనుండెనో ఆ పరమేశ్వరుఁడే

యిపుడును నాకుఁ బ్రాప్తించినదని నాయాశ; లేదా, నాకంటె విశేషసమర్థుఁడగు నేధీరాత్ముఁడో భారతదేశమున నుదయించి యీ మహాకార్యమును గొనసాగింపును. కావున విషయము వెల్లడించినాను. దివాన్ జీ! నాయెడ నిజమైన సానుభూతిగల—దయగల—కొలఁదిమందిలో నొకరగు నుదారహృదయా! నెచ్చెలీ! ఇంతిదుడిగము వ్రాసినందులకు క్షమింపుఁడు. నన్ను మనోరాజ్యగతునిగా భావించిన భావింతురుగాక, కాని మిత్రమా! నేను కడుపులో నొకటి పెట్టుకొని పైకి మఱియొకటి చెప్పువాఁడను గానని, మాతృదేశమును మితిమీఱి ప్రేమించుటగాక నాగొప్ప తప్పిదమని, నమ్ముఁడు. సహృదయా! నెచ్చెలీ! భగవానుఁడు మిమ్మును భవదీయులను మీప్రేమపాత్రులను ఎల్లరను సదా, సర్వదా రక్షించుఁగాక! మీయెడ శాశ్వతముగాఁ గృతజ్ఞుఁడను. మీరు నామిత్రులగుటవలననే కాక, యావజ్జీవమును భగవద్భక్తులై యుండుటచే, అఖండ దేశసేవకులై యుండుటచే, మీకు నాఋణ మనంతము—సదా కృతజ్ఞతాబద్ధుఁడు,

—వివేకానందుఁడు.

(44)

## శ్రీ శ్రీ మైసూరు మహారాజుగారికి

చికాగో. 23-6-1894.

మహారాజా—మిమ్ములను భవదీయులను శ్రీనారాయణుఁడనుగ్రహించుఁగాక! దయతోఁ దామొనర్చిన సాయము వలననే నీదేశమునకు రాఁగలిగినాను. నాఁటినుండియు

నిచటఁ బలువురకుఁ దెలిసినవాఁడనైతిని: పరులనాదరించు
నీ దేశీయులు నా కేమికావలసినదియైనను సమకూర్చి
యున్నారు. ఇది యద్భుతమైన దేశము, మఱియు బహు
విషయములలో నద్భుతమైన సంఘము. నిత్యకృత్యములలో
ఈ దేశీయులుపయోగించునంతటి యంత్రబలము లోకమున
మఱి యే దేశీయులు నుపయోగింపరు. అంతయు నిచట
యంత్రమయము. ప్రపంచమందలి జనాభాలో వీరు కేవ
లము పదునాఱవవంతు. ఐనను ప్రపంచసంపదయందు
ఆఱవవంతునకు వీ రధిపులు. వీరి భోగభాగ్యములకుఁ
బరిమితి లేదు. ఐన నిచటఁ బ్రతివస్తువును అపారమైన వెల
గలిగియుండును. కార్మికుల కిచ్చు జీత మిచటనుండునంత
హెచ్చుగా లోకమున మఱెచ్చటను నుండదు, ఐనను
గార్మికులకును ధనికులకును నడుమ సదా పోరు సాగుచునే
యుండును.

అమెరికా స్త్రీలకుఁగల హక్కులు ప్రపంచమున మఱి
యేయితర స్త్రీలకును లేవని చెప్పవచ్చును. వారు సర్వము
మెల్లఁగాఁ గైవసమొనర్చుకొనుచున్నారు. మఱియు, విచి
త్రము, విద్యయు సభ్యతయుఁగల స్త్రీలు పురుషులను మించి
యున్నారు. కాని ప్రతినిధులు విశేషముగాఁ బురుషుల
యందే కలరనుటకు సందియము లేదు. మన వర్ణవ్యవస్థను
పాశ్చాత్యులు నిందింతురు గాని దానిని మించినది—డబ్బు
నాశ్రయించుకొనియుండు వర్ణవ్యవస్థ— వారిలోనున్నది.
అమెరికా దేశీయు లనునట్లు 'డాలరు దేవుఁడు' (డాలరు అను
నది యించుమించు రెండున్నర రూపాయిలకు సమమైన

యమెరికా దేశపు నాణెము) ఇచటఁ జేయఁజాలని దేదియు లేదు.

ఈ దేశములోనున్నన్ని శాసనములు మఱియే దేశమునను లేవు. మఱియు లోకమున మఱెవ్వరును వాని నీ దేశీయులు చేయునంతటి యలక్ష్యము చేయరు. మొత్తము మీఁద మన పేదహిందువులే పాశ్చాత్యదేశీయు లందఱి కంటెను కోటిరెట్లు విశేషపారమార్థికశీలురు. మతధర్మముల పట్ల వారు మోసమును లేదా, మూర్ఖాభిమానము నవలంబింతురు. సమాలోచనపరులు మూఢవిశ్వాసయుతములగు తమ మతములనిన విసువుచెంది నూతనవిజ్ఞానమును భారతదేశముదెసఁ జూచుచున్నారు. నవీన భౌతికశాస్త్రముల దాడి నెదిర్చి నిలువఁగలిగిన మన పవిత్రవేదములందలి ప్రతి దివ్యాశయము నెంతటి తమకముతో—నక్కఱతో— పాశ్చాత్యులు స్వీకరించుచున్నారో వచ్చి చూచినచో మీకుఁ దెలియఁగలదు. శూన్యమునుండి సృష్టి బయలుదేఱినదను రిక్తవాదము—ఆత్మ సృజింపఁబడినదను కల్పితసిద్ధాంతము—స్వర్గము (Heaven) అను నొకానొక తావున సింహాసనారూఢుఁడై దేవుఁడను నొక మహాచండశాసనుఁడు గలఁడను మూఢసిద్ధాంతము—శాశ్వత ఘోరనరకములు గలవను పిడివాదము—నివన్నియు విద్యావంతులకు విసుగుఁ బుట్టించినవి; సృష్టియు నాత్మయు శాశ్వతమనియు —దేవుఁడు మన యంతరాత్మయే యనియుఁ బ్రకటించు నుత్కృష్టవైదికభావముల నేదియో యొకరూపమున వారందఱును త్వరితగతి నవలంబించుచున్నారు. అర్ధశతాబ్దము

లోపలనే ప్రపంచమునందలి విద్యాధికులు మన పావన వేదములలోఁ దెలుపఁబడినట్టి సృష్టియు నాత్మయు శాశ్వతములనియు మహోన్నతము, పరిపూర్ణమునగు మన యాత్మయే భగవంతుఁడనియు నమ్మఁగలరు. వారి మహాచార్యులలోఁ ప్రాజ్ఞులగువారిప్పుడే బైబిలు నీ విధముగా వ్యాఖ్యానించుచున్నారు. వేరేల, పాశ్చాత్యులకు విశేషముగా ధార్మికనాగరికతయు మనకు విశేషముగా సాంఘికనాగరికతయు నావశ్యకమైయున్నవని నా యభిప్రాయము.

పేదలదుఃస్థితియే హిందూదేశమునందలి చిక్కులకన్నింటికిని బుట్టినిల్లు. పశ్చిమఖండమునందలి పేదలు కేవల రాక్షసులు; వారితోఁ బోల్చిచూచినచో, మనవారు దేవతలని చెప్పవచ్చును, అందుచే మన పేదలను లేవనెత్తుట యంతకష్టసాధ్యమైన పని కాదు. విద్య నేర్పుట, వారు కోల్పోయిన వ్యక్తిత్వమును వెలుపఁజేయుట—ఇదియే పేదలకు మనము చేయవలసిన సేవ. దేశీయప్రభువులు జనసామాన్యము నుద్ధరించుటకుఁగాను జేయవలయు మహాకార్యమిది. ఇంతవఱకు నీ విషయమునఁ గలుగఁజేసికొనినవారెవ్వరును లేరైరి. మహాచార్యుల నిరంకుశాధికారముచే నేమి, విదేశీయులవలని దోపిడిచే నేమి, యనేక శతాబ్దములనుండియు జనసామాన్యము అధఃపతితమైయున్నది. తుదకుఁ దాము మానవులమను సంగతినే మఱచిపోయినారు మన పేదలు. వారికి మనము సదాశయములను దెలుపవలసియున్నది ; తమచుట్టును లోకమున నేమి జరుగుచున్నదో కన్నులు విప్పి చూపవలసియున్నది. అప్పుడు స్వయముగనే

వారు తమ విమోచనమును సాధించుకొనఁగలరు. ప్రతి జాతియుఁ బ్రతిపురుషుఁడును బ్రతిస్త్రీయును దన విమోచనమును దానే సాధించుకొనవలయును. జనులకు సదాశయములను దెలుపుఁడు—వారికి వలయు సాయ మిదియే, మిగిలిన దంతయుఁ దన్మూలముననే జరిగితీరును. రసాయనముల నొండొంటితోఁ జేర్చుటయే మనపని, ప్రకృతినియమముల ననుసరించి స్వయముగనే స్ఫటికము లేర్పడును. జనుల కాశయములను గలుగఁజేయునంతవఱకే మన కర్తవ్యము, మిగిలిన పనియంతయు వారిదే. ఇదియే భారతదేశమున మనము చేయవలయు కార్యము. చిరకాలమునుండి నా హృదయమునఁగల యాశయమిది. హిందూదేశమున దీనిని నెఱవేర్పఁజాలక యీ దేశమునకు వచ్చినాను. పేదలకు విద్య నేర్పుటయం దొక గొప్ప చిక్కు గలదు, అదియిది: ఊరూరను మీ రుచితపాఠశాలలను నెలకొల్పుదు రను కొందము, ఐనను దానివలన గలుగు లాభము కానఁబడదు. ఏలన పేదబాలురు బడికి వచ్చుటకంటె మడికి వెళ్లి తమ తలిదండ్రులకు సాయముచేసియో, మఱి యేరీతిగనో జీవనోపాధి నార్జించుకొనఁ జూతురు—భారతదేశ దారిద్ర్యమట్లున్నది...పేదబాలుఁడు బడికి వచ్చి విద్య నేర్వఁజాలని స్థితిలో నున్నప్పుడు విద్యయే వానికడకుఁ బోవలయును. * ...స్వదేశమునఁ దోడ్పాటునకై ప్రయత్నించి ఫలముగానక ప్రభువారి సాయమున నీ దేశమునకు వచ్చినాను. హిందూదేశమందలి పేదలు చనిపోయినను బ్రదికియున్నను అమె

* పాఠకులు 42-వ లేఖను జూడఁ బ్రార్థితులు.

రికాజనుల కొక్కటియే. మనవారే మెంతసేపు స్వార్థ చింతలో మునింగి తేలుచుండ, "కండకు లేని దురద బచ్చలికా?" యనునట్లు అమెరికా జనులకేమి కావలయును?

మహారాజా! ఉదారహృదయా! ఈ జీవితము మూఁడునాళ్ల ముచ్చట, భోగములు బుద్బుదప్రాయములు. ఎవ్వరు పరార్థజీవులో వారే సజీవులు, మిగిలిన వారందరును జీవన్మృతులు. మీవంటి భారతమాతృపుత్రుఁడు, ఉదారచరిత్రుఁడు, భారతదేశమును బునరుద్ధరింప నెంచితేని తోడ్పడఁగల్గును, తన నామము నాచంద్రార్కస్థితి మొనర్చుకొని పూజనీయుఁడు కాఁగల్గును. అజ్ఞాననిమగ్నమై కుందుచున్న భారతదీనజనకోటియందు భగవానుఁడు మిమ్ము అఖండసానుభూతి వహింపఁజేయుఁగాతమని ప్రార్థించు,

—వివేకానందుఁడు.

(45)

## చెన్ననగరమందలి యొక శిష్యునకు

చికాగో, 29-6-1894.

మొత్తముమీఁద హిందువులకంటె నమెరికా జనులు కోటి రెట్లుదారులు; కృతఘ్నులతోఁ, నిర్దయాత్ములతోఁ గూడిన దేశమునకంటె నిచటనే నే నెక్కువగా జనహిత కార్యములు చేయఁగలను...చెన్ననగర పౌరులు నా యర్హతను దమశక్తినిగూడ మించి నాకు సాయముచేసియున్నారు.

ఏ యాశయమునైనను గొనసాగించుటకు అమెరికా యుత్తమ రంగము, కావున నేనింతలో అమెరికాను విడిచి రాఁజాలను. ఏల? ఇచట నాకు అన్నపానాదులకు ఏవిధమైన లోపమును లేకుండఁ బ్రతివ్యక్తియు నాయెడ దయాసమగ్రమైయుండ, (అంతయు నాలుగు మంచిమాటలకే సుమీ!!) నే నెందులకు రావలయును? కనికరమన్నది— దయాదాక్షిణ్యములనునవి—యెఱుఁగని, మూఢవిశ్వాసములకు శాశ్వతదాసులై, పరమమూర్ఖులై, కృతఘ్నులై, పశుప్రాయులై, నిర్భాగ్యులైమనుచున్న వారల దేశమునకే యుదార సంఘమును విడిచి నే నేల రావలయును?

(46)

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 11-7-1894.

ఆయుష్మంతుఁడగు—, నాయనా! వ్యవహారధర్మము

కొంచెము నేర్చుకొనుము. మన మింకను మహాకార్యములను జేయవలసియున్నది! గతసంవత్సరము కేవలము విత్తనములు చల్లినాను, ఈ సంవత్సరము ఫల మనుభవింపఁ దలఁచుచున్నాను. ఇంతలో భారతదేశమున యావచ్ఛక్తితోడను ఉత్సాహమును బురికొల్పుము...ఆతనిని దన యిష్టానుసారము వర్తింపనిమ్ము. సకాలమున నాతఁడే చక్కఁబడును. ఆతని బాధ్యత నాది. తన యభిప్రాయము ననుసరింప నాతనికి సంపూర్ణస్వాతంత్ర్యము గలదు, అధికారమునుగలదు. ఆతనిని బత్రికకు వ్రాయఁజేయుఁడు, దానితో నాతఁడు ప్రసన్నుఁడగును! ఆతనికి నా యాశీస్సులు.

...డిట్రాయిట్ ఉపన్యాసమున నాకు 900 డాలర్లు, అనఁగా 2,700 రూపాయిలు వచ్చినవి. ఇతర యుపన్యాసములం దొకదానికి 2,500 డాలర్లు, అనఁగా 7,500 రూపాయి లొక గంటలో సంపాదించినాను. కాని నాకు ముట్టినవి 200 డాలర్లే! (అనఁగా 600 రూపాయిలు మాత్రమే) ఒక 'దగాకోరు ఉపన్యాససంస్థ' నన్ను మోసగించినది. దానితో నా సంబంధము వదలుకొన్నాను.

రాఁబోవు సంవత్సరము నేననేక విషయము లచ్చొత్తింపవలసియుండును. క్రమవిధానమునఁ బని సాగించుచున్నాను. సంకల్పశక్తియే సమస్తము సాధించును... మీరొక సమాజము నేర్పఱచి, క్రమము తప్పక సమావేశములను జరుపుచు, సాధ్యమైనంతవఱకు తఱచు నాకు వ్రాయుచుండవలయును. నిజముగా మీ కింత యుత్సాహమును జనింపఁజేసిన నంత మంచిది. అసత్యమును గాపట్యమును గూర్చి మాత్రము జాగరూకులై యుండుఁడు! వత్సలారా! కృషి చేయుఁడు, తీవ్రతి—ప్రచండదీక్ష—మీ కలవడితీరును! ఏ కార్యమునకైనను నలువురనేకీభవింపఁజేయు శక్తిసామర్థ్యములు మనలోఁ బూర్తిగా శూన్యము, కాని వీనిని గలుగఁజేసికొనవలయును. అసూయను వీడుటయే యిందలి గొప్ప రహస్యము. మీ సోదరుల యభిప్రాయములను సమ్మతించుటకు సర్వదా సంసిద్ధులై యుండుఁడు, సదా సమాధానపడుటకుఁ బ్రయత్నింపుఁడు. ఇదియే కీలకము. ధీరులై కృషి సాగింపుఁడు! పట్టు విడువకుఁడు! జీవితము కలకాలము ఉండఁబోదు! మహోద్యమార్గము దానిని ధార

పోయుఁడు!...మనము ఏశాఖాసంప్రదాయములందును జేర రాదు, కాని వానియెడ సానుభూతి కలిగియుండవలయును, వానితోఁ గలిసి పని చేయవలయును...కృషి చేయుఁడు, తీవ్ర కృషి చేయుఁడు, మీ ప్రేమానురాగములచే నెల్లరను జయింపుఁడు!

ఉద్యమమును విస్తరింపఁ జేయఁ బ్రయత్నింపుఁడు. సంచలనవికాసములే జీవనలక్షణమని గుర్తింపుఁడు...సుస్థిరులై కృషి సాగింపుఁడు. ఇంతవఱకు కద్భుత కార్యముల నొనర్చితిమి. ధీరులారా! అగ్రసరులు కండు. మనము జయించి తీరుదుము. సంస్థలను నిర్మింపుఁడు, సంఘములను స్థాపింపుఁడు, ఉద్యమమును గొనసాగింపుఁడు—ఇదియే మార్గము.

...మీ కందఱకును నా యాశీర్వచనములు. తఱచు వ్రాయకున్నను ఎవ్వరిని మఱచిపోవునట్టివాఁడను గాను. అదిగాక సదా ప్రయాణము చేయుచుండుటచే నొక తావు నుండి మఱియొక తావునకు లేఖలు త్రిప్పి వేయఁబడవలసి వచ్చుచున్నది.

తీవ్రముగాఁ బని చేయుఁడు. అకలంకులై యుండుఁడు, అపుడు ప్రచండదీక్ష లభించును.—మీ ప్రేమ పాత్రుఁడు,

—వివేకానందుఁడు.

(47)

గ్రీనేకర్, జూలై, 1894.

...ఒక మహాత్ముఁడు బోస్టనునుండి యిటకు వేంచేసి యున్నాఁడు; ప్రతిదినము భూతప్రేతముల పనుపున నీయన

ప్రసంగించుమనని వారు చెప్పుదురు...—పత్రికకు అధిపతులా లిచటనే మఠాము ఏర్పఱచుకొనియున్నది. ఆమె తత్త్వ బోధలు చేయుచు, సర్వవిధరోగనివారణార్థము (బోధనకు) తరగతులను నెలకొల్పినది; అచిరకాలముననే వీరు అంగ్లుల కు నేత్రప్రదానము మున్నగు లోకసంగ్రహకార్యములను సాధింపసాగుదు రనుకొందును! ఇంతకు నిదియొక విచిత్ర సంఘము...

...వీరా సంప్రదాయమున స్వామీజీలలో నొకఁడు...ఇచట నున్నాఁడు. అతఁడు తాను ఆధ్యాత్మిక — పారమార్థిక — భౌతిక — రాసాయనిక (ఇత్యాది, ఇత్యాది) సాంప్రదాయిక మానసిక చికిత్సకుఁడనని చెప్పుకొనుచున్నాఁడు! నిన్న బ్రహ్మాండమైన గాలివానవచ్చి యీ సంప్రదాయస్థుల గుడారములకు మంచి "చికిత్స" చేసినది. వీ రుపన్యాసములు జరుపుకొను పెద్ద గుడారము మానవ దృష్టినుండి పూర్తిగా నదృశ్యమైపోవునంతటి యాధ్యాత్మిక శక్తి నీ "చికిత్స" వలనఁ బొందినది; మఱియు రమారమి రెండువందల కుర్చీలు దివ్యావేశపారవశ్యమునఁ గాఁబోలు నచట నృత్యముచేయ నారంభించినవి!...

నాతోఁగూడ నిచట బసచేసియున్నవారు మొన్న రాత్రి దేవదారు (Pine) వృక్షముక్రింద నిదురించినారు; ఈ చెట్టుక్రిందనే నేను బ్రతిదినము శుద్ధ సనాతన పద్ధతిని గూర్చుండి వీరితోఁ బ్రసంగించుచుందును. తారాసందీపితా కాశవితానముక్రింద నిలయును తల్లియొడిలోఁ బవళించి నాఁటి

రేయి మే మందఱము దివ్యానందము నొందితిమి. నాఁటిరాత్రి వైభవమును వర్ణింపఁ జాలము. సంవత్సర పర్యంతము మూర్ఖ జీవనము గడపినపిమ్మట నాననమునఁ దరువుచ్ఛాయలందు ధ్యాన మొనరించుట, ఆహా! ఎంత బ్రహ్మానంద దాయకము! వసతిగృహమున నున్న వారందఱును నింపుమించుగా శ్రీమంతులు; శిబిరమునందలి స్త్రీలును బురుషులు నందఱును వృద్ధగాత్రులు, యువకులు, నిష్కపటులు. "శివోఽహం, శివోఽహం" అను శంకరాచార్య విరచిత గేయమును నేను బోధింప, నమాయకులు, నఖండధీరులు నగు వీరందఱును "శివోఽహం, శివోఽహం" అని నాతోఁగూడఁ బురశ్చరణ మొనర్తురు. ధన్యోఽస్మి! ధన్యోఽస్మి! నన్ను నిర్ధనుని జేసిన యాభగవానునకుఁ గోటి నమస్కారములు,— శిబిరమునందలి యీ సౌమ్యులను నిర్ధనుల నొనర్చిన యా భగవానునకు శతకోటి నమస్కారములు!... నన్నుగూర్చి లేశమును మీరు తాపత్రయపడ నక్కఱలేదు. పరమేశ్వరుఁడే నాకు సమస్త సదుపాయముల నొనఁగూర్చును, ఒనఁగూర్పఁడా, నా సమయము వచ్చనని గ్రహించి నిశ్చింతుఁడనై గతింతును.

"మధురస్వరూపా! మనోమోహనా! అనేకులు నీ కనేకము సమర్పింతురు. నేను నిరుపేదను— కాని నాకు శరీరము గలదు, అంతరంగము గలదు, ఆత్మ గలదు—వీనిని నీ కర్పింతును, స్వీకరింపుము, ప్రభూ! నిరాకరింపకుము." నా మనఃప్రాణములు 'వానికి' సమర్పితమైనవి. ఒకమాట— ఇచట వీరు రసజ్ఞులుకారు—రసజ్ఞులు నిజముగా లోకమున

నెందఱున్నారు? మధురమూర్తియగు మాధవునితత్త్వము వీరవగాహన చేసికొనఁజాలరు. శుష్కజ్ఞానమార్గము నవలంబింపఁ జూతురు, లేదా, ఏ విశ్వాసచికిత్స (Faith cure) నో, ఏమంత్రవిద్యనో, ఏ ప్రేతవాదమునో, భూతవాదమునో పట్టుకొని ప్రాఁకులాడుచుందురు. ప్రేమ, స్వాతంత్ర్యము, జీవనము ననువానినిగూర్చి యీ దేశస్థులుచేయునంతటి యార్భటము మఱెచ్చటను వినఁబోము, ఇఁక వానినిగూర్చి యీ దేశస్థుల కున్నంతటి దురభిప్రాయమును మఱెచ్చటను గనఁబోము, ఇఁక వీరికి భగవంతుఁ డనఁగాఁ బెద్ద "యముఁడు" లేదా, "రోగనివారణశక్తి", లేదా, "స్పందనము". మఱి యేమేమో! సెబాసు!! ఇఁక నీ "రామచిలుకలు" ఎంతసేపు "ప్రేమ", "ప్రేమ", "ప్రేమ" యని ప్రలాపించుచుందురు !

* మీ మనోరథములు యోగ్యమై వెలయుఁగాక ! మీ భావములు మహనీయమై నఱలుఁగాక ! మీ రందఱును యోగ్యులు, ఉదారులు. చైతన్యమును జడస్థితికిఁ దెచ్చుటకు బదులు—ఈ లౌకికులు చేయునట్లు ఆత్మ నైహికస్థితికి దింపుటకు బదులు—ఐహికవిషయముల నాధ్యాత్మికముగా మార్చివేయుఁడు, నిర్మలశాంతి సాగరమగు సచ్చిదానంద పరబ్రహ్మము ననుదినము నణుమాత్రమైన ననుభూత మొనరించుకొనుఁడు. అహర్నిశము బ్రహ్మభావమున మనఁ బ్రయత్నింపుఁడు....

సదా పరమేశ్వరాయత్తచిత్తులై యుండుఁడు ! శరీరాదులకేమి సంభవించిననేమి? ఘోరాపదలను మరణ

యాతన ననుభవించునపుడు, "పరమేశ్వరా! నీవే నా ప్రేమ జ్యోతివి" అనుడు. ఏ పరితాపము సంభవించినను, "పరమేశ్వరా! నీవే నా ప్రేమజ్యోతివి" అనుడు. "నీవు నాకుఁ బ్రత్యక్షమూర్తివి, నీవు నాదండనున్నావు, ఇది నా యనుభవము; నేను నీవాఁడనే కదా, నన్నేలుకొనుము. నేను లౌకికుఁడనుగాను, నీ బిడ్డను, నన్ను గ్రైకొనుము"—మీ మనోభావము లిటు లుండవలయును. రత్నరాసులను వీడి గులకరాళ్లకై పరుగులిడఁబోకుఁడు! ఈ జన్మము మహా దుర్లభము. అట్టిచోఁ దుచ్ఛవిషయ సుఖములకై ప్రాఁకులాడ దరా?—పరమేశ్వరుఁడు సచ్చిదానందమూర్తి. పరమార్థము నన్వేషింపుఁడు, తప్పక లభించును. ఆశీర్వచనములు.

—మీ వివేకానందుఁడు.

(48)

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 31-8-1894.

స్నేహాస్పద—,..."కిడ్డి" వద్దనుండి లేఖ వచ్చినది. అతని ప్రశ్నలన్నిటికిని సమాధానించిన, నొక గ్రంథ మగును....

...ఇపుడొక చిన్నసంఘము నేర్పాటుచేయుము.... ఉద్యమమునంతను—నాయకుఁడవుగాఁ గాదుసుమీ, సేవకుఁడవుగా—నీవే నిర్వహింపవలసియున్నది. పెత్తనము వహించున ట్లేమాత్రము కాన్పించినను సర్వము ధ్వంసమగును. పెత్తన మీర్ష్యను బురికొల్పును!...ఉత్తమాశయములను

వ్యాప్తిచేయుచు మెల్లఁగా బనిచేయుము. . .మైసూరు కాలక్రమమున మన సేవాసంఘము (Mission) న కొక 'కోట' యగును. . .మైసూరునుండియు నితర స్థలముల నుండియు ధనము ప్రోగుచేసి మద్రాసులో నొక యాలయము నిర్మింపఁ బ్రయత్నింపుఁడు. అందొక పుస్తకభాండాగారము ఉండవలయును, కార్యాలయమునకుఁ గొన్ని గదులుండవలయును, ప్రచారకులగు సన్న్యాసులయొక్కయు నాగంతుకులగు బైరాగులయొక్కయు నివాసమునకుఁగాను మఱికొన్ని గదులుండవలయును. ఈ విధమున మెల్లమెల్లఁగా మన మభివృద్ధి పొందవలయును. . .వత్సా! ధీరాత్ముఁడా! నీ వింతవఱకుఁ జేసినపని చాల బాగుగా నున్నది. సమస్తశక్తులును నీకుఁ జేకూరుఁగాక !. . .

. . .ధనము నా వద్ద నుంచుకొనుట—తుదకు దానిని ముట్టుటకూడ—నాకు మహాకష్టమను సంగతి నీకుఁ దెలిసినదే కదా. నా కిది చెడ్డరోఁత, పాతిత్యము, కావున ధన వ్యవహార విషయములను జూచుకొనుటకుఁగాను నీవు ప్రత్యేకమొక సంఘము నేర్పాటుచేయవలసియున్నది. ధనసంబంధమైన నా వ్యవహారముల నన్నిటిని జక్కఁబెట్టుటకు నా కిచట మిత్రులున్నారు. దారుణమైన యీ గొడవనుండి విముక్తుఁడనైతినా, నాకు శాంతియు విశ్రాంతియు లభించును—బోధపడినదా? కావున మీ రెంత శీఘ్రముగా నొక సంఘముగా నేర్పడి, యిచటి నా మిత్రులతోడను సహకారులతోడను నీవు కార్యదర్శిగను కోశాధిపతిగను నుత్తర ప్రత్యుత్తరములను జరుప సంసిద్ధుఁడనైన మీకును నాకునుగూడ

నంత మంచిది. వెంటనే యీకార్యమును జరిపి నాకు వ్రాయుము. సంఘమునకే ప్రత్యేక సంప్రదాయమునకును జెందని పేరు పెట్టుఁడు.

...ఊరును పేరును లేని స్థితినుండి యత్యభివృద్ధి పొంది ప్రపంచదృష్టి నాకట్టితిమో చూడుఁడు! భారతదేశమే కాక బాహ్యలోకమంతయు మన మూలమున మహాకార్యముల నాశించుచున్నది.

...సత్యమును ప్రేమను ధర్మదీక్షను నడ్డఁజాలిన దేదియు లేదు. మీరు నిష్కపటులేనా? ప్రాణత్యాగమునకైనను సిద్ధపడు స్వార్థరహితులేనా? ప్రేమమయులేనా? అగుచో మీకు భయము లేదు. మృత్యువువలననైనను భయములేదు. వత్సలారా! ముందంజ వేయుఁడు! లోకమునకంతకును వికాసము అత్యావశ్యకమైయున్నది. దానికై లోకము వేచియున్నది! భారతదేశముననే యీ వికాసము—జ్ఞానతేజము—కలదు; ఇంద్రజాలముననా, కాదు; మంత్రతంత్రములందా, కాదు; పరమార్థవైభవబోధనమున—మహోన్నతాధ్యాత్మిక తత్త్వబోధనమున—నయ్యది వెల్గొందుచున్నది. ఇందువలననే సమస్త విఘాతములనుండియు భారతజాతిని విధాత కాపాడి, నేఁటివఱకును నిలిపియున్నాఁడు. ఇపుడు సమయము వచ్చినది. వత్సలారా! ధీరులారా! మీరందఱును ఘనకార్యముల నొనర్చుటకు జన్మించితిమని నమ్ముఁడు! శ్వానగర్జనములకు—మూర్ఖ ప్రతిఘటనములకు—జడియకుఁడు, వజ్రాయుధఘాతమునకైనను

తెలివరుఁడు, సుస్థిరుఁడవై, కృషి సాగింపుఁడు!—చిరస్నేహాస్పదుఁడు,
—వివేకానందుఁడు.

(49)

## అమెరికాదేశీయ శిష్యుఁడగు నొకసన్న్యాసికి

బోస్టను, 13-9-1894.

...నీవు నాకుఁ గృతజ్ఞతావందనము లర్పింప నక్కఱ లేదు. ఏలన నిది కేవలము నాకర్తవ్యము. గురువు గతించుచో శిష్యుఁడే యాతనికి వారసుఁడగుననియు సన్న్యాసింపక మును పాతనికిఁ గుమారుఁడున్నను నాతఁడు వారసుఁడు కాఁడనియు హిందూధర్మశాస్త్రము. ఇది నిజమైన పారమార్థిక బాంధవ్యముకాని మీదేశీయుల "'ట్యూటరు' * వ్యాపారము" గాదు సుమీ!

నీ కభ్యుదయము గలుగుఁగాక!... మీ

—వివేకానందుఁడు.

(50)

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 21-9-1894.

స్నేహాస్పద—...వెంటనే భారతదేశమునకు రావలయునని నా యాశయము. ఈదేశమున నునికి చాలు నని పించుచున్నది—ముఖ్యముగా మితిమీఱినపని నాకు నాడీకంపము గలిగించుచున్నది. లెక్కకు మించిన బహిరంగో

* అనఁగా డబ్బుపుచ్చుకొని చదువు చెప్పువాఁడు.

పన్యాసము లేమి, అనవరతమైన 'అడావుడి' యేమి, నాకీ కంపమును గలిగించుచున్నది...కావున వెంటనే మఱలు దును—ఏమందువు? కాని నాయందు విశేషప్రీతిఁ జూపు వారిసంఖ్య, సదా నేనిచటనే యుండవలయునను వారిసంఖ్య, దినదినాభివృద్ధి జెందుచున్నది. ఈ వార్తాపత్రికా సంరంభము, ఈ లౌకికజీవనదంభము, ఇంకఁ జాలును.

...పెదవులు చప్పరించుచు సానుభూతి ప్రకటించి నంతమాత్రమున నెవరివలనను నేదేశమునను మేలు చేకూర నేరదు. క్రైస్తవదేశములలోఁ గొందఱు ధనమొసఁగకపోరు —కాని యది యేయుక్తిచేతనో, ఏ నరకభయముననో కావున నది "కాకులను గొట్టి గద్దలకుఁ బెట్టు" ననునట్లు తోఁచును. (లేదా, వంగదేశీయ సామ్యమునలె) "గోవును జంపి, చర్మముతోఁ జెప్పులుకుట్టించి బాపనయ్యకు దానము చేయుము" అనునట్లుండును. ఇక్కడను నంతే, లోకమున మఱెక్కడనునంతే. ఏమైనను మన ప్రాగ్దేశీయులతోఁ బోల్చిచూచినచోఁ, బాశ్చాత్యులు లోభు లనిపించును. ఆసియాఖండవాసులు లోకులందఱియందును మహోదారు లని నానమ్మకము, కాని వారు పేదలు.

...ఈ యుపన్యాసవ్యాపారమనిన నాకు విసుగు పుట్టుచున్నది. ఆత్మవిద్యను—పరమార్థమును—గ్రహించు టకుఁ బాశ్చాత్యుల కింకను జాలకాలము పట్టును. సర్వము వారికి రూపాయలు, అణాలు, పైసలు. ఏమతమైనను సరియే, ఏధర్మమైనను సరియే, ఆయురారోగ్యములను సిరి

సంపదలను సౌందర్యమును నోడిలో వేయునా, తేనెటీఁగల వలె వారు దానిచుట్టును మూఁగుదురు, లేనిచో దాని మూతి చూడరు...శాశ్వతప్రేమబద్ధుఁడు,

—వివేకానందుఁడు.

(51)

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 21-9-1894.

ప్రియుష్మంతుఁడగు—, ఇంతలో సంసారత్యాగముచేయ నిశ్చయించుకొంటివని వినుట నా కతి విచారకరము. పక్వమైనపండు చెట్టునుండి రాలును కావున యుక్త సమయమునకుఁగాను వేచియుండుము. తొందరపడకు. అదిగాక తన యవివేక కృత్యములచే నితరులను దుఃఖితులఁ జేయుట కెవ్వరికి నధికారము లేదు. నిదానింపుము, తొందరపడకు, సకాలమున నంతయుఁ జక్కఁబడును.—ఆశీర్వాదకుఁడు,

—వివేకానందుఁడు.

(52)

న్యూయార్క్, 25-9-1894.

ప్రియుష్మంతుఁడగు—, నీవద్దనుండి కొన్ని లేఖ లందినందులకుఁ జాలసంతోషము...ఇతరులును గొంత సంచలనము గలిగించుచున్నందులకు మఱియు సంతోషము. మనము సంచలనము, కాదు, విప్లవము కలిగింపవలయును. లేనిచో లాభము లేదు. చూడుఁడు, ప్రపంచమును మీా రుట్టూఁత లూఁగింపఁగలరు—జయగురుదేవ! "శ్రేయాంసి బహు

విఘ్నాని'' (శ్రేయస్కర కార్యములకు విఘ్నములు మెండు) అని మీకుఁ దెలియునుగదా. ఈ విఘ్నములే శీలమును నిర్మించును, జనులను మహనీయుల నొనర్చును... ఈ తాఁకుడు నెదిరించి నిలుచుట 'మిషనరీ'ల తరమా! వారి తాతలతరమా ?...''మహాగజాః పలాయన్తే మశకానాంతు కాగతిః''—''మదపుటేనుఁగులు కొట్టుకొని పోవుచుండ దోమగతి మాటయేమి!'' నాయనా! ఆవిషయమై నీవు బెంగపెట్టుకొనక, మనస్సు కుదుటఁబఱచుకొనుము. ప్రత్యు ద్యమమునను గుణగ్రహణపారీణులు కొందఱు, రంధ్రాన్వేష కులు మఱికొందఱు. మీ పనిని మీరు సాగింపుఁడు, ఏపక్షమునకుఁగాని మీరు సమాధానింపనేల? ''సత్యమేవ జయతే నానృతం, సత్యేనైవ పన్థావితతో దేవయానః.'' (ఎన్నఁటి కైనను సత్యమే జయించునది, అనృతముకాదు: సత్యము ననే దేవయాన మార్గము వెలయుచున్నది.)...క్రమముగా సర్వము సిద్ధించును.

...ఈ దేశమున బాలికలమూలముననే బాంధవ్యము. కుమారుఁడు పెండ్లియాడినంతనే యికఁ గుటుంబమునకుఁ జెందఁడు, కాని యల్లుఁడు మామగారియింటిని దఱచు సందర్శించుచుండును. ''పెండ్లాము దొరకువఱకే కొడుకు కొడుకుగాని కూతురు యావజ్జీవము కూతురే'' యని వారి సామెత.

...చిన్నతనముననే యిచట బాలురు జీవనోపాధి నార్జింపఁబోవుదురు; బాలికలో, విశ్వవిద్యాలయములలో

విద్యనభ్యసించుచుందురు. కావుననే సభలలో నూటికిఁ దొంబదితొమ్మండ్రు బాలికలే కనిపించుచుందురు. వారితోఁ బోల్చిచూచినచో, బాలుర కిచటను నాస్పదమే లేనట్లు తోఁచును.

ఈ దేశమున భూతవాదులును ప్రేతవాదులును (Spiritualists) కావలసినంతమంది కలరు. భూతమును లేదా, విగతజీవుని వెలువఱుచు వ్యక్తియే Medium (మధ్యవర్తి). ఈ వ్యక్తి యొక్క తెరచాటునకు వెడలును, అందుండి నానావర్ణములతో, ఆకృతులతో, భూతములు వెలువడును. ఈ సంఘటనములను నేను గొన్నిటిని జూచి నాను, కాని యిదియంతయు నాకు 'తమాషా'గాఁ దోఁచినది. దీనినిగూర్చి యిదమిత్థమని నిర్ణయించుటకుముందు మఱి కొన్నిటిని బరిశీలింపవలసియున్నది. ఈ భూతవాదు లనేకులు నన్ను గౌరవింతురు.

తరువాత గమనింపఁదగినది "Christian Science" (క్రైస్తవవిజ్ఞానము). ఈ రోజులలో నెక్కడఁజూచినను నీ క్రైస్తవవిజ్ఞానవాదుల ప్రభావమే కలుఁగుచున్నది—ఎక్కడఁ జూచినను వీరే. వీరనినను, వీరివ్యాప్తియనినను (క్రైస్తవులలో) సనాతనులకుఁ గడుపుమంట. ఈ క్రైస్తవ విజ్ఞాన వాదులు వేదాంతులు—అనఁగా అద్వైతదర్శనమునందలి కొన్ని సిద్ధాంతములను బట్టుకొని బైబిలునకు ముడిపెట్టు చున్నారని నాయభిప్రాయము. "సోఽహం, సోఽహమ్" అనుచు మనశ్శక్తిమూలమున వీరు రోగనివారణ చేయు

చుందురు. వీరందఱును నన్ను విశేషముగాఁ గొని యాడుదురు.

ఈ దేశములోని 'సనాతనులు' ఇపుడు నిస్సహాయులై గోలచేయుచున్నారు. "పిశాచారాధకులను"* దూషించుదిన ములు వెనుకఁబడినవి. నేనన్న వారికి సింహస్వప్నము, నన్ను గూర్చి వారు, "ఏమి శనిగ్రహము మనకు దాపరించినది! వేలకొలది జనులు వీని వెంటఁబడుచున్నారు! సనాతన క్రైస్తవమతమును వీఁడు రూపుమాపునా యేమి?" అని మొ త్తుకొనుచుందురు. కానిండు, అగ్నిముట్టించినాము, గుర్వను గ్రహమున నీ జ్వాల యింక నాఱిపోవునది కాదు. ఈ స్వమత దురభిమానులు ఉక్కిరిబిక్కిరియగు దినములు వచ్చి తీరును....

ఇచటి దివ్యజ్ఞానసామాజికు లంతఁగా శక్తిమంతులు కారు. ఐనను వీరికిని క్రైస్తవ సనాతనులనినఁ బరమా సహ్యము.

ఈ క్రైస్తవవిజ్ఞానము సరిగా మన కార్తభాజ సాంప్రదాయము† వంటిది; "నా కేవ్యాధియు లేదు"

---

* క్రైస్తవులలోఁ బూర్వాచారపరాయణులు హిందువులను నితర మతస్థులను "పిశాచారాధకులు" (Devil worshippers) అని నిరసించు చుందురు.

†వంగీయ వైష్ణవమతము క్షీణదశ నొందినపు డందుండి వెలువడిన యొకశాఖ. కార్తభాజులు భగవంతుని 'కర్త' యందురు. విశ్వాసమును బురికొల్పి రోగికిఁ జికిత్స చేయుటలో వీరు కొంతవఱకుఁ బ్రసిద్ధులు.

అనుఁడు—మీరు ఆరోగ్యవంతులగుదురు; "సోఽహమ్" అనుఁడు,—విముక్తులగుదురు. ఇది శుద్ధలౌకిక చింతాపరాయణమైన దేశము. రోగములను నివారింపఁ గలిగితివేని, యమానుషక్రియలను జూపఁగలిగితివేని, ధనసంపాదనకు నూతన మార్గములను దెలుపఁగలిగితివేని, ధార్మికవిషయమునఁ బరమమూఢుఁడవైయుందువుగాక! వీరు నీమతమును దలఁదాల్తురు. కాని యిందులకు భిన్నసంఘటనములును లేకపోలేదు.

ఇచటి జనులకు నేను గేవల మపూర్వవ్యక్తిని. వీరికి నాతత్త్వమేమియు బోధపడుటలేదు. పాపము, సనాతనులకుఁగూడ నేమిచేయుటకును బాలుపోకున్నది. జనులిపుడు నేననిన భయభక్తులు కనఁబఱచుచున్నారు. నాయనా! బ్రహ్మచర్యమును మించిన బలమున్నదా?

చెన్నపురిపౌరులు పంపిన వినతిపత్రము నిచటిజనులతి కుతూహలముతోడను నాత్రముతోడను గమనించుచున్నారు. పత్రికలన్నియు దానిని బ్రకటించినవి. దానికిపుడు సమాధానము వ్రాయుచున్నాను.

...ఇచటి కన్యలు సౌభాగ్యరాండ్రు, ఆత్మగౌరవము కలవారు....మొత్తముమీఁద నిచటిజనులు విరోచనసంతతివారు. * శరీరపోషణమే వీరిపరమార్థము: సింగారించు

* విరోచనుఁడు ప్రహ్లాదుని పుత్రుఁడు, దానవప్రభువు. ఈతఁడు ఆత్మజ్ఞానార్థియై బ్రహ్మవద్దకు వెళ్లెను. కాని యాతని బోధనలను నపార్థము చేసికొని తుదకు విషయలోలుఁడయ్యెను. (చూ. ఛాందోగ్యోపనిషత్తు, అష్టమానువాకము.)

కొనుట, దిద్దుకొనుట—వీనియందే వీరి శ్రద్ధాభక్తులు; గోళ్లు తీసికొనుటకు వేయిసాధనములు, కేశఖండనమునకుఁ బది వేలసాధనములు—ఇఁక దుస్తులు, ముస్తాబులు, పరిమళద్రవ్యములు, నన్నియెన్నిరకములో వర్ణించుట కాదిశేషుఁడు రావలయును.

...వీరు మంచివారు, దయగలవారు, ఆడినమాట తప్పరు; అంతయు బాగుగనేయున్నది కాని భోగమే వీరి భగవంతుఁడు. సౌందర్యమను పిచికలతో, విద్యయను నలలతో, భోగాంగణమున సిరిసంపద లేఱులై పాఱు దేశమిది.

కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా.

—గీత, 4-12.

ఈ లోకమునఁ గర్మఫలములను గాంక్షించుచు జనులు దేవతల నారాధింతురు. ఈ మనుష్యలోకమున శీఘ్రముగాఁ గర్మములు ఫలించునుగదా.

ఈ దేశమున శక్తిసామర్థ్యములును గార్యదీక్షయు నత్యద్భుతముగా వ్యక్తమగుచుండును.—ఏమి యఖండ బలము! ఏమి కార్యాచరణము! ఏమి పౌరుషము! బ్రహ్మాండమైన యేనుఁగులవంటి గుఱ్ఱములు భవనములవంటి పెద్దపెద్ద బండ్లను లాగికొని పోవుచుండును. ఇతరవిషయములు నిట్టివేయని మీరు గ్రహింపవచ్చును...స్త్రీలను వీరు గౌరవభావముతోఁ జూతురు. సర్వవిషయములందును స్త్రీలు

ముందంజ వేయుచున్నారు. స్త్రీలయెడ గౌరవభావ మిచట పరిపూర్ణత వహించినదని నాయభిప్రాయము. పరికింపుఁడు, —ఈ దేశ స్త్రీలను జూచి నిజముగా నేను నిశ్చేష్టుఁడ నైతిని! ఏమి చాకచక్యము! ఏమి శక్తిసామర్థ్యములు! నేను కేవలము పసిపిల్లవాఁడనో యనునట్లు నన్ను వా రంగడులకును సర్వ ప్రదేశములకును దీసికొనిపోవుదురు. సర్వవిధములైన పనులను వారు చక్కఁబెట్టుదురు—వారు చేయు పనులలోఁ బదునాఱవ వంతుగూడ నేను జేయఁజాలను. సౌందర్యమున శ్రీ మహాలక్ష్మికిని విద్యలలో సరస్వతీదేవికిని సాటియగు వారు సాక్షాత్ పరమేశ్వరి యవతారములు. వారిని బూజించుచోఁ, బరిపూర్ణతనందు టబ్బురము కానేరదు. రామ! రామ! మనము మనుష్యుల మనిపించుకొనఁదగుదుమా? అట్టి జగన్మాతృమూర్తులను వేయిమందిని—నేను గతించుటకు ముందు—మన దేశమున వెలువడఁజేయఁగలిగినచో, మనశ్శాంతితో మరణింతును. అట్టివారు వెలువడినప్పుడే మీ దేశీయులు భారతీయు లనిపించుకొనఁగలుగుదురు...

ఇచటి స్త్రీలను జూచి నిజముగా నేను దిగ్భ్రమింతుఁడ నైతిని. జగజ్జననికి వారిపై నెంత యనుగ్రహము! నిజముగా వారత్యద్భుత వ్యక్తులు! సర్వవిషయములందును స్త్రీలతోఁ బోటిలోఁ బురుషులు నిలువలేకున్నారు. తల్లీ! లోకేశ్వరీ!... ఈ స్త్రీ పురుష భేదమును రూపుమాపని దే నేను నిద్రపోరాదు, ఆత్మయందేమైన లింగభేదము కలదా? ఈ స్త్రీ పురుష భేదమును నిర్మూలింపుఁడు—సర్వము నాత్మయే! శరీరాభిమానమును దుత్తునియలు చేయుఁడు,

లెండు! "అస్తి! అస్తి!" యను సద్భావమును బ్రక టింపుఁడు—సమన్వయభావములను జేపట్టుఁడు. "నాస్తి, నాస్తి" యను వ్యతిరేకభావములను బట్టుకొని యూఁగులాడు చుండుటచేతనే దేశ మధోగతిపాలగుచున్నది! "సోఽహం, సోఽహం, శివోఽహమ్!" ప్రతిజీవియందును నఖండశక్తికలదు; "నే నల్పుఁడను, తుచ్ఛుఁడను" అను వ్యతిరేకభావముల నాశ్రయించి పందులును బిల్లులును నగుటయా మీరు? ఏమి ఘోరకలి! నాస్తికతను నిరసనమును బోధింప సాహసించువా రెవ్వరు? 'అబల' లనియు 'భీరువు' లనియు నెవరిని మీరు నిరసించుచుండుట? "శివోఽహం, శివోఽహమ్." నాస్తిక భావములను నిరసనభావములను జనులు నొక్కి వక్కాణిం చుట విన్న నాకుఁ దలనొప్పిఁ బిడుగు పడినట్లు తోఁచును. ఈ విధమైన యాత్మనిరసనము వ్యాధికి మాఱుపేరు కాదా? ఆత్మనిరసనమును వినయమనవచ్చునా? అది దొంగవేష మున నున్న దంభము—అహంభావము. "నలిఙ్గం ధర్మకారణం, సమతా సర్వభూతేషు ఏతన్ముక్తస్య లక్షణమ్"— బాహ్యచిహ్నములును వేషములును బరమార్థము నొసఁగఁ జాలవు; సర్వభూతములందును సమతయే ముక్తలక్షణము. "అస్తి, అస్తి; సోఽహం, సోఽహం; చిదానన్దరూపః, శివోఽహం, శివోఽహమ్"—నేను చిదానందమూర్తిని, శివుఁడను, శివుఁడను! "నిర్గచ్ఛతి జగజ్జాలాత్ పఞ్జరాదివ కేసరీ"—పంజరమునుండి కేసరివోలె జగజ్జాలమునుండి యాతఁడు (ముక్తుఁడు) వెలువడును! "నాయమాత్మా బల హీనేన లభ్యః"—ఈ యాత్మ బలహీనులకు లభ్యము

కానేరదు...హిమసంఘాతమువలెఁ బ్రపంచముపైఁ బడుఁడు—తద్వారమునఁ బ్రపంచము గుభిల్లుమని పగిలిపోఁగాక! హర! హర! మహాదేవ! "ఉద్ధరే దాత్మనాత్మానమ్"—తనవలననే, పురుషప్రయత్నముననే—తన్నుద్ధరించుకో వలయును.

పరహితార్థము ఈ జీవిత మాహుతియగు దిన మెన్నఁడు ప్రాప్తించునో కదా! జీవయాత్ర యనఁగా నిది యేమి యెకసక్కెమా? గుండెనెత్తురు ధారపోసి రాజమార్గ మును నిర్మించువారే మహాత్ములు. అనాదిగా జరుగుచున్న దిదియే. మనశ్శరీరములను సమర్పించి యొకఁడు సేతువును నిర్మింప, వేలకొలఁదిజను లితరులు తన్మూలమునఁ బ్రవాహ మును దాఁటుచుందురు. "ఏవమస్తు! ఏవమస్తు! శివోఽహం, శివోఽహమ్!"...

చెన్నపురిలో సంచలనము గలిగినదనుట శుభ వర్త మానము.

మీరేమైనను బత్రికను బ్రారంభింపరా? దాని మాట యేమైనది? మన మండలితోడను గలసి మెలసి వర్తింపవలయును, ఎవ్వరిని నన్యులుగా భావింపరాదు. దార్జ వ్యమును బ్రతిఘటించు సౌజన్యము—సమస్త దోషముల నెదిర్చి నిల్చు శ్రేయశ్శక్తి—ఇదియే మనకు వలయునది. ప్రతివ్యక్తియు మన గురుదేవునియందు విశ్వాసము గలిగి యుండవలయునని పట్టుపట్టకుఁడు...సగము వంగభాష తోడను సగము హిందీతోడను గూడియుండు నొక పత్రిక

కును—, వీలగుచో మఱియొక యాంగ్లపత్రికకును నీవు సంపాదకుఁడవు గావలసియున్నది—వీనిని నీవు నిర్వహించి తీరవలయును. ఊరక పరిభ్రమించుటవలనఁ బ్రయోజనము లేదు. నీ వెచటికి వెళ్లిన నచట నొక స్థిరమైన ప్రచారక కేంద్రమును నెలకొల్పవలయును. అప్పుడే జనులలో మార్పు కలుగసాగును. నే నొక పుస్తకము వ్రాయుచున్నాను. అది ముగిసి నంతనే మాతృదేశమునకుఁ బరుగున వచ్చెదను!

...పేరు ప్రతిష్ఠలకోసముగాక, లోకకల్యాణమునకై శ్రీరామకృష్ణుఁ డావిర్భవించెనని సదా జ్ఞప్తియం దుంచుకొనుఁడు, ఆతఁడు దేనిని బోధింప నవతరించెనో దానినే వ్యాప్తిచేయుఁడు. ఆతని పేరును గూర్చి మీరు తొందరపడ నక్కఱలేదు—దానంతటదియే వ్యాపించును. మీ గురువును బ్రతివ్యక్తియు (అవతారమూర్తిగా) నంగీకరింపవలయునని లేనిపోని పట్టుదల చూపనారంభించినంతనే యొక శాఖను సృష్టించిన వారగుదురు—కావున జాగ్రత! అందఱియెడలను సద్భావమునే ప్రకటింపుఁడు—మంచిమాటలనే యాడుఁడు—క్రోధమును ద్వేషమును జూపినచో సర్వము ధ్వంసమగును. ఇచ్చవచ్చిన రీతిని లోకులేమైన నందురుగాక, మీ నిశ్చితాభిప్రాయములను విడువకుఁడు, లోకము తుదకు మీకుఁ బాదాక్రాంతమగునని—ఐతీరునని—నమ్ముఁడు. “వీరియందో, వారియందో శ్రద్ధాభక్తులు కలిగియుండవలయును” అని వారందురు, కాని “మొట్టమొదట ఆత్మవిశ్వాసము గలిగియుండుఁడు” అని నేను జెప్పెదను—ఇదియే తరణోపాయము. ఆత్మవిశ్వాసమును బూనుఁడు—సమస్త

శక్తియు మీయందే కలదు—దానిని వెలువడఁజేయుఁడు. ''సమస్తము సాధ్యము'' అని ప్రకటింపుఁడు. ''గట్టిగా నిరాకరింపఁగలిగితివా, విషముగూడ నిన్నేమియుఁ జేయఁజాలదు,'' *''లేదు'' అనకుఁడు, ''కాదు'' అనకుఁడు, మొలఁకువ గలిగి వర్తింపుఁడు! నాస్తిక భావములను, నిరసన భావములను నిరాకరింపుఁడు, నిరసింపుఁడు! ''సోఽహం, సోఽహమ్'' అని చాటుఁడు!

> కిం నామ రోదిషి సఖే త్వయి సర్వశక్తిః
> ఆమంత్రయస్వ భగవన్ భగదం స్వరూపమ్,
> త్రైలోక్యమేతదఖిలం తవ పాదమూలే
> ఆత్మైవ హి ప్రభవతే న జడః కదాచిత్.

—''సఖుఁడా! నీ వెందులకు విచారించెదవు? సమస్తశక్తియు నీయందే కలదు. ఓ భగవానుఁడా! నీ భగవత్స్వభావము నామతింపుము. ఈ ముల్లోకములును నీకుఁ బాదాక్రాంతమగును. ప్రభావోపేతమై వెలయున దాత్మయే, జడప్రకృతి యెన్నఁటికిని గాదు.

అప్రతిహతశక్తితోఁ బనిచేయుఁడు! భయ మేమి? మిమ్ములనెదిర్చి నిలువఁగలుగు వారెవ్వరు? ''కుర్మస్తారక చర్వణం త్రిభువనముత్పాటయామః బలాత్ కిం భోన విజానన్యస్మాన్, రామకృష్ణదాసావయవ్''—తారకలను బిండిచేసివేయుదము, ముజ్జగములను పెల్లగించివేయుదము, మన

* శ్రీరామకృష్ణ పరమహంస సూక్తి

మెవరమో మీకుఁ దెలియదా? శ్రీరామకృష్ణదాసులము. భయపడుటయా? ఎవరికి? సరి, సరి!

> క్షీణాః స్మ దీనాః సకరుణాః జల్పన్తి మూఢా జనాః
> నాస్తిక్యన్త్విదన్తు అహహ దేహాత్మవాదాతురాః,
> ప్రాప్తాః స్మ వీరా గతభయా అభయం ప్రతిష్ఠాం యదా
> ఆస్తిక్యన్త్విదన్తు చినుమః రామకృష్ణదాసా వయమ్.
>
> పీత్వా పీత్వా పరమమమృతం వీతసంసారరాగాః
> హిత్వా హిత్వా సకలకలహప్రాపిణీం స్వార్థసిద్ధిమ్,
> ధ్యాత్వా ధ్యాత్వా గురువరపదం సర్వకల్యాణరూపం
> నత్వా నత్వా సకలభువనం పాతుమామన్త్రయామః.
>
> ప్రాప్తం యద్వై త్వనాదినిధనం వేదోదధిం మథిత్వా
> దత్తం యస్య ప్రకరణే హరిహరబ్రహ్మాదిదేవైర్బలం,
> పూర్ణం యత్తు ప్రాణసారైః భౌమనారాయణానాం
> రామకృష్ణస్తనుం ధత్తే తత్పూర్ణపాత్రమిదం భోః.

—"తమ దేహములతోఁ దాదాత్మ్యము నొంది, 'మేము దుర్బలులము, అల్పులము' అని దీనముగా విలపించు వారు మూఢులు. ఇదంతయు నాస్తికత్వము. భయమును వీడిన మన మభయప్రతిష్ఠుల మై, వీరుల మై వర్తింతుము. రామకృష్ణదాసులమగు మన కవలంబనీయమగున దిట్టి యాస్తికతయే.

"సంసారరాగమును బరిత్యజించి. సదా పరమామృతపాన మొనర్చుచు, సకల కలహములకును మూలమగు స్వార్థపరతను సమూలముగా విడనాడి, మన గురుదేవుని

సర్వకల్యాణరూప పాదారవిందముల ననవరతము ధ్యానించుచు, సకల జనుల నీ యమృతపానమునఁ బాల్గొనుఁడని, వందన సహస్రపూర్వకముగా నాహ్వానింతుము.

"ఎయ్యది యనంత వేదోదధిని మథించుటచే లభించెనో, హరిహర బ్రహ్మాది దేవత లెందు తమబలమును గ్రుమ్మరించియుండిరో, అవతారమూర్తుల ప్రాణ సారము చే నెయ్యది పూరింపఁ బడియెనో—అట్టి పరమామృతము శ్రీరామకృష్ణుని వ్యక్తిత్వమునఁ బరిపూర్ణమై యొప్పారుచున్నది!"

ఆంగ్లవిద్యావంతులగు యువకులనడుమ మనము కృషి చేయవలయును. "త్యాగేనైకే అమృతత్వ మానశుః—త్యాగమువలన నే జను లమృతత్వము నొందిరి." త్యాగము!—త్యాగము!—అన్నిటికంటెను త్యాగము నే విశేషముగా మీరు బోధింపవలయును. సంసారత్యాగము చేయనిదే యాధ్యాత్మికశక్తి యులవడదు...

...అంతగా బాధపడుచుండుటకు హేతువేమి? నాస్తికత, ఆత్మనిరసనము. మనోబలముచే వ్యాధిని నిరాకరింపవలయునని తెల్పుము—గంటలో వ్యాధి నిర్మూలమగును! ఆత్మనగు నేను వ్యాధిపీడితుఁడనగుటయా? వ్యాధియును లేదు, గీధియును లేదు! "నే నాత్మను: వ్యాధిపీడితుఁడ నగు టెట్లు?" అని యొకగంటసే పేకాగ్రముగా ధ్యానింపుఁడని వారికిఁ జెప్పుము!—సమస్తము నదృశ్యమైపోవును. అఖండ శక్తిమంతమగు నాత్మను నేను" అని మీరందఱును భావిం

పుడు—ఎట్టిశక్తి సామర్థ్యము లలవడునో చూడుడు!... ఆత్మనిరసనమా! ఏల? నేను సర్వశక్తి స్వరూపిణియగు జగజ్జనని సుతుఁడనుగానా? వ్యాధిగాని, భయముగాని, మోహముగాని నన్నేమి చేయఁగలదు? "నేను దుర్బలుఁడను" అను నాస్తికభావమును విషమువలెఁ బరిత్యజింపుఁడు—తన్మూలమున సమస్త శుభములును మీకుఁ జేకూరును. నాస్తికభావములను గల్పైనను దలఁపక, సదా సమన్వయ భావములను, ఆస్తికభావముల ననలంబింపుఁడు. నేనున్నాను, భగవంతుఁ డున్నాఁడు, సకలము నాలోనున్నది, ఆరోగ్యమును—నైర్మల్యమును—జ్ఞానమును—నాకేది వలయునో దానిని వ్యక్తముచేయఁగలను. చూడుఁడు, ఈ విదేశీయులు నా బోధనలను గ్రహింపఁగలుగుచున్నారు కాని మీరు నాస్తికభావములచే రోగగ్రస్తులగుచున్నారు! మిమ్ము రోగు లనువారెవ్వరు?—రోగము మిమ్ముల నేమి చేయఁగలదు? రోగమును దృణీకరింపుఁడు!..."వీర్యమసి వీర్యం, బలమసి బలం, ఓజోఽసి ఓజో, సహోఽసి సహో మయి ధేహి"—"నీవే వీర్యము, నాకు వీర్యము నిమ్ము; నీవే బలము, నాకు బలము కలిగింపుము; నీవే సహనము, నాకు సహనము గలుగఁజేయుము!" మీరు పూజచేయునపు డాసన ప్రతిష్ఠ ("ఆత్మానమచ్ఛిద్రం భావయేత్"—తాను సుస్థిరుఁడనను సంకల్పముతోఁ గూడుకొనియుండు క్రియ) నాచరింతురుగదా—దాని యభిప్రాయమేమి? "సమస్తము నాలో నున్నది, ఇచ్ఛామాత్రమున దానిని వ్యక్తముచేయఁగలను" అని ప్రకటింపుఁడు. అఖండాత్మస్వరూపులగు (ఫలాని) వారు

శోకపీడితులగు టెట్లు ?—అని మననము చేయుఁడు. క్రమము తప్పక కొన్నిదినములపాటు— ప్రతిదినము రెండుగంటల చొప్పున—ఇట్లు మననముచేయుచు వచ్చినయెడల నే వ్యాధియైనను సరియే మటుమాయ మగును.

—సదా మీ వివేకానందుఁడు.

(53)

(అమెరికా సంయుక్తరాష్ట్రములు), 27-9-1894.

స్నేహాస్పద—,...నా యుపన్యాసములతోడను వచనములతోడను గలకత్తాలోఁ బ్రకటింపఁబడుచున్న పుస్తకములలో నాకొక సంగతి కనిపించుచున్నది, అందుఁ గొన్ని రాజకీయభావగర్భితములని తోఁచురీతిని ముద్రితమగుచున్నవి; రాజ్యతంత్రముతోఁగాని, రాజకీయాందోళనముతోఁగాని నాకు లేశమును సంబంధము లేదు. నేను లక్షించునది పరమార్థ మొక్కటియే—అది సరిగానున్నయెడల మిగిలిన వన్నియు న్యాయముగనే చక్కఁబడును—నా వ్రాఁతలకుఁగాని, వచనములకుఁగాని రాజకీయాభిప్రాయములను ముడిపెట్టవలదని కలకత్తాజనులకు నీవు గట్టిగాఁ జెప్పవలసియున్నది. నేనొక రాజకీయ ప్రతినిధినని క్రైస్తవప్రచారకుల కుపన్యసించుచు, Reverend కాళీచరణ బెనర్జీ చెప్పెనని వింటిని. ఏమి యర్థరహిత ప్రలాపము!...అతఁడు బహిరంగముగా నట్లు చెప్పినయెడల నే నెట్లు రాజకీయ ప్రతినిధినో బహిరంగముగా నే కలకత్తా పత్రికకైనను వ్రాసి యా బాబును ఋజువు చేయుమనుము; లేనిచోఁ దన మూర్ఖ

ప్రకటనము రద్దుచేసికొనుమని నామాటగాఁ జెప్పుము. ఇది వారి కుయుక్తి! సామాన్యముగాఁ క్రైస్తవప్రభుత్వము లన్నిటి యందును గానగు లోపములను గూర్చి న్యాయదృష్టితోఁ గొన్ని ఖండనలనుజేసి యున్నమాట నిజమే. అంతమాత్ర ముచే రాజకీయపు గొడవతో నాకు సంబంధమున్నదనియా యభిప్రాయము ? ఆ యుపన్యాసములనుండి కొన్ని ఘట్టము లను వేఱుగా ముద్రించి నేనొక రాజకీయప్రచారకుఁడనని చూపుట మహాఘనకార్యముగాఁ దలఁచువారికి, "పర మేశ్వరా! ఈ మిత్రులబారినుండి నన్నుఁ గాపాడుము" అని మొఱపెట్టెదను.

అవిచ్ఛిన్న మౌనమే నాయపవాదకులకు నా సమా ధానమని నా మిత్రులకుఁ జెప్పుము. "కుక్క కాటునకుఁ జెప్పు దెబ్బ" సామ్యముగా వారితో నేను వాదమునకు దిగిన పక్ష మున మనమును వారి స్థితికే దిగినవారమగుదుము. సత్యము స్వయంజ్యోతియనియు నా కొసము వా రెవ్వరితోడను వివా దమునకు దిగనక్కఱలేదనియుఁ దెలియఁజెప్పుము. వారింకను నేర్చుకోవలసిన విషయము లనేకములు గలవు, వారు కేవ లము పసిబిడ్డలు, సుఖస్వప్నములతో—వెఱ్ఱిమొఱ్ఱి యూహ లతో—నిండియున్నవి వారి బుఱ్ఱలు—బొడ్డుపచ్చ లాఱని కుఱ్ఱలుగదా వారు!

...అర్థరహితమైన యీ లౌకికజీవితముతో, పత్రికా ఘోషలతో, వర్ణనలతో నాప్రాణము విసివి వేసారినది. ఆహా! హిమాలయప్రశాంతి మఱల నాకెప్పుడు లభించునో కదా!—సదా మీ యాప్తుఁడు, —వివేకానందుఁడు.

(54)

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 29-9-1894.

...వత్సలారా! ధీరులారా! స్వార్థరహితులారా! మీ రందఱును జేయుచున్నపని చక్కఁగానున్నది. మిమ్ములను జూచి నేను గర్వించుచున్నాను.... ధైర్యము గలిగి యుండుము, నిరాశచెందకుము. శుభోదర్కమగు నిట్టి ప్రారంభస్థితిలో నీవు నిరాశ చెందినచో నవివేకి వనిపించుకొందువు.

మన కార్యక్షేత్రము భారతదేశము. మాతృదేశమును మేల్కొల్పఁ బూననిచో విదేశీయుల మెప్పువలని ప్రయోజనమేమి?... మనకుఁ బ్రబల కేంద్రస్థాన మొకటి యుండవలయును. అందుండి నలువైపులను మన యాశయములు వ్యాప్తినొందవలయును.... ఎన్నఁటికిని ధైర్యము వీడకుము. సమస్తము చక్కఁబడును. సంకల్పబలమున్నచోఁ బ్రపంచము నుఱ్ఱూఁత లూఁగింపవచ్చును.

కొందఱు యువకులు క్రైస్తవులగుచున్నందులకు నాయనా! నీవు విచారింప నక్కఱలేదు. ప్రస్తుత సాంఘిక బంధములలో—ముఖ్యముగా మదరాసున—వారు క్రైస్తవులుగాక మఱియేమి చేయఁగలరు? స్వాతంత్ర్యము లేనిదే యభివృద్ధి యెన్నఁటికిని గలుగనేరదు. మానసిక విషయమున మీ పూర్వులు సంపూర్ణ స్వాతంత్ర్యము నొసఁగినారు,—మతధర్మము లందుచే వికాసము నొందినవి. శారీరక విషయమున వారు బంధములు కల్పించినారు, సంఘ మందుచేఁ

బిట్టతల వేసినది. పాశ్చాత్య దేశములందలి పరిస్థితు లిందులకుఁ గేవలము భిన్నము. సాంఘికవిషయములందే స్వాతంత్ర్యము; మత విషయమున నేమియు లేదు. ఇపుడు ప్రాచ్యసంఘము నుండియే కాక, పాశ్చాత్య మతమునుండియు బంధములు సడలుచున్నవి.

ప్రతిజాతియందును ప్రత్యేకలక్షణములు గోచరించు చుండును. పారమార్థికదృష్టి, లేదా, అంతరనలోక నపరత్వము భారతీయులందును వైజ్ఞానికదృష్టి, లేదా, బాహ్యనలోకనపరత్వము పాశ్చాత్యులందును విలక్షణమై కాన్పించును. పరమార్థము నంతయుఁ బాశ్చాత్యులు సాంఘికవికాసమూలమునఁ బడయఁగోరుదురు; ప్రాచ్యులో, సమస్తసాంఘికశక్తులను బరమార్థమూలమునఁ జేపట్టఁదల తురు. హిందూసంఘమును సంస్కరింపవలయునన్నచో, సనాతనధర్మమును నిర్మూలించుటకంటె మఱియొకమార్గము లేదని నవీన సంస్కర్తలకుఁ దోఁచుట కిదియే హేతువు. వారు ప్రయత్నించి విఫలులైనారు. ఎందువలన ? వారిలో నెవ్వరును స్వీయమతధర్మములెట్టివో పరిశీలింపకుండుటవలన —సమస్తమతధర్మములకును దల్లి యనఁదగు సనాతన ధర్మ తత్త్వమును గ్రహించుటకు వలయు శిక్షణమును బొందిన వ్యక్తి వీరిలో నొక్కఁడును లేకుండుటవలన. హిందూ సంఘమును బాగుపఱుచుట కెట్టి ధర్మవినాశనమును జేయ నక్కఱ లేదనియు నేఁటి సాంఘికదుఃస్థితికి మూలము మత ధర్మము లెంతమాత్రముఁ గావనియు వానిని సంఘమునకును వర్తింపఁ జేయకుండుటయే హేతువనియు నేను నొక్కి

వక్కాణింతును. ఇందలి ప్రత్యుత్తరమును మనవేదశాస్త్రములనుండి నిరూపింప సంసిద్ధుఁడనై యున్నాను. ఇదియే నాహితోపదేశము, దీనిని నిర్వహించుటకు మనము యావజ్జీవము, యావచ్ఛక్తితోడను బ్రయత్నింపవలసియున్నది. విషయము నవగాహన మొనర్చుకొనుటకుఁ జాల కాలము పట్టును. ఓరిమి వహించి పనిచేయుఁడు. "ఉద్ధరే దాత్మనాత్మానమ్ — తనవలననే తన్నుద్ధరించుకోవలయును."—

ఆప్తుఁడు, —వివేకానందుఁడు.

మఱియొకమాట. ఆముష్మిక చింతాసక్తులకును బారమార్థికులకును మాత్రమే నేఁటి హిందూసంఘమేర్పడి యున్నది,—తదితరులందఱును గంగ పాలుకావలసినదే. ఏల? ఐహికసౌఖ్యములను గాసంత యనుభవింపఁ గోరువారి గతి యేమి? మనమతమగు సనాతన ధర్మమునలెనే మనసంఘమును నెల్లరకును దావొసఁగవలయును. మన మతధర్మముల తత్త్వము నవగాహన చేసికొని పిమ్మట వానిని సంఘమున కనువర్తింపఁ జేయుటయే యీ కార్యమును గొనసాగించు మార్గము. నెమ్మదిగానయ్యును నిశ్చయముగా జరుగవలయు కార్యమిది. —వివేకానందుఁడు.

(55)

చికాగో, సెప్టెంబరు, 1894.

దివాన్ మహాశయా—దయతో మీరు హేల్ (G.W.Hale) ద్వార కభినందన లేఖ వ్రాసియుండుట నా కమితానంద దాయకము—వారియెడ నేను కృతజ్ఞతాబద్ధుఁడను. ఇంతవఱ

కీ దేశమున యాత్రలు చేయుచుఁ బ్రతివిషయమును గమనించు చున్నాను. ధర్మమనఁగాఁ—బరమార్థమనఁగా—నేమో గ్రహించిన దేశము ప్రపంచమున భారతదేశమొక్కటియే యని నా సిద్ధాంతము; సందేహము లుండుఁగాక, నైతికముగను పారమార్థికముగను నితర జాతులన్నిటికంటెను హిందువులు కోటిరెట్లు ఘనులని నానిశ్చయము; స్వార్థరహితులగు భారతపుత్రులందఱును శ్రద్ధవహించి తగుకీర్తిని బ్రయత్నించువో, పాశ్చాత్య తీవ్రకార్యదక్షతను భారతీయ ప్రశాంతి సందీపిత సుగుణములతో మేళవించుటచే లోకమునఁ బరమోత్కృష్టులగు వ్యక్తులు వెలువడఁగలరని నా నమ్మకము....

—విశ్వసనీయుఁడు, వివేకానందుఁడు.

(56)

బాల్టిమోరు సంయుక్తరాష్ట్రములు, 23-10-1894.

స్నేహాస్పద—,...మన జీవితోద్దేశ్యము లోక హితాచరణమే కాని లోకులవలని యభినందనము కాదు... ఆతని ప్రాపునొందినవారి కైశ్వర్యమేమి, సుగుణములేమి, స్వాతంత్ర్యమేమి—సమస్తము కరతలామలకమగును.... మా భీః మా భీః—ధైర్యముబూనుఁడు! క్రమముగా సర్వము సిద్ధించును. అంతఃకలహములను గక్షలను బురికొల్పుట, ఆత్మశ్లాఘనము, ఒరులను జూచి యసూయపడుటయునను నీ మూటిని మీరందఱును శాశ్వతముగా విసర్జింపవలయును. భూమాతవలె మీరు క్షమాపూర్ణులైయుండవలయును. ఇది

మీరు సాధించుచో, ముజ్జగములును మీకుఁ బాదాక్రాంత మగును.

...గురుదేవుని జన్మదినోత్సవములలో నైహికమగు నన్నదానాదులను దగ్గించి, యందులకు బదులు ధీవికాసము నొనఁగూర్చు నాధ్యాత్మిక తత్త్వబోధలను విశేషముగాఁ జేయఁ బ్రయత్నింపుఁడు.... —వివేకానందుఁడు.

(57)

వాషింగ్టన్, 27-10-1894.

స్నేహాస్పద—,...భారతదేశమున నేనేమి చేయువాఁడనో యిక్కడను నదే చేయుచున్నాను. కార్యసిద్ధికై సదా భగవంతునిపై నిర్భరపడుటయేగాని ముందుఁగా వ్యూహములు పన్నుట నాపద్ధతికాదు...మఱియు నీ దేశములో నేను విధివిరామము లనునవి లేకుండఁ బనిచేయవలసియున్న దనియు నా భావములను గ్రంథరూపమున వెలువరించుటకు నాకు వ్యవధలేదనియు నీవు గుర్తింపవలసియున్నది. నిరంతర మైన యీ యొత్తిడివలన నా నాడులు బలహీనమగు చున్నవి—ఇది నా యనుభవము. నానిమిత్తము నీవొనర్చిన స్వార్థరహిత వీరకృత్యములకుఁగాను నీయెడలను జెన్నపట్టణ ములోని నా మిత్రులందఱియెడలను నేనెంతటి కృతజ్ఞతా బద్ధుఁడనో తెలుపఁజాలను. నేను నిర్మాతనుగాను; ధ్యానము, విద్యావ్యాసంగము—ఇదియే నా సహజప్రవృత్తి. చేయఁ దగినంత కృషిచేసితిననియే తలఁతును. నేనిఁక విరామము నొందుచు, నాగురుదేవుని సన్నిధినుండి నావద్దకు వచ్చినవారి

కొకింత బోధింపవలసియున్నది. మీ శక్తిసామర్థ్యములను మీ రిపుడు గ్రహించితిరిగదా; చెన్నపురి యువకులారా! నిజముగా మీరే సర్వము నొనర్చితిరి, నేను నిమిత్త మాత్రుఁడను. నేను త్యాగిని, నాకు వలయు కార్యమొక్కటియే. అనాథల కన్నీటి నాఁపఁజాలని—వారల కడుపుఁ జిచ్చు చల్లార్పఁ బట్టెఁడన్నమును బెట్టఁజాలని—ధర్మమని నను దేవుఁడనినను నాకు నమ్మకము లేదు. ఎంత గొప్ప సిద్ధాంతములను బ్రకటించినను, ఎంత బ్రహ్మాండమైన వేదాంతమును జాటినను, పుస్తకములతోడను సిద్ధాంతములతోడను గూడుకొనియుండు ధర్మమును నేను ధర్మమనఁజాలను. కన్ను నుదుటనున్నదికాని నీఁపున లేదు. మా మతధర్మములని చెప్పుకొని మీరు గర్వించునట్టివాని నాచరణలోఁ జూపుఁడు, అగ్రసరులు కండు. భగవానుఁడు మిమ్మనుగ్రహించుఁగాక!

ఆత్మవిశ్వాసమును బూనుఁడు, నాపై నాశపెట్టుకొనకుఁడు. దేశమునఁ గొంత యుత్సాహమును బురికొల్ప నిమిత్తమాత్రుఁడనై నందుల కానందించుచున్నాను. దాని నూఁతగాఁగొని ముందంజవేయుఁడు, సమస్తము చక్కఁబడును. వత్సలారా! ప్రేమ మెన్నఁడును నిరర్థకము కాదు; నేఁడో, రేపో, శతాబ్దానంతరమో, సత్యము జయించి తీరును! ప్రేమయే విజయసింహాసన మధిష్ఠించును. మీ సోదర మానవులను మీరు ప్రేమింతురా? దేవు నెచట వెదకఁబోయెదరు? ఈ పేదలును, ఈ దీనులును, ఈ దుర్బలులును దైవస్వరూపులు కారా? ముందుఁగా వారినేల

యర్చింపరాదు? గంగానదీకూలమున నూతులు త్రవ్వనేల? ప్రేమ యఖండమహిమాన్వితమగు చింతామణియని నమ్ముఁడు. పేరుప్రతిష్ఠలనెడి యీ గాజుబొమ్మ నాసించువా రెవ్వరు? వార్తాపత్రికాఘోషను నేను గణుతింపను. నీకుఁ బ్రేమ కలదా? ఉన్నచో నఖండశక్తిమంతుఁడవు. నీవు స్వార్థరహితుఁడవేనా? ఐనచో హరిబ్రహ్మాదులైనను నిన్ను అడ్డుకోనఁజాలరు. ఎల్లెడలను శీలమే మహిమాన్వితము. సాగరగర్భముననున్నను దన బిడ్డలను బరమేశ్వరుఁడు కాపాడును. మీ దేశమునకు వీరులు కావలసియున్నారు; కావున వీరులు కండు!

ప్రతివ్యక్తియు నేను భారతదేశమునకు రావలయు నందురు. నేను వచ్చినపక్షమున మనము లోకమును మార్చి వేయ్యఁగలమని వారి యభిప్రాయము. నాయనా! వారు పొరపడుచున్నారు. నేఁటి యుత్సాహము కేవలము తాత్కాలికమైన దేశభక్త్యావేశము—అందులో నేమున్నది? అది నిజమైనదైనయెడల స్వల్పకాలముననే వందలకొలఁది వీరులు కార్యాంగణమున నుఱికి మన యుద్యమమును నిర్వహింతురు. కావున నిజముగా మీరే యంతయుఁ జేసితిరని గ్రహించి ముందంజవేయుఁడు. నాకోసము నిరీక్షింపకుఁడు. ఇచట బ్రహ్మాండమైన కార్యక్షేత్రమున్నది. ఈమతముతోఁ గాని, యేమతముతోఁగాని నాకేమి పని? నే నీశ్వర సేవకుఁడను, ఉత్తమాశయములను వ్యాప్తిచేయుటకై లోకమున నింతకంటె—ఈ దేశముకంటె ఉత్తమాంగణము మఱెచ్చట నున్నది? ఒకఁడు ప్రతికూలుఁడైనచో, వంద

మంది నాకుఁ దోడ్పడసంసిద్ధులై యున్న యీ దేశముకంటె —మానవుఁడు సోదరమానవునియెడ సానుభూతిజూపెడు నీ దేశముకంటె—స్త్రీలు సాక్షాద్దేవతలై యున్న యీ దేశము కంటె — నుత్తమకార్యక్షేత్రము మఱెచ్చట నున్నది? అంతయు నిజముగా శుభసూచకమైయున్నప్పుడు పరమ మూర్ఖులు సైతము స్తోత్రాలాపప్రియులై నడుముగట్టు కొందురు, పిఱికిపందలు సైత మపుడు భీములే!—కాని నిజమైన వీరుఁడు నిరాడంబరముగాఁ బనిచేయును. ఒక బుద్ధుఁడు లోకమున వెలయుటకుముం దెందఱు బుద్ధులు తమ జీవితముల నాహుతి యొనర్పవలసియుందురో! నాయనా! నాకు మాధవునియందును మానవునియందునుగూడ విశ్వా సము గలదు. దీనులకుఁ దోడ్పడుటయే పరమపురుషార్థ మని నా నమ్మకము. పరహితార్థము నరకానుభవమైనను నాకు సమ్మతమే. పాశ్చాత్యులను గుఱించియా నీవు చెప్పు చున్నావు!— నాకు వారు—శుద్ధసనాతనులగు క్రైస్తవులు సైతము—అన్నపానము లొసఁగిరి, ఆశ్రయము నొసఁగిరి, స్నేహము నొసఁగిరి, సంరక్షణ నొసఁగిరి! వారి మతాచా ర్యులలో నెవ్వరైనను హిందూదేశమునకు వచ్చినచో, మన వారు ఏమి చేయుదురు? వారిని దాఁకనైనను దాఁకరు.— 'వారు మ్లేచ్ఛులు!' నాయనా! ఏ మానవుఁడుగాని, యేజాతి గాని పరులను ద్వేషించి బ్రదుకఁజాలదు సుమీ! ఏనాఁడు మ్లేచ్ఛశబ్దమును సృజించి మనవా రితరులతో రాకపోకలను విరమించిరో ఆనాఁడే భారతదేశమునకు దౌర్భాగ్యము దాపరించినది. ఈ ద్వేషభావమును నిర్మూలించుటకై జాగ

రూకులగాఁడు! మిట్ట వేదాంతము చెప్పుట చాల సులభమే— మంచిదే—కాని యణుమాత్రమైనను వేదాంతము ననుష్ఠానమునఁ జూపుట మహాకష్టసాధ్యము!— ఆశీస్సులు.—సదా

—నీ వివేకానందుఁడు.

మఱియొక మాట. అధికారవాంఛ, అసూయయునను నీ రెంటినిగూర్చియు జాగరూకుఁడవు కమ్ము. సదా ఆత్మ విశ్వాసమును బూనుము. —వివేకానందుఁడు.

(58)

షికాగో, 15-11-1894.

దివాన్ మహాశయా—...ప్రపంచమందలి యితర జాతులతో సంబంధమనునది లేక, యొంటరిగా నుండుటయే మన క్షీణదశకుఁ గారణము, విశ్వవాహినియం దితర జాతులతోఁ గలిసి పయనించుటయే మనకుఁ దరణోపాయము. సంచలనమే ప్రాణలక్షణము. అమెరికా యద్భుతమైన దేశము, పేదలకును స్త్రీలకును భూతలస్వర్గము. ఈ దేశమునఁ బేదఱిక మనునది లేనేలేదని చెప్పవచ్చును, మఱియు లోకమున మఱెక్కడను నింతటి స్వాతంత్రలును విదుషీమణులును విజ్ఞానసంపన్నలునగు స్త్రీలు లేరు. సంఘమున సర్వకార్యములందును వారిదే ప్రధానస్థానము.

...నావంటి యొక సన్న్యాసి యీ యమెరికా దేశమున నెందుల కుండవలయునో మీరు బోధపడక పోవచ్చును, కాని నే నుండవలసివచ్చుటచేత నేయున్నాను. ప్రపంచము మన నామరూపములను గుర్తింపవలయుననుటకు

మన సనాతనధర్మ మొక్కటియే మనకుఁగల యధికారము, యోగ్యత; భారత దేశ మింకను నశింపలేదని లోకమందలి యితర జాతులకుఁ దెలియఁజేయుటకుఁగాను మన ధార్మికోత్తములను బాహాటముగా బయటికిఁ బంపవలసియున్నది.

భారతీయులు మృగప్రాయులు కారని తెలుపుట కైనను భారతదేశమునుండి తగిన వ్యక్తులు కొందఱు బయలుదేఱి ప్రపంచమందలి నానాదేశములకును వెడలవలసియున్నది. ఇంటిపట్టుననున్న మీకు దీనియావశ్యకత గోచరింపకపోవచ్చును, కాని నమ్ముఁడు, నామాట,— మీ జాతీయాభ్యుదయము దీనిమీఁదనే విశేషమాధారపడియున్నది. సోదరమానవశ్రేయమునుగూర్చి తలపోయని సన్న్యాసి పశుప్రాయుఁడుకాని సన్న్యాసికాఁడు.

నేను కేవల మిచటి వింతలను జూడవచ్చిన వాఁడను గాను, పనిలేని పాంథుఁడనుగాను; ఈ కంటికి ఱెప్పలు దూరముకానిదో నంతయు మీకుఁ ద్వరలోనే వెల్లడి కాఁగలదు, అపుడు మీరు యావజ్జీవము నన్ను దీవింతురు.

మతమహాసభలో మాటాడినాను—నా మాటలను సభ్యులెట్లు వినిరో మీకుఁ దెలియుటకిచట సిద్ధముగానున్న వార్తాపత్రికలనుండి క్రోడీకరింపఁగలను. నేను గర్వితుఁడను గానక్కఱలేదు, కాని నాయందలి మీ ప్రేమానురాగముల నెంచి నే నీవిషయమును మీకు వెల్లడింపక తప్పదు: ఏ హిందువుఁడు నమెరికా నట్లాకర్షింపలేదు. విశేష నాగరికతఁ జెందిన దేశములు సైతము పాదాక్రాంతమై

యెవ్వరియొద్ద నీతి ధర్మములను నేర్వఁదగునో యట్టి వ్యక్తులను నేఁటికిని భారతదేశము ప్రాదుర్భవింపఁజేయుచున్నదని యమెరికా దేశీయులకు విదితమైనది—వేఱేమియుఁ గానిచో నిది యీ నాగాశవలనఁ గలిగిన ఫలము. భారతీయులు తమ సన్న్యాసి నింతదూరము పంపుట యుక్తి యుక్తమేయని దీనివలననైనను మీరు తలఁపరా?...

పత్రికలనుండి నేను గ్రోడీకరించు విషయములివి:—
"సంగ్రహముగు నుపన్యాసములలో ననేకము వక్తృత్వమును బ్రదర్శించినను మతమహాసభోద్దేశ్యమును దాని లోఁతుపాఁతులను గూర్చి హిందూమతాచార్యునంతటి చక్కఁగా నుపన్యసించిన వక్త మఱియొకఁడు లేఁడు. ఆతని యుపన్యాసమును సమగ్రముగాఁ బ్రకటింతును, కాని సభ్యుల హృదయము నదియెట్టులు వశము నర్చుకొనెనో కేవలము సూచించి విడుతును, ఏలన నాతఁడీశ్వరప్రేరిత మహావక్త; ధైర్య స్థైర్యములును వివేకమును రూపొందిన యాతని వదనమును వదనమునకు మర్యాదనొసఁగు నాతని కాషాయాంబరములును మనోజ్ఞమైయొప్ప, మనఃపూర్వకములగు నాతని మృదుమధురవచనములు సభ్యులను దన్మయతనొందించెను."
(ఇట నుపన్యాసము పూర్తిగానుదాహరింపఁ బడినది.)
న్యూయార్కు క్రిటిక్.

"స్వామి పరిజ్ఞానము, వక్తృత్వము, నాతని మనోహరమూర్తియు, హైందవ నాగరికతనుగూర్చి మనకు నూతనాభిప్రాయము నొసఁగినవి. ప్రతిభావిలసితమగు నాతని

మనోహరవదనమును మధురగంభీరస్వరమును శ్రోతలను ముగ్ధులనొనర్ప మన సమాజములందును ప్రార్థనాలయము లందును స్వామి బోధించుచుండినకతన స్వామిమతధర్మములు మనకుఁ బరిచితములైనవి. వ్రాతమూలకమగు నేయాధార మునులేకయే యఖండచాతురితో, విశ్వసనీయమగు సద్భావముతో, హృదయోత్తేజకమగు వచఃపాటవముతో నాతఁడు తనయుపన్యాసవిషయములను దనసిద్ధాంతములను బ్రకటించును.''
న్యూయార్క్ క్రిటిక్.

''విశ్వమతమహాసభలో వివేకానందుఁ డగ్రగణ్యుఁ డనుట నిస్సంశయము. అతనిప్రవచనములను వినినవెనుక, నట్టివిద్వజ్జననిలయమగు భారతదేశమునకు మన క్రైస్తవ మతబోధకులను బంపు టెంతటి యవివేకమో గ్రహించితిమి.'' న్యూయార్క్ హెరాల్డ్. (ఇచటిప్రతికలలో నిది యగ్రగణ్యము.)

మీరు నన్ను గర్వితునిగా నెంచవచ్చునను భయమున నింతటితో విరమించుచున్నాను; లోక మెట్లునడచుచున్నదో గమనింపక, యించుమించు కూపస్థమండూకములై యున్న మీకీసంగతులను నేను దెలుపవలసివచ్చినది. వ్యక్తిగతముగా మిమ్ముఁగాక, సర్వసాధారణముగా మనసంఘము నుద్దేశించుచున్నాను—స్వయముగా మీరుదారహృదయులను సంగతి నాకుఁ దెలియును.

భారతదేశములో నేనెట్లుంటినో యిక్కడను నట్లే యున్నాను,—కాని కల భేదమిది: ఈ యుత్తమ సంస్కృతిగల

యీ దేశములో గుణగ్రహణము, సానుభూతియు ననునవి కలవు—మనమూర్ఖులలో నివి కంచుకాగడాలు పెట్టి వెదకి నను గాన్పింపవు. మాబోటి సన్న్యాసులకుఁ బిడికెఁడన్నము బెట్టుటకై యచటి మనవారు సణుగుకొందురే! ఇచ్చటనో, ఒక చిన్నయుపన్యాసమునకై వేయిరూపాయిలైన నిచ్చుటకు వెనుదీయరు. మఱియుఁ దమ కొనర్పఁబడిన బోధలకై యావజ్జీవము కృతజ్ఞులై యుందురు. చూచితిరా, తేడా?

భారత దేశమున మనవారికంటె విశేష మీ విదేశీయులే నాబోధల నవగాహనచేసికొని కొనియాడుచున్నారు. తలఁచినచో యావజ్జీవము నేనిచట భోగసాగరమునఁ దేలియాడఁగలను, కాని నేను సన్న్యాసిని; "మీయం దెన్ని దోసఁగులున్నను, ఓ భారతీయులారా! మీరు నాకుఁ బ్రేమపాత్రులే." కావునఁ గొలఁది నెలలలో నేను వచ్చుచున్నాను. (గుణగ్రహణము, కృతజ్ఞతయు ననునవి యెట్టివో మన జనులకుఁ దెలియకున్నను సరియే) నేనింతవఱకును జేయుచున్నరీతిని బ్రతిపట్టణమునను మతధర్మవికాసములను వ్యాప్తి చేయ నారంభింతును.

విదేశీయుఁడను, అన్యమతస్థుఁడను నగు నాయెడ నమెరికాజనులు చూపుచున్న యాదరణతో, సానుభూతితో, గౌరవముతో, వారు నాకొనరించుచున్న తోడ్పాటుతో మన దేశీయుల నీచ—స్వార్థభూయిష్ఠ—జ్ఞానవిహీన—కృతఘ్నతను బోల్చిచూచినచో నాదేశీయులను జూచి నేను సిగ్గుపడవలసియున్నది. కావున దేశమునుండి యీవలకు

వచ్చి యితరులను జూడుఁడు, చూచి వ్యత్యాసమును గ్రహింపుఁడు.

నేను గ్రోడీకరించిన విషయములను జూచినపిమ్మట నైనను నమెరికా దేశమున నొక సన్న్యాసిని బంపుట సమంజసమేయని మీకుఁ దోఁచుట లేదా?

దీనిని బ్రకటింపఁబోకుఁడు. పరమనీచమైన యీ పేరుప్రతిష్ఠలనిన నాకు రోఁత—భారత దేశమున వాని నె న్లొవగించుకొనువాఁడనో మీకుఁ దెలియునుగదా.

భగవత్కార్యమును జేయుచున్నాను, భగవంతుఁ డెట్లు నడపునో యట్లునడతును. "మూకం కరోతి వాచాలమ్," ఇత్యాది. మూఁగవాని నెవ్వఁడు మహావక్తను జేయునో, కుంటివాని నెవ్వఁడు గిరిని దాఁటించునో యాభగవంతుఁడే నాకుఁ దోడ్పడును. నరునిసాయమును నేను లక్ష్యింపను. భారత దేశమున, అమెరికా దేశమున, వేయేల, తగునని వానికిఁ దోఁచినచో, నుత్తరధ్రువమున నాకుఁ దోడ్పడ భగవంతుఁడు సంసిద్ధుఁడై యున్నాఁడు. భగవంతుఁడు సాయముచేయనిచో, లోకమున మఱెవ్వరును సాయము చేయఁజాలరు. సదా భగవంతునకు జయము! ఆశీర్వాదకుఁడు,

—వివేకానందుఁడు.

(59)

షికాగో, నవంబరు, 1894.

దివాన్ మహాశయా,—మీ లేఖ నాకమిత సంతోష ప్రదమైనది. మీ హాస్యము నాకర్థమైనది, కాని పరిహాస

వాక్కులతోఁ ద్రోసివేయఁబడుటకు నేను బసిబిడ్డనుగాను. విశేషములు కలవు, అవి యుండు.

సంఘీభావశక్తి—సంఘీకరణశక్తి—ఇదియే పాశ్చాత్య విజయకీలకము; ఒండొరులయెడ నమ్మకము, ఒండొరుల తోడ్పాటు—అనునవి లేనిదే యివి యున్నంతకును సాధ్యము కానేరదు....

ఎవ్వఁడైన నభివృద్ధిఁ గాంచఁ బ్రయత్నించుచో, నిచట వారికి సాయము చేయుటకై ప్రతివ్యక్తియు ముందంజవేయును. హిందూదేశమున, మీరు మన (హిందూ) పత్రికలలో దేనిలోనైనను నన్నుగుఱించి రేపు నాలుగు మంచిమాటలను—రవంత ప్రశంసను—జేయుదురనుకొనుఁడు, మఱునాఁడు నామీఁద నందఱును దండెత్తరా? ఎందుచేత? అది బానిసల నైజము కావున, తమలో—తమసోదరులలో—నెవ్వఁడైనను గాసంత తలయెత్తుకొని మసలుచుండుట చూచినంతనే కన్నులలో నిప్పులు పోసికొందురే!... అట్టివారిని స్వాతంత్ర్యమునకు—స్వయంసాహాయ్యమునకు—సోదరప్రేమకు—నిలయములగు నమెరికానూతనపుత్రులతోఁ బోల్చుటయా! సిగ్గు, సిగ్గు!! అమెరికా సంయుక్తరాష్ట్రములలో నిటీవల బంధవిముక్తులైన నీగ్రోబానిసలకు మనవారు సరివత్తురు. ఏల? అమెరికాలో దక్షిణభాగమున రెండుకోట్ల మంది బానిస లిటీవల విముక్తులైనారు. ఐననేమి?—వ్రేళ్లపై లెక్కింపఁదగిన కొలఁదిమంది తెల్లవారు వారి ప్రాణముల నింకను హస్తగతము చేసికొనియున్నారు. కారణము?

శాసనప్రకారము తమకెన్నిహక్కులున్నను, ఈ బానిసలను విడిపించుటకై సోదరులు తమలోఁ దాము రక్తపాతము చేసికొనవలసివచ్చుటకుఁ గారణమేమి? (నీగ్రో బానిసల) ఓర్వలేనితనము—మఱియొకటి కాదు, ఇదియే దోషము—తమ సోదరుఁడగునొక నీగ్రో కాసంత ముందునకు వచ్చుచున్నాఁడనుకొనుఁడు, ఒకరి మెప్పుపొందుచున్నాఁడనుకొనుఁడు; మిగిలిన నీగ్రోలందఱును వానిపై యుద్ధమునకు సిద్ధము. వానిని దిగఁద్రొక్కుటకై వెంటనే యీ నీగ్రోలు తెల్లవారితో నేకమగుదురు. హిందూదేశమునుండి మీరీవలకు వచ్చిననేకాని యీ సంగతులు మీకు బోధపడవు. దీనులగతి యేమని ధనికులు, నధికారవంతులును జింతింపరు. వారికంతయుఁ జక్కఁగ నేయున్నట్లు కనఁబడును. కాని నిమ్న జాతుల కష్టార్జితమూలమున—కోట్లకొలఁది పేదలు ధారపోయు గుండెనెత్తురు మూలమున—తాము భోగులును విద్యావంతులునై వారిని గ్రేగంటనైనను జూడకుండు వారందఱును దేశద్రోహులని నేను వక్కాణింతును. మీ ధనికులును మీజమీందారులును మీ ప్రభువులును నెక్కడ, మీ దేశచరిత్రలో నేనాఁడు, పేదలనుగణించి తలపెట్టిరో చెప్పుఁడు! పేదల నధఃపాతాళమునకుఁ ద్రొక్కికదా, తాము పైకివచ్చినది! వారి రక్తమాంసములను బీల్చి పిప్పిచేసి కదా, తా మధికారము సంపాదించినది!

కాని పరమేశ్వరుని కనుమూయఁగల వారెవ్వరు? ఇప్పుడో, మఱియొకప్పుడో, ఎవ్వరైనను బాపఫలమనుభ

వింపకతప్పునా? ఎవ్వరు పేదలరక్తమాంసములను బీల్చి పిప్పి చేసిరో, వారికష్టార్జితముచేఁ దాము విద్యావంతులైరో, వారిని బరమదరిద్రులను జేసి తామధికారపదవుల నధిష్ఠించిరో—వారే తిరిగి వేనవేలమందిచే బానిసలుగా విక్రయింపఁబడిరి, వారి భార్యాపుత్రికలు మానభంగమునకు గుఱియైరి, వేయేండ్లనుండియు వారియాస్తులు దోఁచుకోఁబడుచున్నవి—ఇది యంతయు నిష్కారణముగా జరుగుచున్నదనియా మీ యభిప్రాయము?

భారతీయులందుఁ బేదలలో నంతమంది యెందుచే మహమ్మదీయులైనారు? ఖడ్గభయమున వారు మతాంతరులైరను టర్థరహితము...జమీందారుల దుండగముల నుండియు...మతాచార్యులనఁబడువారి నిర్బంధమునుండియు విముక్తినొందుటకై వారు మతాంతరులైరి. కావుననే వంగదేశమున వ్యవసాయదారులలో హిందువులకంటె మహమ్మదీయులు హెచ్చుగానున్నారు—జమీందారులచట విశేషముగా నుండిరికదా. ఈ యధఃకృతసోదరకోటి నుద్ధరింపఁ దలఁచువారెవ్వరు? సమాజమనునది యల్పసంఖ్యాకులగు నాంగ్లవిద్యాధికులచేఁగాని, ధనికులచేఁగాని యేర్పడునది కాదే! అవకాశములు మనకుఁ దక్కువగానున్నవనుటకు సందియము లేదు, కాని ముప్పదికోట్లజనుల కన్నవస్త్రములను సమకూర్చి, వారిని సుఖపెట్టుటకు—ఏల, భోగులనుజేయుటకు వలసినంత యవకాశము లేకపోలేదు. మనలో నూటికిఁ దొంబదిమంది విద్యావిహీనులయ్యె—కాని యీసంగతి

యెవరికిఁ గావలయును? దేశభక్తులనఁబడు మన యీ బాబులలో * నెవరికిఁ గావలయును?

నా మాట వినుఁడు—భగవంతుఁడనువాఁడు—విధాతయనువాఁడు—కలఁడు. విధాతయే మనమనుగడను నియమించుచున్నాఁడు. తమకు హితమొనర్పఁబూనువ్యక్తిని బానిసలు తప్పక హింసింపఁబూనుదురని నాకుఁ దెలియును. కాని లోకహితకార్యములయెడ నిజమైన సానుభూతిగలవారిలో నొకరగు మీరు—నిష్కపటులు, ఉదారులు, ఋజుమార్గవర్తనులునని నే నెఱింగిన మీరు—

"తమసో మా జ్యోతిర్గమయ."

(అజ్ఞానాంధకారమునుండి మమ్ము జ్ఞానతేజోమార్గమున నడపుము) అని భగవంతుని ప్రార్థింతురుగాక!

లోకు లేమనుకొనిననేమి? నా యిష్టదైవమును నా ధర్మమును నా దేశమును, విశేషము, పేదభిక్షుకుఁడనగు నన్ను—నేఁ ప్రేమించుకొందును. అజ్ఞుల, నధఃకృతులను, బేదలను నేఁ ప్రేమింతును. వారికై పరితపింతును. నాపరితాప మెట్టిదో పరమేశ్వరుని కెఱుక. లోకులు నన్ను దూషించినను భూషించినను సరియే, అది నాకుఁ దృణప్రాయము. వారిలో ననేకులనుగూర్చి యజ్ఞులనియు నర్భకులనియుఁ దలఁతును— సానుభూతితత్త్వమును—ప్రేమమయాత్మతత్త్వమును— వా రరసినవారుకారు.

---

* వంగదేశమున 'బాబు' అనుపదము వ్యక్తినామమునకు ముందుఁగాని వెనుకఁగాని చేర్పఁబడు గౌరవవాచకము.

రామకృష్ణుని యనుగ్రహమున నాకిది యవగతమైనది—ఈపరిజ్ఞానము లభించినది. నా యల్పబృందముతో—నావలెనే భిక్షుకులగు వారలతోఁ—కృషి చేయఁ బ్రయత్నించుచున్నాను. మీరు వారిని జూచియున్నారు కదా. ఐనను పేదలే, వినయవిధేయులే సర్వదా భగవత్కార్యముల నొనర్చియున్నారు. గురువిశ్వాసము, ఆత్మవిశ్వాసము, భగవద్విశ్వాసమును గలిగియుందునట్లు నన్నాశీర్వదింపుఁడు.

ప్రేమయు సానుభూతియునే యున్నతికైనను మనకుఁ దరఁగుపాయము. ప్రేమయే యారాధన.

మీకును భవదీయులకును సదా, సర్వదా భగవంతుఁడు తోడ్పడుఁగాక! ఆశీర్వచనములు.

—వివేకానందుఁడు.

*(60)*

న్యూయార్కు, 18-11-1894.

మహాశయ,—కలకత్తా పురమందిర సభాతీర్మానముల తోడను బౌరసోదరులు నన్నుద్దేశించి వ్రాసిన ప్రేమమయవాక్కులతోడను గూడిన యభినందనలేఖ నందుకొంటిని.

మహాశయా! నా యల్పసేవలను మీరు గణుతించినందులకు నా హృదయపూర్వక కృతజ్ఞతను గ్రహింప వేఁడెదను.

వ్యక్తిగానిండు, సంఘముగానిండు, ఇతరులతో, నితరసంఘములతో, సంబంధము వీడి, యేకాకియై మనఁ

జాలదని నా నిశ్చితాభిప్రాయము; తాము గొప్పవారమని కాని, యది యొక మహానీతియని కాని, దురభిప్రాయమున నెవ్వరైనను నటులొంటరిగానుండఁ బ్రయత్నించినపుడెల్ల మహోపద్రవము సంభవించితీరినది.

అన్యులయెడ ద్వేషభావమను పునాదిపై దేశాచారమను గోడను దనచుట్టును గట్టుకొనుటయే భారతజాతిపతనమునకు ముఖ్యకారణమని నాకుఁ దోఁచుచున్నది. చుట్టుపట్లనున్న బౌద్ధజాతులతో సంపర్కము లేకుండుటకే భారతీయు లీ గోడను గట్టుకొనిరని నా నమ్మకము.

ప్రాచీనమైనదిగానిండు, నవీనమైనదిగానిండు, ఏ కృతకాంబరముచే—నే కుతర్కముచేఁ—గప్పిపుచ్చినను విధివిహితమైన ఫలితమిది: ప్రాచీనజాతులలో నగ్రగణ్యమై మించినజాతి నేఁడు ప్రపంచమంతటిచేతను నీసడింపఁబడుచున్నది, ఇంతటి క్షుద్రజాతి లేదనిపించుకొన్నది. దీనివలన ఋజువగుచున్నదేమి? ఏ జాతియు, నే వ్యక్తియుఁ దాను బతనమునొందని దే పరులను ద్వేషింపఁజాలదని యొకదా! ఏ ధర్మమును మొట్టమొదట మనపూర్వులు వివేచించి కనుఁగొనిరో, ఆ ధర్మము నుల్లంఘించుటచేఁ గలుగు దుష్ఫలమునకు మనమే లోకమునకుఁ బ్రత్యక్షనిదర్శనములము.

దానము, ప్రతిగ్రహము—ఇదియే నియతి. భారతజాతి పునరుద్ధారణ నందవలయునన్నచో, విధిగాఁ దన రత్నరాసులను వెలికిఁ గొనివచ్చి శూహాటముగాఁ బ్రపంచజాతులకందఁజేయవలయును, తత్ప్రతిఫలమ్ముగా నితరు లేమియొసఁగె

దరో దానిని బరిగ్రహింప సంసిద్ధముకావలయును. జీవన మనఁగా నేమి?—విశ్వాసము, ప్రేమ. మరణమనఁగా నేమి?—సంకోచము, ద్వేషము. ఇతరజాతుల నేనాఁడు ద్వేషింప మొదలిడితిమో, ఆనాఁడే మనక్షీణదశ—అవసానదశ—ప్రారంభమైనది; మఱల విశ్వాసముదెస—జీవనముదెస—దృష్టి సారింపనిచో, మన వినాశము నేదియు నిరోధింపఁజాలదు.

ప్రపంచజాతు లన్నిటితోడను మనము కలసి మెలసి వర్తింపనలయును. తా మనుభవింపక, యొరులకుఁ బెట్టక, స్వార్థపరాయణులై, కూపస్థమండూకములై, మూఢవిశ్వాస పరులై మను వందలకొలఁది వ్యక్తులకంటె విదేశయాత్ర చేయు వెడలు ప్రతి హిందువును దేశమునకు విశేషహిత మొనఁగూర్చినవాఁడగును....

ఒరులకు స్వాతంత్ర్యమీయ సిద్ధపడనివారు స్వయముగాఁ దాము స్వతంత్రులు కానర్హులా? ఒరులనుజూచి యూరక చిట్టుబుట్టుమనుటకుబదులు—మన శక్తిసామర్థ్యములను వ్యర్థముచేసికొనుటకుబదులు—నడుముగట్టుకొని పౌరుషవంతులమై శాంతముగాఁ బనిచేయుదముగాక. ఎవ్వఁడు దేనికర్హుఁడో దాని నాతఁడు పొందితీరును, లోకమున నేశక్తియు దీని నడ్డుకొనఁజాలదని నా నిశ్చయము. ప్రాచీన భారతవర్షము మహత్తరమైనదనుటకు సందియము లేదు, కాని భావిభారతవర్ష మింకను విశేష మహిమోపేతమై వెలయునని నా నిశ్చయము. సహననైర్మల్య శౌర్య

దీక్షులందు మహేశ్వరుఁడు మనలను సుస్థిరుల నొనర్చుఁగాక!
మీ స్నేహాస్పదుఁడు; —వివేకానందుఁడు.

*(61)*

న్యూయార్కు, 19-11-1894.

వత్సలారా, ధీరులారా,—కార్యదీక్షను బూని సంఘ కార్య క్రమమును సాగింపుఁడు. ప్రేమ, నిష్కాపట్యము, సహనము—ఇవియే మనకు వలయునవి. జీవనమనఁగా నేమి? వికాసము, ప్రేమ. కావున సమస్తమైన ప్రేమయు జీవనమే; ప్రేమయే జీవననియమము, స్వార్థపరత్వమే మరణము. ఇహమునందైనను బరమునందైనను నిదియే యథార్థము. సత్కార్యాచరణమే, పరహితాచరణమే, జీవనము—తదభావమే మరణము. మానవమాత్రులలోఁ—బశుప్రాయులలో—నూటికిఁ దొంబదిమంది జీవచ్ఛవములు, పిశాచములు—ఏలందురా, నాయనలారా! ప్రేమవిరహితులు జీవన్మృతులు. సానుభూతి గలిగి వర్తింపుఁడు: వత్సలారా, దీనులను, బేదలను, అజ్ఞులను, అధఃకృతులనుగూర్చి పరితపింపుఁడు—హృదయము స్తంభించుపర్యంతము, తల దిమ్మెక్కునంతవఱకు, చిత్తవిభ్రాంతి గలుగునాయని తోఁచునంతదనుక పరితపింపుఁడు. అపు డీశ్వరచరణోపాంతమున నాత్మసమర్పణము గావించుకొనుఁడు. శక్తిసామర్థ్యములును దోడ్పాటును అప్రతిహతబలమును నపుడు మీకు లభించును. ప్రయత్నము—కఠినప్రయత్నము—ఇదియే పదిసంవత్సరముల నుండి నేటివఱకు నా ప్రతిజ్ఞయైయున్నది. తీవ్రప్రయత్నము

చేయుమనియే యింకను నా యాత్మబోధ. మార్గ మగోచరమైయుండ, సర్వము నంధకారబంధురమై యుండఁ, బ్రయత్నింపుమనియే నేఁబలుకువాఁడను. వికాసము—తరణోపాయము—తోఁచనప్పుడును బ్రయత్నింపుమనియే నేఁ బలుకుదును. వత్సలారా! భయపడకుఁడు. కొండ విఱిగి మీఁదఁ బడునేమో యను భయదృక్కులతో, బేలచూపులతోఁ, జూచెదరేల? ఉండుఁడు, శాంతిని వహింపుఁడు! కొలఁదిగడియలలో నంతయు మీకుఁ బాదాక్రాంతమగును. పరికింపుఁడు, ధనమువలన నేమి ప్రయోజనము? పేరుప్రతిష్ఠలవలన నేమి ప్రయోజనము? పాండిత్యమువలన నేమి ప్రయోజనము? ప్రేమయే ఫలప్రదము; దుర్భేద్య కష్టపరంపరలనెడి పర్వతములను విదళించి రాజమార్గ మేర్పఱుచునది వజ్రాయుధతుల్యమగు శీలము.

మనము గమనింపవలసిన విషయమిది: స్వాతంత్ర్యము లేనిదే వికాసమనునది కలుగనేరదు. మనపూర్వులు మతవిషయములలో స్వాతంత్ర్యము నొసఁగిరి; తన్మూలమున నద్భుతమైన మతము మనకు లభించినది. కాని సమాజశరీరమును వారు శృంఖలములచే బంధించినారు—ఫలితమేమి? మనసమాజము రాక్షససమాజమైనది. పాశ్చాత్యదేశములందో, సమాజము సదా స్వాతంత్ర్యము ననుభవించుచున్నది—అందుచే ఆ సమాజ మెట్లు వికాసము నొందుచున్నదో చూడుఁడు. ఇఁక వారి మత మెట్లు సంకుచితమై పోవుచున్నదో గమనింపుఁడు.

ఎచట స్వాతంత్ర్యము లేదో, యచట వికాసమును లేదు. ఆలోచించుటకు, మాటాడుటకు, మానవున కెట్లు స్వాతంత్ర్యము కావలయునో అట్లే—పరుల కాతఁడు బాధ కలిగింపకుండునంతవఱకు—ఆహార వస్త్రధారణ వివాహ విషయములలో వానికి స్వాతంత్ర్యము వలయును.

ఐహికనాగరికతనుగూర్చి మన మేమేమో ప్రలాపించుచుందుము. ద్రాక్షపళ్లు పులుపన్నదఁట నక్క! మాట వరుస కామూర్ఖప్రలాపముల నన్నిటిని యథార్థమేయని యంగీకరించినను భారతదేశమం దంతటను నూకలక్షమంది నిజమైన పారమార్థికులుందురేమో. ఇఁక వీరిపారమార్థిక సాధనలకై ముప్పదికోట్లమంది జనులు నిరాహారులై, పశుప్రాయులై, తమస్సునఁ బడి తల్లడిల్లవలసినదేనా? ఎవ్వరైన నెందులకుఁ బస్తుపడియుండవలయును? మహమ్మదీయులచే హిందువులు జయింపఁబడు టెట్లు సంభవించినది? ఐహిక నాగరికతను హిందువు లెఱుఁగకుండుటచే సంభవించినది. కుట్టఁబడిన దుస్తులను గట్టుకొనుట మహమ్మదీయులు హిందువులకు నేర్పిరి. వీధులలోని ధూళితోఁ గలియకుండ తమ యాహారమును శుచిగా నెట్లు తినవలయునో మహమ్మదీయులు హిందువులకు నేర్పిన బాగుండెడిది! పేదలకుఁ బని కల్పించుటకై యైహికనాగరికత కాదు, భోగములుసైతమావశ్యకమని చెప్పెదను. అన్నము! అన్నము! ఈ లోకమున నాకు అన్నముపెట్టఁజాలక యెక్కడనో పరలోకమున శాశ్వతబ్రహ్మానందము నొసఁగఁబోయునను దేవునియందు నాకు నమ్మకము లేదు! ఇస్సీ! భారతదేశ ముద్ధరింపఁబడ

వలయును, పేదలకు అన్నము పెట్టవలయును, విద్యావ్యాప్తి చేయవలయును, మతాచార్యుల—పురోహితప్రభువుల—దుండగములను నిర్మూలింపవలయును. మతాచార్యులై తప మీకుఁ జెల్లదు, సాంఘిక నిరంకుశాధికారి మీకుఁ జెల్లదు! వలయునది ప్రతివ్యక్తికిని మఱికొంత కబళమన్నము, (అభ్యుదయమునకుఁగాను) మఱికొంత యవకాశము! ఆంగ్లేయులవద్ద నుండి మఱికొన్ని హక్కులను బొందు తలంపున మన "యువకమూర్ఖులు" సభలు చేయుచుందురు. వారు (ఆంగ్లేయులు) ఊరక నవ్వుచుందురు. ఇతరులకు స్వాతంత్ర్యము నీయ సంసిద్ధులుకానివారు స్వయముగాఁ దాము స్వాతంత్ర్యము నొందుట కెట్లర్హులు? మాటవరుస కాంగ్లేయులు మిమ్ము సమస్తాధికారములకును బట్టాభిషిక్తులను జేయుదురనుకొందము. చెప్పనేల? అధికారులగువారు జనసామాన్యమును గాలిక్రిందవేసి త్రొక్కుదురు. వారు జనసామాన్యమును స్వాతంత్ర్యము ననుభవింపనిత్తురా? బానిసలొరులను బానిసలను జేయుటకే యధికారము గోరుదురు.

ధర్మావశ్యకతను జూపుచు, సంఘమునకు స్వాతంత్ర్యమునొసఁగుచు, నీ మార్పును క్రమక్రమముగాఁ దీసికొని రావలయును. మతాచార్యకైతవమును మన సనాతన ధర్మమునుండి తొలఁగించితిరా, మహోత్కృష్టమగు ధర్మమేర్పడును. బోధపడినదా? భారతధర్మముతోఁగూడిన పాశ్చాత్యసంఘమును మీరు నిర్మింపఁగలరా? ఇది సాధ్యమే యనియు జరిగితీరుననియు నానమ్మకము....భారతదేశమునఁ గేంద్రస్థానమున నొక వలస నేర్పఱిచి, యందు స్వతం

త్రముగా మీరు మీ యాశయముల నవలంబించుట మహోత్తమవిధానము; తన్మూలమునఁ గ్రమముగా మీ యాశయము లెల్లెడను వ్యాపించును. ఇంతలో నొక కేంద్ర సంఘము నేర్పఱచి, శాఖోపశాఖలతోఁ గ్రమముగా దేశమంతటను వ్యాపింపుఁడు. ప్రస్తుతము మతధర్మములనే యాధారముగాఁ గొని యుద్యమము నారంభింపుఁడు. తీవ్రమైన యేసంఘ సంస్కారము నిపుడు బోధింపఁబోకుఁడు; ఐనను మూఢ విశ్వాసములను మాత్ర మనుమోదింపకుఁడు. శంకర రామానుజ చైతన్యాది పూర్వాచార్యులు చెప్పినరీతి నెల్లరకును ముక్తిని నెల్లరసమత్వమును నంగీకరించి సంఘము నుద్ధరింపఁబూనుఁడు.

కార్యదీక్షాదక్షులై (శాఖోపశాఖలతో) దేశమంతటను నలముకొనుఁడు. కృషి చేయుఁడు, తీవ్రకృషి చేయుడు. ఒరులను నడపునెడ సేవకభావము వహింపుఁడు, స్వార్థరహితులు కండు, ఏ యొక మిత్రుని నిందించు వాని మాటల నెన్నఁడును చెవి యొగ్గకుఁడు. తాలిమిని భూమాతనుబోలి వర్తింపుఁడు, అపుడు విజయము మిమ్ము వరించును...జాగ్రత! ఒరులను ''సాధింపఁ'' బోకుము—ఒరులపై నెన్నఁడును (అమెరికావారనునట్లు) లేనిపోని యధికారము చెలాయింపకుము—కట్టుపెత్తనము చేయకుము. ఎప్పుడును, నా లేఖలను నీ పేర వ్రాయుచుండుటచే నా యితరమిత్రులపై నీయాధిక్యము ప్రకటింపఁబోకుము, * నీ వట్టిమూర్ఖుఁడవు కాఁజాల

* ఈ లేఖ పలువురను సంబోధించుచున్నను నొకని పేరనే వ్రాయఁబడినదని పాఠకులు గమనింతురుగాక.

వని నేనెఱుఁగుదును, కాని నిన్ను హెచ్చరించుట నాధర్మ మనుకొందును. లేనిపోని యాధిక్యము చూపుటచే సంఘ మంతయు నశించును. కృషి చేయుఁడు, తీవ్రకృషి చేయుఁడు; పరహితార్థము కృషి చేయుటయేకదా జీవనము.

కౄరయనునది కూడదు, వంచనయనునది వలదు, కాపట్యమనునది పనికిరాదు. పరమేశ్వరుని మీఁదనే నే నెల్లప్పుడును నిర్భరపడియున్నాను, స్వయంజ్యోతి యగు సత్యముమీఁదనే సదా నే నాధారపడియున్నాను. పేరుప్రతి ష్ఠలనిమిత్తముగాని, తుదకుఁ బరహితార్థముగాని యాత్మ వంచకుఁడనై తినను వ్యాకులతతో, మనోమాలిన్యముతో, మరణింపకుందునుగాక. లవలేశమైన నవినీతి వలదు, దుస్తంత్ర మణు మాత్రమును బనికిరాదు.

'తటపటాయింపు' వలదు, 'గుప్తసాధనలును' గూఢ దుర్మార్గావలంబనములును నెంతమాత్రము కూడవు, రహ స్యముగా నొకమూల నక్కి, యేకార్యమును జేయరాదు. గురుదేవునియందుసైతమ మే ప్రత్యేకాభిమానము, నే పక్ష పాతమును వలదు. వత్సలారా! ధీరులారా! పురోగమన మొనర్పుఁడు. ధనము లభించుఁగాక, లభింపకపోఁగాక. మీకుఁ బ్రేమ కలదా? ఆస్తికబుద్ధి కలదా? ఉన్నచో మిమ్మడ్డఁజాలినవారు ముల్లోకములందును నుండరు. అగ్ర సరులుకండు, గమ్యమును బ్రాపింపుఁడు.

ఏమివైపరీత్యము! తాము నా విజయమునకు దారి చూపితిమనియు నానుకూల్యము గల్పించితిమనియు... తము

పత్రికలలో వ్రాసికొనుటయా! నిజమే!! అర్థరహిత ప్రలాపము! ... సమాజీమువారు డా-రి-జూ-పి-రి!!...

జాగ్రత! అసత్యమును మోసమునుగూర్చి మెలంకువగలిగి వర్తింపుఁడు, సత్యవ్రతులై యుండుఁడు—నెమ్మదిగానయ్యును నిశ్చయముగా మనము నెగ్గితీరుదుము. నేను లేనని భావించి పనిచేయుఁడు. మీలోఁ బ్రతివ్యక్తి మీఁదను గార్యభారమంతయుఁ గలదని భావించి పనిచేయుఁడు. ఏఁబది శతాబ్దములు మిమ్మవలోకించుచున్నవి, భారతభాగ్యోదయము మీపై నాధారపడియున్నది. అగ్రసరులుకండు! నే నెప్పుడు రాఁగలనో నాకుఁ దెలియదు. ఇది మహాక్షేత్రము. హిందూదేశీయులు కేవలము స్తుతిచేయవచ్చును, దేనికైనను వారొక దమ్మిడీసీయఁజాలరు; అదిగాక స్వయముగా యాచకులగు వారి కెక్కడనుండివచ్చును? మఱియు, లోకహితాచరణ సామర్థ్య మిరువది శతాబ్దములనుండి వారియందు లోపించియున్నది. జాతీయత, ప్రజాస్వామ్యము—మున్నగువానినిగూర్చి వారిప్పుడిప్పుడే నేర్చుకొనుచున్నారు. కావున వారిని నేను నిందింపనక్కఱ లేదు....ఆశీర్వాదములు. —మీ వివేకానందుఁడు.

(62)

30-11-1894.

స్నేహాస్పద—, మన మతసంస్థయందు వ్యవహారమునకు సంబంధించినంతవఱకు మన శక్తిసామర్థ్యముల నన్నిటిని వినియోగించి తగిన కట్టుపాట్లు నెలకొల్ప

వలయును ; కాని మతవిషయమున నే ప్రత్యేక శాఖా సంప్రదాయములను సృష్టింపకుండునట్లు మెలఁకువతో మెలఁగ వలయును....

ఏ పరమాదర్శములను సాధించుటకును బోధించుటకును శ్రీరామకృష్ణుఁ డవతరించెనో వానిని బ్రకటించుటకై యెవ్వరైన నాతని జీవితమును సరిగా వ్రాయఁగలిగిన పక్షమున వ్రాయనిండు, అంతేకాని యాతని జీవితోపదేశములను దికమక చేసి, యెవ్వరు నపార్థములు మాత్రము కల్పింపకుందురుగాక....అతని భక్తిజ్ఞానములను బ్రకటించుచు, సర్వమతములనుండియు నాతఁడు గ్రహించిన పరమధర్మములను గూర్చిన యాతని యుపదేశములను.... అనువదింపనిండు. విషయమిది. శ్రీరామకృష్ణుని జీవితము దివ్యజ్యోతి, తదీయ తేజః ప్రసారమున హిందూమత పరమావధినంతయు, సనాతనధర్మపరమాదర్శముల నన్నిటిని యథారూపమున గ్రహింపనగును. వేదశాస్త్రోక్త జ్ఞానమున కంతకును నాతఁడే ప్రత్యక్ష నిదర్శనము. ఋషులును నవతారమూర్తులును నిజముగా వేనిని బోధింపనెంచిరో యాతత్త్వములనన్నిటిని నీతఁడు తన జీవితమునఁ జూపెను. మతగ్రంథములు వాదమాత్రములు, ఈతఁడో, తదీయాచరణము, అనుభవము. ఈ పురుషుఁడు తన యేఁబదియేండ్లలోనే పంచసహస్రవర్ష పర్యంతమగు భారత జాతీయ పారమార్థిక జీవితమునంతను జీవించి, భావిజనసంతతి కాదర్శప్రాయుఁడై యొప్పెను. ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతమునునవి యాత్మవికాసమునఁ గ్రమావస్థలనెడి యాతని సిద్ధాంతమువలననే

వేదము లర్థవంతములగును, శాస్త్రములకు సమన్వయ మేర్పడును. అన్యమత సహనము నవలంబింపవలయు ననుటయేగాక, అన్యమతములును మోక్షమార్గము లేయని మనఃపూర్వకముగా నంగీకరింపవలయుననియు, సత్యమే సర్వధర్మములకును మూలాధారమనియు నాతని యుపదేశము. ఈ క్రమమున నత్యంతమనోజ్ఞము, హృదయోత్తేజకమునగు రీతిని యాతని జీవితమును వ్రాయనగును. ఐనను సర్వము సకాలమునఁ బ్రాప్తించును....ఒకరికై నిరీక్షింపక మీ కృషిని మీరు సాగింపుఁడు. "వండి వడ్డించిన పదార్థములను దినుటకై వచ్చికూర్చుండు వారనేకులు." జాగరూకతతో మీ యుద్యమమును సాగింపుఁడు. ఆశీస్సులు.

—సదా మీ వివేకానందుఁడు.

(63)

30-11-1894.

స్నేహాస్పద—,...శ్రీరామకృష్ణునిగూర్చి ప్రకటింపఁబడిన యద్భుతగాథలనుగూర్చి మీకు నేఁజేయు హితోపదేశమేమన—వానిని, వానిని వ్రాయు మూర్ఖులను మీదరికి రానీయకుఁడు. అవి వాస్తవములేయైనను నీ యవివేకు లన్నిటిని దలక్రిందులు చేయుదురని నానిశ్చయము. లోకమున కాతనిజ్ఞానబోధ యనంతమైయుండ. నిజముగా ననావశ్యక విషయములను, అద్భుతములను బట్టుకొని ప్రాఁకులాడ నేల? వానివలన బుజువగున దేమియు లేదే! జడమువలన నాత్మ నిరూపితము కాఁజాలదు. ఆత్మ యనుఁడు, పరమాత్మ

యనుఁడు, అమృతత్వమనుఁడు—వీని యునికికిని నీ యద్భుత సంఘటనములకును నేమియు సంబంధము లేదు....శ్రీరామకృష్ణుని తత్త్వమునుగూర్చియు నాతని వ్యక్తిత్వమును గూర్చియు బోధింపుము. నీ పిపాసను దీర్చిన యమృత భాండము నొరుల కందఁజేయుము. మిథ్యావేదాంతముచేఁ గలవరపడకుము, స్వమతదురభిమానముచే నొరులను గలవరపెట్టకు. ఆశీర్వచనములు. —సదా మీ వివేకానందుఁడు.

(64)

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 30-11-1894.

ఆయుష్మంతుఁడగు—, ముదావహమైన నీ లేఖ యిప్పుడే యందినది. శ్రీరామకృష్ణుని తత్త్వమును నీ వవగాహన చేసికొనుట నా కమిత సంతోషకరము. నీ దృఢవైరాగ్యమును గని యెంతయో యానందించుచున్నాను. భగవత్ప్రాప్తి కిట్టి వైరాగ్యము ముఖ్యావశ్యకము. చెన్నపురము సదా నా కాశాజనకమై యున్నది. భారతదేశమునంతను ముంచియెత్తు నాధ్యాత్మికతరంగము చెన్ననగరమునుండియే వెలువడునని నేఁటికిని నా దృఢవిశ్వాసము. ఈశ్వరానుగ్రహమున నీ సదాశయములు ఫలించుఁగాక! కాని నాయనా! ఇచటనే చిక్కులు. ఏ కార్యమైనను దొందరపడి చేయరాదు—ఇది మొట్టమొదట నీవు గమనింపఁదగిన విషయము. రెండవది మీ యమ్మయొక్కయు నీ భార్యయొక్కయు మనోభావములు నీకు సమాదరణీయములు. "శ్రీరామకృష్ణుని శిష్యులగు మీరు మీ తల్లిదండ్రుల భావముల నేమంత

పాటించితిరి?'' అని నీవు మమ్ముడుగుదువు కాఁబోలును, నిజమే. మహాత్యాగము వలననే మహాకార్యములు సాగునని నే నెఱుఁగుదును—నిస్సంశయముగా నెఱుఁగుదును. భారత మాత తన పుత్రులలో నుత్తమోత్తములు, మహాఘనులు నగు వారి త్యాగమును గోరుచున్నదని నే నెఱుఁగుదును, సందియము లేదు. అట్టివారిలో నొకఁడవగు భాగ్యము నందుదువుగాక యని మనఃపూర్వకముగా నాసించు చున్నాను.

మహాపురుషులు మహాత్యాగము చేయుచుండుటయు జనసామాన్యము వాని సత్ఫలముల ననుభవించుచుండుటయు లోకవిదితము. నీ మోక్షమునకుఁగాను నీవు సమస్తము త్యజించు టొక ఘనకార్యము కాదు. లోకకల్యాణార్థ మాత్మ మోక్షమును సైతము పరిత్యజింప నెంతువా? ఎంచెదవేని సాక్షాత్ భగవానుఁడవు—ఈ విషయము నాలోచింపుము. బ్రహ్మచర్యము నవలంబింపుము, ఇదియే నీకు నాహితోక్తి. నాయభిప్రాయమేమన, సమస్తవిషయసుఖములను విడనాడి, కొంతకాలమువఱకు నీతల్లిదండ్రులవద్ద నుండుము—ఇది ''కుటీచకావస్థ.'' జగద్ధితార్థము నీ మహాత్యాగమునకు నీభార్యను సమాధానపఱుపఁ బ్రయత్నింపుము. దృఢవిశ్వాసము, సర్వవిజయసమర్థమగు ప్రేమానురాగములు, అఖండ నైర్మల్యము—ఇవి నీ కలవడునేని, యచిరకాలముననే విజయోపేతుఁడవగుదు వనుటకు నాకినుమంతయు సందియము లేదు. శ్రీరామకృష్ణుని బోధనలను వ్యాప్తిచేయుటకు గాను నీ మనశ్శరీరములను ధారపోయుము, కర్మమేగదా

ప్రథమావస్థ. శ్రద్ధతో సంస్కృతము నభ్యసింపుము; భక్తి సాధనల నవలంబింపుము. నీవు గొప్ప యాచార్యుఁడవు కావలసియున్నది. "తన్నుదాఁ జంపుకొనుట కొకఛాకు చాలును, పరులను జంపుటకో, కత్తులును గతాలును గావలయును" అని నాగురుమహారాజు వచించువాఁడు. నీ వెపుడు సంసారమును వీడి యీ మహనీయుని పావననామ మును లోకమునకు బోధింపవలయునో సకాలమున నీ కవగత మగును. నీ సంకల్పము యోగ్యమైనది, పవిత్రమైనది. భగవ దనుగ్రహమున నది సిద్ధించుఁగాక. కాని తొందరపడి యే కార్యమును జేయరాదు. కర్మయోగ భక్తియోగములచే ముందుఁ బవిత్రుఁడవుకమ్ము. దీర్ఘకాలము భారతవర్ష మనేక బాధలఁ బాల్పడినది, ఐనను భగవంతుఁడు దయామయుఁడు. తన బిడ్డలకుఁ జేయూఁత నొసఁగుటకుఁగాను భగవంతుఁడు మఱల నవతరించినాఁడు, పతితభారతవర్షము పునరుద్ధారణ నొందుటకు మఱల నవకాశము లభించినది. శ్రీరామకృష్ణు నకుఁ బాదాక్రాంతమైననే కాని భారతదేశము పునరుద్ధారణ నందఁజాలదు. గురుదేవుని జీవితసందేశములు దేశదేశాంతర ములలో వ్యాప్తి నొందవలయును, హిందూసంఘమున నవి యస్థిగతము కావలయును. ఈ కార్యభారమును వహించు వారెవరు? శ్రీరామకృష్ణ పతాకమును గైకొని జగత్కల్యా ణార్థ మగ్రసరులగు వారెవ్వరు? పేరు ప్రతిష్ఠలను సిరిసంపద లను భోగభాగ్యములను, వేయేల, ఐహికాముష్మికములను సర్వము విడనాడి, దేశమునకు దాపరించిన యీయధోగతి నరికట్టు వారెవ్వరు? ఏకొలఁదిమంది యువకులో ఆత్మార్పణ

మొనరించినారు. వారు కేవలము వేళ్లమీఁద లెక్కింపఁదగి యున్నారు, అట్టివారు మనకు వేలకొలఁదిమంది కావలయును, వారు వచ్చి తీరుదురు. వారిలో నీవొకఁడవు కావలయునను వాంఛ భగవానుఁడు కలుగఁజేసియుండు టానందదాయకము. భగవత్కార్య నిమంత్రితులమగు టెంతటి భాగ్యము! అంధకారనిమగ్నమగు జనసహస్రమును బరంజ్యోతిస్సాన్నిధ్యము నొందింపవలయునను నీ యాశయ ముత్కృష్టము, నీ మనోనిశ్చయము నిశ్చయముగా మహనీయము.

కాని నాయనా! లోపమిది: తొందరపడి యే కార్యమును జేయరాదు. పవిత్రత, సహనము, దీక్ష...వీని యన్నిటికంటెను ప్రేమానురాగములు—ఇవి యున్నచో, విజయము నిన్ను వరించును. సమస్తకాలమును నీదియే, ఊరక తొందర పడనేల? పరిశుద్ధాత్ముఁడవై, నిష్కపటివై యున్నచో సర్వము చక్కఁబడితీరును. శతఘ్నివలె సంఘముపైఁబడి, యెల్లెడలను నూతనవికాసమును నూతన చైతన్యమును గలిగించుటకుఁగాను నీవంటియువకులు వందల కొలఁదిమంది మనకుఁ గావలసియున్నారు. భగవానుఁడు నీ యాశయములను సఫలమొనర్చుఁగాక!—ఆశీర్వాదకుఁడు,

వివేకానందుఁడు.

(65)

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 26-12-1894.

ధన్యాత్ముఁడును నా పుత్రుఁడుననగు—...క్రైస్తవ ప్రచారక పత్రికలలో నన్నుగూర్చి ఖండనలు చేయఁబడుచున్నట్లు వినుచున్నాను, కాని నేను వానిపై వుఁజూడనేచూడను. అట్టి

పత్రికలను వేనినిగాని నీవు నాకిఁకఁబంపిన పట్టమున 'బుట్ట దఖలే' వానిగతి. మన యుద్యమమునకుఁగాను కొంచెమాందోళన మవసరమైనది. వలసినంత జరుగనే జరిగినది. మంచి కానిమ్ము, చెడ్డకానిమ్ము, లోకులు నన్నుగూర్చి చెప్పువిషయముల కిఁక నెంతమాత్రము నీవు చెవియొగ్గకుము. "నహి కల్యాణ కృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి—మేలు చేసిన వాఁడొకప్పుడును దుర్గతి నొందఁ" డనెడి గీతావాక్యమును జ్ఞప్తిలోనుంచుకొని మీపని మీరు సాగింపుఁడు.

అనుదినము జనులిచట నన్నభినందించుచున్నారు. సర్వము మెల్లఁగా జరుగవలయును... వార్తాపత్రికా నిందలనుగాని స్తుతులనుగాని నేను లేశమును లక్షించువాఁడనుగానని నీకు నేనిదివఱకే వ్రాసియున్నాను, మఱల వ్రాయుచున్నాను. అట్టివానికి నేను జేయునది దహనసంస్కారము. మీరును ఆపనియే చేయుఁడు. వార్తాపత్రికా ప్రలాపములనుగాని ఖండనలనుగాని మీరెంతమాత్రమును పాటింపరాదు. నిష్కపటులై మీ కర్తవ్యము మీరు గొనసాగింపుఁడు. సర్వము చక్కఁబడును. సత్యము జయించితీరును....

క్రైస్తవ ప్రచారకుల యవకతవక వ్రాఁతలను మీరు తృణీకరింపవలయును. వానిని మీరు కన్నెత్తి చూడరాదు....పరిపూర్ణమౌనమే వానికిఁ దగు నిరసనము. మీరును నిట్లే చేయుదురని నమ్ముచున్నాను. ...మీరందఱును నా కౌఁగిలని గ్రహింపుఁడు. ఆశీస్సులు.

—సదా నీ వివేకానందుఁడు.

(66)

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 1894.

ప్రేమభాజన—,...నిష్కాపట్యమే యుత్తమనీతి, గుణవంతుఁడు తుదకు విజయము నందితీరును.... వత్సా! నే నెంతటి కార్యనిమగ్నుఁడనై యున్నను, ఎంతదూరమున నున్నను, ఎంతటి ఘనులతో మసలుచున్నను నా మిత్రులందుఁ బ్రతివ్యక్తిని—అతి సామాన్యునిసైతము—జ్ఞప్తిలో నుంచుకొందునని, వారి నాశీర్వదింతునని, వారి శ్రేయమునకుఁగాను భగవంతునిఁ బ్రార్థింతునని, సదా నీవు గుర్తింపవలయును. —ఆశీర్వాదకుఁడు, వివేకానందుఁడు.

(67)

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

1894.

ఆయుష్మంతుఁడగు—, అచటి సమాచారమంతయు నీ లేఖమూలమునఁ దెలియుచున్నది....కలిగిన విపత్తు సంతాపకరము, ఈశ్వరసంకల్ప మటులున్నది. ఇది కర్మక్షేత్రము, భోగాంగణముకాదు. తన పనిపూర్తియైనంతనే ప్రతివ్యక్తియు స్వస్థానమునకు వెళ్లును—కొందఱు ముందు, కొందఱు వెనుకను. అంతే...గతించెను—సరి, భగవదిచ్ఛ యటులున్నది! శ్రీరామకృష్ణ జన్మోత్సవ మతివైభవముగా జరిగినదను వార్త ముదావహము; అతని నామ మెంత వ్యాప్తిచెందిన నంత మేలు. కాని మన మొకవిషయమును గుర్తింపవలయును—పేరు ప్రతిష్ఠలనిమిత్తము కాక, లోక

మున కత్యావశ్యకమగు సందేశముల నొసఁగు నిమిత్తము మహాత్ము లావిర్భవింతురు, కాని వారియనుచరులు వారి బోధలను గంగలోఁ గలిపి, వారి నామములను నిలువఁబెట్టుటకై ప్రాఁకులాడుచుందురు, అందులకై కలహించుచుందురు—ఇదియే లోకుల ధోరణి. జనులాతని (గురుదేవుని) పేరు ప్రతిష్ఠల నంగీకరించినను మానినను నాకొక్కటియే, కాని యాతని బోధనలు, ఆతని జీవితము, ఆతని దివ్యసందేశము నిఖిలజగద్వ్యాప్తి నొందఁ దోడ్పడఁ బ్రాణములు ధారపోయుటకు సంసిద్ధుఁడను. ఒక విషయము. పూజాలయ విషయమున నా కమితభయము. స్వతః అందు దోషమేమియు లేదు, కాని కొందఱు దానితోడిదే లోకమనియు, అదియే పరమార్థమనియుఁ బూర్వపు ఛాందసమును మఱలఁ బాదుకొల్ప నుద్యమించుచుందురు—ఇదియే నా భయము. అర్థరహితమైన యీ పురాతనకలాపములను బాహ్యాచారములను బట్టుకొని వారెందుకుఁ బ్రాఁకులాడుచుందురో నే నెఱుఁగుదును. వారి యుత్సాహము, శక్తిసామర్థ్యములు, కర్మాచరణమును గాంక్షించుచుందును, కాని ప్రకటన మార్గమును గానక, గంట వాయించుట మున్నగు కార్యములతో వెలువడుచుందును.

నేను మీకొక నూతనాశయమును దెలుపుచున్నాను. దానిని మీరు కొనసాగింపఁగలుగుదురేని మీరు ధీరులనియు, సేవానిరతులనియు నమ్మెదను. కొన్ని చిత్రప్రదర్శకదీపములు, గోళములు, భూగోళపటములు, కొన్ని రసాయనద్రవ్యములు మొదలైనవి సంపాదింపవలయును. తరువాత మీకు వలసి

నది యొక్క పెద్దకుటీరము. అటుపిమ్మట మీరు కొందఱు పేదలను చేరఁదీసి, వారికి జ్యోతిశ్శాస్త్రము, భూగోళ శాస్త్రము మొదలైనవానియందుండి పటములను జూపి, పిమ్మట శ్రీరామకృష్ణునిగూర్చి బోధింపుఁడు. వివిధదేశము లలో నేమి జరిగినదో, జరుగుచున్నదో, లోకమెటులున్నదో —మొదలగు విషయములను గుర్తింపఁజేయఁ బ్రయత్నింపుఁడు. నిరక్షరాస్యులు—నిరుపేదలు—మీకచట వేల కొలఁదిమంది దొరకుదురు. ఉదయమో, మధ్యాహ్నమో, సాయంకాలమో, వెళ్లి వారికి సంగతులను దెలుపుఁడు. పుస్తకాదులు పనిచేయవు—వాగ్రూపముననే వారికి బోధింపుఁడు. పిమ్మట మెల్లఁగా మీ కేంద్రముల నభివృద్ధిచేయుఁడు. ఈ పనియంతయు మీరు చేయఁగలరా? లేక కేవలము గంట వాయించుటయేనా?

...(గురుదేవుని) భక్తురాండ్రు కొందఱు వితంతువులను శిష్యురాండ్రుగాఁ జేయలేరా? వారికి రవంత విద్యాగంధము మీరు కలుగఁజేయలేరా? ఇంటింటికిఁ దిరిగి శ్రీరామకృష్ణునిగూర్చి బోధించుచు, దానితోఁబాటు పేదలకు విద్యగఱపుటకై వారిని మీరు బయటికిఁ బంపలేరా?...

రండు! ఈ కార్యార్థము కంకణము గట్టుకొనుఁడు. కల్లబొల్లిమాటలకును నిరర్థక కర్మకలాపములకును గాలము గాదిది, వత్సా! నీవిపుడు కార్యాంగణమున దిగి పనిచేయ వలయును. ...

ఇది బహువిచిత్ర దేశము. ఇపుడిచట వేసవి కాలము—నేఁ డుదయ మిచట వంగదేశములో వైశాఖమాసమున

నెంత యుక్క పెట్టునో యంత యుక్క పెట్టినది, ఇంతలోనే యలహాబాదులో మాఘమాసమున నెంత చలివేయునో యంత చలి వేయుచున్నది! నాలుగు గంటలలోనే యంతటి వ్యత్యాసము! ఇచటి భోజనశాలలు వర్ణనాతీతములు. భోజనమునకుఁ జెల్లింపవలసినదాని నటుంచి, దినమున కొక గది క్రిందు వేలరూపాయిలపట్టు నద్దెనీయవలసిన పూఁటకూటి యిల్లు న్యూయార్కులోఁ గలదు. భోగవిషయమున నీ దేశమున కెనయగు దేశము యూరోపులోఁగూడ లేదు. ప్రపంచ మంతటియందును నిది మహాభాగ్యవంతమైన దేశము, ఇచట డబ్బు నీటివలె వ్యయమగును. నే నెన్నఁడోకాని యీ హోటళ్లలో నివసింపను, కాని తఱచుగా నిచటిఘనుల కతిథినై యుందును. వారికి నేను బాగుగాఁ దెలిసినవాఁడను. దేశమంతటికి నిపుడు నేను బరిచితుఁడను, అందుచే నే నెచటికి వెళ్లినను నత్యంతాదరముతో వారు నన్ను దమగృహములఁ కాహ్వానించుచుందురు....వారి యిల్లు షికాగోలో నా కేంద్రము. ఆతనిభార్యను నేను 'అమ్మా' యని పిలుతును. ఆతనికుమార్తెలు నన్ను 'అన్నా' యందురు. అంతటి దయానిలయము, నంతటి పావనమునగు కుటుంబము నెచటను గానము. కానిచో, నాయనా! భగవంతుఁడు తన కటాక్షపరంపరలను వారిపై నెందులకుఁ జూపును? ఆహా! వారెంతటి దయామయులో! ఫలానిచోట నొక పేదవాఁడు బాధపడుచున్నాఁడని వినినఁ జాలును. వానికి నన్నవస్త్రముల నొసఁగి యేదేని యొక యుద్యోగమును జూపుటకై సకుటుంబముగా వారు వెడలుదురే! ఇఁక మనమేమి చేయుచున్నాము?

ఈ దేశీయులకుఁ బుస్తకాదిసామగ్రియుఁ గలదు. కాని వెల చాల హెచ్చు. అదే మూల్యమునకు మీకైదు రెట్లు వస్తువులు కలకత్తాలో దొరకును. అనఁగా విదేశీయ వస్తువులను దమ దేశములోనికి వీరు దిగుమతి కానీయరు. వానిపైన విశేషమైన సుంకము విధింతురు, అందువలన ధర యమితముగాఁ బెరిగియుండును. ఐనను వీరు బట్టలు మొదలైనవాని నంతగాఁ దయారుచేయరు. యంత్రములను బనిముట్లను నిర్మింతురు; మఱియు గోధుమలు, వస్త్రాలు, ప్రత్తి మొదలైనవాని నుత్పత్తిచేయుదురు—ఇవి చాల చౌకగా నుండును.

...ఇచటఁ బలువిధములైన పండ్లు దొరకును; అనఁటి, నిమ్మ, జామి, ఆపిల్, బాదము, ద్రాక్ష—యీ పండ్లు విస్తారముగా దొరకును; ఇవిగాక యితరఫలము లనేకములు కాలిఫోర్నియానుండి వచ్చును. అనాసపండ్లు పుష్కలముగా దొరకును. కాని మామిడి మొదలైనపండ్లు మాత్రము దొరకవు.

...శిష్యులు—ప్రచండదీక్షాదక్షులగు యువకులు—కొందఱు మనకుఁ గావలసియున్నారు,—తెలిసినదా? బుద్ధిమంతులు, ధైర్యశాలులునగువారు—యమాలయమునకుఁ బోవుటకైనను వెనుదీయనివారు—సముద్రము నీఁదివేయుటకు సంసిద్ధులగువారు—ఇట్టి యువకులు మనకుఁ గావలసియున్నారు. బోధపడినదా? స్త్రీలును బురుషులును వందల కొలఁదిమంది యిట్టి వ్యక్తులు మనకుఁ గావలసియున్నారు.

ఇందులకై యావచ్ఛక్తిని వినియోగించి ప్రయత్నింపుఁడు. సంకోచింపక నిరభ్యంతరముగా జనులచే మన యాశయముల నవలంబింపఁజేసి వారికి మనశిక్షణమును దరబియతుచేయుఁడు.

...అంతయుఁ గ్రమముగాఁ జక్కఁబడును. ఊరక లేఖలు వ్రాయుచుఁ గూర్చుండుటకు నాకుఁ దగినంత వ్యవధి లేదు. ఉపన్యాసాది విషయమునకైనను ముందుగా వానికై యాయిత్తపడను. నేను వ్రాఁతమూలకముగాఁ జేసిన దొక్కటే యుపన్యాసము, దానిని మీరు ముద్రించినారుగదా. మిగత వానిని సమయస్ఫూర్తిపై నిర్భరపడి యాశువుగనే చేయుదును—గురుదేవుఁడే నాకాధారభూతుఁడు, కలముతోడను గాగితముతోడను నాకుఁ బనియే లేదు. డిట్రాయిట్‌లో నొకప్పు డేకధారగా మూడుగంటలనే పుపన్యసించినాను. ఈ పిల్లయ్యవద్ద నింత సరకున్నదా యని—యొక్కొక్కప్పుడు నా విజయమునకు నాకే యాశ్చర్యమగుచుండును!...

సమాజమునకు—లోకమునకు—మనము గగుర్పాటు కలిగింపవలయును, ప్రకంపనము గలిగింపవలయును. కల్లబొల్లిమాటలును శుష్కకర్మకలాపములును బనికిరావు. కర్మకలాపములు గృహస్థులకుద్దేశింపఁబడినవి. భావప్రవాహములను జగద్వ్యాప్తిచేయుటే మీ కర్తవ్యము. ఈ కార్యమును మీరు సాధింపఁగలరా? ఐనచో భయము లేదు...

వలయునది శీలనిర్మాణము,—శీల మేర్పడనిండు, అపుడు నేను మీ నడుమనుండుదును. తెలిసినదా? స్త్రీలును బురుషులును—మనకొక వేయిమంది సన్న్యాసులు, కాదు,

పదివేలమంది—ఇరువదివేలమంది—సన్న్యాసులు కావలసి యున్నారు. మన తల్లులు—ఏమి చేయుచున్నారు? ఏమైనను సరియే, మన యాశయముల నవలంబించువారు మనకుఁ గావలసియున్నారు. వెళ్లి వారితోఁ జెప్పుడు, మనఃపూర్వకముగా, స్వయముగా, మీరు ప్రయత్నింపుఁడు. గృహస్థ శిష్యులు కాదుసుమీ, మనకుఁ గావలసినవారు సన్న్యాసులు. మీలోఁ బ్రతివ్యక్తియు నొక వందమందిని— విద్యావంతులగు యువకులను — మూర్ఖులనుగాదుసుమీ — ముండితశిరస్కులను జేయవలయును. అపుడు మీరు ధీరులని తలంతును. లోకమున మనము కల్లోలము గలిగింపవలయును. నిర్లక్ష్యభావమును విడిచి, యువకులారా! నడుములు బిగియింపుఁడు, లెండు! కలకత్తా చెన్నపట్నములనడుమ విద్యుద్వేగముతో మీరెల్లు పర్యటనములు చేయుదురో, నేను జూడవలయును. అందందుఁ గేంద్రములను నెలకొల్పుఁడు. సదా జనులను వశపఱచుకొని వారిచే మీ యాశయముల నవలంబింపఁజేయుచుండుఁడు. స్త్రీలు కానిండు, పురుషులు కానిండు, వాంఛించిన వారికెల్ల—ప్రతివ్యక్తికిని—సన్న్యసము నొసగుఁడు, అపుడు వచ్చి నేను మీనడుమ నుందును. ఆధ్యాత్మికమహోత్తుంగతరంగము వెలువడుచున్నది, కనుఁడు —ఆ మహనీయుని కటాక్షమున—హీనులు మహనీయులగుదురు, అజ్ఞులు పండితవరేణ్యుల కాచార్యులగుదురు. "ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత—లెండు, మేల్కొనుఁడు. గమ్యప్రాప్తిపర్యంతము నాఁగవలదు." అనవరతవికాసమే జీవనము, సంకోచమే మరణము. సదా

స్వసుఖమునకుఁగాను ప్రాఁకులాడుచుండు నలసులకు నరకమున నైనను దావులేదు. సర్వభూతహితుఁడై, సర్వభూతదయామయుఁడై, తనకు నరకము ప్రాప్తించినను సరియే యనువాఁడెవ్వఁడో—వాఁడే శ్రీరామకృష్ణుని బిడ్డఁడు; "ఇతరే కృపణాః"—ఇతరులు కృపణులు, అల్పులు. ఈ మహోత్క్రాన్తసమయమున ధీరుఁడై నిలిచి, యా మహనీయుని సందేశము నింటింటను, వాడవాడలందును, ఊరూరను నెవ్వఁడు వ్యాప్తిచేయునో వాఁడే నా సోదరుఁడు, వాఁడే శ్రీరామకృష్ణుని ప్రియసుతుఁడు. ఇదియే నిదర్శనము—రామకృష్ణుని బిడ్డఁడగువాఁడు స్వలాభము నాసింపఁడు, ఆత్మహితమును జూచుకొనఁడు. ప్రాణాత్యయేఽపి పరకల్యాణచికీర్షవః—ప్రాణాంతమున నైనను సరియే, అట్టివారు పరకల్యాణము నొనఁగూర్పనభిలషింతురు." ఎంతసేపు, "మన కాయుష్యము, మనకారోగ్యము" ననుకొనుచు, స్వసుఖమును జూచుకొను సోమరులకు మన సమాజమునఁ దావు లేదు; అట్టివారి నావలకు దయచేయనిండు. గురుదేవుని సచ్చరిత్రము, నాతనిబోధల, నాతని మతతత్త్వములను వ్యాప్తిచేయుఁడు. ఇదియే సాధన, ఇదియే యారాధన, ఇదియే మార్గము, ఇదియే గమ్యము. లెండు! మేల్కొనుఁడు! మహోత్తుంగతరంగము వెలువడుచున్నది! అగ్రసరులుకండు! ఆచండాలము సమస్తస్త్రీపురుషులు నాతని దృష్టిలోఁ బరమపవిత్రులే. ముందంజవేయుఁడు! వెనుకకుఁ జూడకుఁడు! పేరు ప్రతిష్ఠలనుగాని, భక్తిముక్తులనుగాని కాంక్షించుట కిపుడు వ్యవధిలేదు! మఱియొకప్పుడు వీని

మాట చూచుకొందముగాక. ఇవు డీజన్మమున నాతని దివ్య చారిత్రము. నాతని మహోత్తమజీవితము, నాతని యనంత భావముల నఖండవ్యాప్తి చేయుదముగాక. ఇదియే మన విధి, ఇదియే మనకర్తవ్యము! ఆతని పవిత్రనామము చెవిని బడినంతనే క్షుద్రకీటకమైనను సరియే, దివ్యత్వము నొందును, ప్రత్యక్షముగాఁ బొందుచున్నది—మీకు గోచరించుటలేదా? ఇది వాస్తవముకాని యెకసక్కెముగాదు, అవివేకముగాదు, పసిపాపల ప్రలాపముకాదు. "ఉత్తిష్ఠత! జాగ్రత!—లెండు, మేల్కొనుఁడు!" జయపరమేశ్వర! పరమేశ్వరుఁడు మనకుఁ బ్రాప్తియున్నాఁడు. ఇంతకంటె నేను వ్రాయఁజాలను.—పురోగమన మొనర్పుఁడు! ఈ లేఖ నెవ్వరు చదివినను వారికి నాభావములు హృద్గతమగును! శ్రద్ధవహింపుఁడు! అగ్రసరులు కండు! జయ! పరమేశ్వర! ...ఎవ్వరో నన్నిట్లు వ్రాయఁబురికొల్పుచున్నారని—కాదు—వ్రాయించుచున్నారని తోఁచుచున్నది. పురోగమన మొనరింపుఁడు! జయ! పరమేశ్వర! ఎల్లరును ముగ్ధులై పోవుదురు! మెలఁకువ గలిగియుండుఁడు! అతఁడు వేంచేయుచున్నాఁడు! ఆతని సేవింప సంసిద్ధులగు వారియందు—కాదు, ఆతని బిడ్డలను, దీనులను, పతితులను, అధఃకృతులను, ఆర్తులను, సమస్తజీవులను—సేవింప నెవ్వరు సంసిద్ధులగుదురో వారియందు—ఆతఁ డావిర్భావమునొందును. వారి నాల్కపై సరస్వతి తాండవించును, సర్వశక్తి స్వరూపిణి యగు జగన్మాత వారి హృదయసింహాసనమున నధివసించును. శ్రద్ధావిరహితులు, నాస్తికులు, వ్యర్థులు, దాంభికులును నా

మహనీయునకు స్వజనమని చెప్పుకొనుటయా ?...

—అప్పుడు, వివేకానందుడు.

మఱియొకమాట....సంఘమనఁగాఁ బరిశ్రమవిభాగమని భావము. ప్రతివ్యక్తియుఁ దనవంతు పని తాను జేయును—ఇట్టి విభాగముల నేకీభవించుటచే సమన్వయాదర్శము సిద్ధించును.... —వివేకానందుడు.

(68)

షికాగో, 1894.

ప్రేమాస్పద—,... నా ప్రతిష్ఠ యిపు డుచ్ఛస్థితి నంది యున్నది. గురుదేవుని సంకల్పమటులున్నది, నేనేమి చేయుదును ? దీనిని జూచి...కండ్లలో నిప్పులు పోసికొను టాతని యవివేకము. ఉపేక్షితవ్యం తద్వచనం భవత్స దృశానాం మహాత్మనాం, అపి కీటదంశన భీరుకా వయం రామకృష్ణతనయా స్తద్ హృదయరుధిర పోషితాః. "అలోక్య సామాన్య మచిన్త్య హేతుకం నిన్దన్తి మన్దాశ్చరితం మహాత్మనామ్." * — ఇత్యాదీని సంస్మృత్య క్షన్తవ్యో௨యం జాల్మః.— (అతని మాటలను నీవంటి ఘనులు పాటించుట పాడిగాదు. రామకృష్ణహృదయరుధిర పోషితులము—అతని బిడ్డలము, మనము—క్షుద్రకీటకములను జూచి జడియుటయా? "మహాత్ములలోకాతీత సచ్చరిత్రమును నచిన్త్యాశయములను మందులు నిందింతురు"—ఇత్యాది వచనములను స్మరించి యీ యవివేకిని క్షమింపుము.) ఈ

* కాళిదాసుని కుమారసంభవము.

దేశీయుల పరిశీలనశక్తి వికాసము నొందు టీశ్వరసంకల్పము. ఈశ్వరపురోగమనము నరికట్టఁగలవారెవ్వరు ? నా కేపేరును బ్రతిష్ఠయు వలదు—అపౌరుషవాణినై యుండుటయే నా యభిమతము—నానామముతోడను వ్యక్తితోడను నిమిత్తము లేక నా భావములు వ్యాప్తినొందుటయే నా యభిమతము. నన్నెవ్వరును సమర్థింపనక్కఱలేదు—కోఽహం తత్పాద ప్రసరం ప్రతిరోద్ధుం సమర్థయితుం వా, కే వాన్యే ? తథాపి మమహృదయ కృతజ్ఞతా తాన్ ప్రతి. —(వాని పురోగమనము నరికట్టుటకుఁగాని, దానికిఁ దోడ్పడుటకుఁ గాని నే నెవ్వఁడను ? ఇతరులుమాత్ర మెవ్వరు ? ఐనను వారికి మనఃపూర్వకముగాఁ గృతజ్ఞుఁడను.) "యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే"—నైషః ప్రాప్తవాన్ తత్పదవీమితి మత్వా కరుణాదృష్ట్యా ద్రష్టవ్యోఽయమ్మితి—("ఏ స్థితియందు నెలకొనియున్నచో, మానవుఁడెంతటి మహా దుఃఖము కలిగినను జలింపఁడో" (గీత)—ఆస్థితి నాతఁడు పొందలేదు—అని గ్రహించి యాతనిఁ జూచి జాలిపడుము.) ఈశ్వరానుగ్రహమున యశోవాంఛ నా హృదయమున నింకను బ్రవేశింపలేదు, ఇఁకఁ బ్రవేశింపదనియుఁ జెప్పఁగలను. నేను నిమిత్తమాత్రుఁడను. ఈ దూరదేశమున నన్ను నిమిత్తముగాఁ జేసికొని పరమేశ్వరుఁడు జనసహస్రములహృదయములలోఁ బారమార్థిక చిత్తవృత్తిని బురికొల్పుచున్నాఁడు. ఇచట వేలకొలఁదిమంది స్త్రీ పురుషులు నన్ను బ్రేమింతురు, గౌరవింతురు....'మూకం కరోతి వాచాలం పఙ్గుంలఙ్ఘయతే గిరిమ్—మూఁగవానిని వాఁడు మహావక్తను జేయును, కుంటి

వానిచేఁ బర్వతములు దాఁటించును.'' ఆహా! యేమి వాని కటాక్షమహిమ! నే నెచటకు, ఏపురమునకు, వెళ్లినను, అచట కోలాహలము! నాకు వారు ''హిందూ ఝంఝూ మారుతము'' (The Cyclonic Hindu) అని పేరుపెట్టిరి. ఇదియంతయు వాని సంకల్పమని—నే నపౌరుషవాణినని—గుర్తింపుఁడు. *

ఇంగ్లాండునకుఁ గాని, యిలలో మఱియేతావునకుఁ గాని నే నెపుడు వెళ్లెదనో—వెళ్లెదనో లేదో—అల పరమేశ్వరున కెఱుక. పరమేశ్వరుఁడే సర్వము నాయిత్తము చేయును.

ఇక్కడ నొక చుట్టఖరీ దొకరూపాయి. గుఱ్ఱపు సారటులో నెక్కినఁ జాలును, మూడురూపాయి లీయ వలయును; ఒక కోటువెల నూఱురూపాయిలు; ఒక దినమునకుఁ బూఁటకూటియింటియద్ద తొమ్మిదిరూపాయిలు. —సర్వము పరమేశ్వరుఁడే సమకూర్చుచున్నాఁడు.... నా కేమియుఁ దెలియదు. అంతయు వాని విలాసము. ''సత్యమేవ జయతే నానృతం, సత్యేనైవ పన్థావితతో దేవయానః—అనృతము కాదు, సత్యమే జయించునది. సత్యమున నే దేవయానమార్గము నెలకొనియున్నది.'' నీవు నిర్భయుఁడవై యుండుము. జడియుచుఁ దన్నుదాను సమర్థించు కొనఁ జూచువాఁడు పిఱికిపంద. మీలో నెవ్వరును నన్ను

---

* తనసామమును వ్యక్తిని గాక జనులు తన భావములను గణింప వలయునని స్వామి భావము.

సమర్థింప నడుముగట్టుకొనన నక్కఱలేదు. చెన్నపురినిగూర్చియు రాజపుత్రస్థానమునుగూర్చియు నాకపుడపుడు సమాచారమంతయుఁ దెలియుచున్నది, ...పదునాలుగు వేల మైళ్ల పర్యంతము గమనింపఁగల కన్నులు కలవు. వాస్తవము ఉండుఁడు, సర్వము సకాలమున—పరమేశ్వరసంకల్పాను సారము—సుప్రకాశితమగును. ఈశ్వరవచనము మిథ్యకాదు. నాయనా! కుక్కలు, పిల్లులును బోట్లాడుకొనుచున్నచో నెవ్వరైనను దుఃఖింతురా? కావున సామాన్యు లొండొరులను జూచి యసూయపడుచున్నచోఁ, గాట్లాడుకొనుచున్నచో, నీవు కలవరపడనేల? అభాగ్యమేఘావరణము వీడుచున్నదనియు, (భారతభాగ్య) భానూదయ మగుచున్నదనియు నాఱు నెలలనుండియుఁ జెప్పుచున్నాను. క్రమక్రమముగానైనను నిశ్చయముగా, నావరణము తొలఁగుచున్నది—సకాలమున నీకుఁ దెలియఁగలదు. అంతయుఁ బరమేశ్వరవిలాసము. హృదయాంతర్గతవిషయముల నన్నిటిని వెల్లడింపఁజాలము. ఇవన్నియు వ్రాయఁదగినసంగతులు కావు.... మన నౌక సక్రమముగనే నడచుచున్నది, సంశయింపకుఁడు, చుక్కానిపట్టు వీడకుఁడు, కొంతకాలముపట్టును, వేఱేమియుఁ గాదు. నాయనా! నాయకుని నిర్మింపఁగలమా? ఎవ్వఁడైనను జన్మతఃనాయకుఁడై పుట్టవలయును. బోధపడినదా? నాయకత్వము వహించుట బహుకష్టసాధ్యము. “దాసస్య దాసః”—(నాయకుఁడగువాఁడు) దాసానుదాసుఁడై యుండవలయును, వేయి (వేర్వేఱు) మనస్సులను సముదాయింపవలయును. అణుమాత్రము నసూయ కెడమీయరాదు,

స్వార్థపరత్వము కలదైనను బనికిరాదు. ఈ గుణములున్నచో, నీవు నాయకుఁడవు కాఁగలవు. మొదటిది జన్మసిద్ధమగు యోగ్యత, రెండవది స్వార్థరాహిత్యము—ఇవి నాయక లక్షణములు. అంతయుఁ జక్కఁగనే నడచుచున్నది, సమస్తము చక్కఁబడితీరును. గురుదేవుఁడు సరిగనే వల పన్నుచున్నాఁడు. అదేవిధముగా నుపసంహరించుచున్నాఁడు—"వయమనుసరామః, వయమనుసరామః, ప్రీతిః పరమసాధనమ్—అనుసరించుటయే మనవంతు, ప్రీతియే పరమసాధనము." విజయశీలమగునది ప్రీతి—ప్రేమ. ఊరక కలవరపడినఁ బ్రయోజనము లేదు—ఉండుఁడు, నిదానింపుఁడు,—తాలిమి విజయము నంది తీరును....

నాయనా! యథాప్రకారముగనే సర్వము సాగనిమ్ము, ఏ సంప్రదాయమును—ఏ బాహ్యాచారమును—ఆవశ్యకము గాకుండునట్లు మాత్రము చూడుము—అనేకత్వమున నేకత్వదర్శనమునకు, సర్వమతసమభావమునకు, ఇసుమంతయు భంగము కలుగకుండునట్లు చూడుము, సర్వమతసమదర్శనమున కావశ్యకమగుచో, సమస్తము త్యజించి వేయవలయును. నేనున్నను, గతించినను, భారతదేశమునకు వచ్చినను, రాకున్నను ఈ విషయమును సదా జ్ఞప్తిలో నుంచుకొనుఁడు—అన్యమతసహనముతో నూరకుండుట కాదు. సర్వమతములును మోక్షమార్గములేయని మన మాచరణపూర్వకముగా బోధింతుము. ఇతరులహక్కుల నేమాత్రమును నిరసింపకుండుటకుఁగాను మీరు జాగరూకులు గావలయును. మహానౌక లా సుడిగుండములోఁ బడి మునిఁగిపోయి

నవి. పక్షపాతరహితము, అభిమానరహితమునగు నఖండ శ్రద్ధాభక్తులను మనము చూపవలయును—ఈ సంగతి మఱవకుఁడు. భగవదనుగ్రహమున సర్వము చక్కఁబడును. ...ప్రతివ్యక్తియుఁ దాను నాయకుఁడు' కాఁదలఁచును, కాని నాయకత్వము జన్మసిద్ధ మనుసంగతి జనులు గ్రహింపఁజాల కున్నారు. ఇదియే యన్ని చిక్కులకు, నల్లరికిని మూల కారణము....

మన తల్లులందఱును క్షేమముగా నున్నార ను కొందును....తల్లి యెక్కడనున్నది? అట్టి మహోదార స్వభావముగల తల్లులు మనకొక వేయిమందియైనను గావలసి యున్నారు....ఎల్లరును మనకుఁ గావలసియున్నారు. మన గురుదేవునియందు మన కెట్టినమ్మకమున్నదో, యట్టి నమ్మ కమే యెల్లరును గలిగియుండనక్కఱ లేదు. సర్వవిధములను దౌర్జన్యమును సౌజన్యముచే మనము జయింపవలయునే.... మేము సన్న్యాసులమను నహంభావమే సన్న్యాసులను వలగొను మహాపాతకము, ప్రారంభస్థితియం దిట్టి యహం భావమునకుఁ గొంతవఱకుఁ బ్రయోజన ముండఁగాక, కాని సాధకుఁడు పక్వావస్థ నొందినంతనే దానికిఁకఁ దావు లేదు. వీఁడు గృహస్థుఁడు, వీఁడు సన్న్యాసియు ననెడి భేదదృష్టి కూడదు—అభేదదృష్టిగలవాఁడే నిజమైన సన్న్యాసి....

చేతఁ జిల్లిగవ్వయైనను లేని యీ మదాఱుగురు బాలు రారంభించిన యుద్యమము—నేఁ డిపుడింత మహావేగముగా విజృంభించుచున్న యుద్యమము—బూటకమా, భగవ దిచ్ఛయా? అగుచో నెల్లరును స్వపక్షాభిమానము, నసూ

యను విడనాడి సంఘీభావముతో వర్తింతురుగాక. విశ్వమానవమత మనునది—విశ్వమానవధర్మ మనునది—స్వపక్షాభిమానమూలమునను గక్షలమూలమునను వెలువడఁజాలదు.

“తలఁచినంతనే తాతపెండ్లియా?” యనున క్లైవ్యగ్గైనను దలఁచిన మాత్రముననే మహాత్ములు కాఁజాలరనియుఁ, బరమేశ్వరుఁ డెవ్వరి నుద్ధరించునో వారే వృద్ధి పొందుదురనియు, నెవ్వరి నణఁచునో వారే కూలుదురనియు నెల్లరు నొక్క నిమేషము గ్రహించినఁ జాలును, సమస్త బాధలును దుదముట్టును. కాని యీ యహంభావ మెచటికిఁ బోవును?—గడ్డిపోఁచనైనను గదపఁజాలని నిస్సారనిరర్థకాహంభావము—“నే నెవ్వరిని పైకి రానీయ” నను నహంభావము—ఎంత హాస్యాస్పదము! ఇట్టి ద్వేషభావమే, పదుగు రేకీభవించి పనిచేయఁజాలకుండుటయే, బానిసజాతుల నైజము. కాని మనము దీనిని దొలఁగించుకోవలయును. పరమనికృష్టమైన యీ యసూయయే మనలను బట్టి పీడించుచున్నది....ఇతర దేశములకు వచ్చి చూచినచో, మీ కిందలి సత్యము బోధపడఁగలదు. ఈ విషయమున మన నిర్భాగ్యులీ దేశములోని నీగ్రో బానిసలకు సరివత్తురు—వారిలో నొక్కఁడు కాసంత పైకివచ్చినచో, నాధిక్యముపొందినచో, నితరులందఱును వానిపైఁ గక్షకట్టి తెల్లవారితోఁజేరి వానిని గూలఁద్రోయ విశ్వప్రయత్నము చేయుదురు....

ఏమైనను, ఎటులైనను, ఈ యసూయ మాత్రము మనలోఁ బ్రవేశింపకుండుటకుఁగాను మనము జాగరూకులము

గావలయును. ఇందులకై బద్ధదీక్షితులము గావలయును. మనము పదుగురమైయున్నను దుద కిరువురమైయున్నను సరియే, వలయునది సౌశీల్యము....భగవంతుఁడే మన యోగక్షేమములను వహించును—మీరా విషయమై బెంగ పెట్టుకొననక్కఱలేదు....గురుదేవుని నామమును మనము రాజపుత్రస్థానమునను బంజాబునను సంయుక్తపరగణాలలోను జెన్నరాష్ట్రములోను నితరరాష్ట్రములలోను వ్యాప్తిచేయ వలయును. ఔను, ''ప్రాణభయము కలిగినను రఘువంశీయులు తమ వాగ్దానమును నెఱవేర్ప వెనుదీయరు'' అని చెప్పఁజాలు ధీరులు నేఁటికిని గల రాజపుత్రస్థానమున వ్యాప్తి చేయవలయును.

విహంగము వియత్తలమున నెగురుచు, నొక మహోన్నతస్థానమును జేరి ప్రశాంతముగా నటనుండి నేలను బరికించును. నీవట్టి తావును జేరితివా! ఇతరులకు బోధించుటకా తావును జేరనివాని కధికారము లేదు....

క్రమముగా నిచట శీతల మంతరించుచున్నది...శీతకాలమున నిచట శరీరము విద్యుచ్ఛక్తిమయమగును. కరచాలనము (Shake hand) చేయునెడ శబ్దసంయుతమగు ప్రకంపనము గలుగును. వ్రేలితోడనే వాయువు (Gas) ను వెలిఁగింపవచ్చును. ఈ శీతకాలమునుగుఱించి మీకిదివఱకే వ్రాసియున్నానుగదా. దేశమునందంతటను బర్యటనములు చేయుచున్నాను, కాని షికాగో నా ''మఠము''; పర్యటనానంతర మెప్పుడు నచటికి వెళ్లుచుందును. ప్రాచ్యభూమికి

వచ్చుటకై యాయిత్తపడుచున్నాను. నా నౌక యెప్పుడు దరిఁజేరునో నారాయణునకెఱుక.... •

నిజమే, నాయనా! సన్న్యాసికిని గృహస్థునకును భేదము మిథ్యయే. "మూకం కరోతి వాచాలమ్—మూఁగ వానిని వాఁడు మహావక్తను జేయును." నాయనా! ఏ పుట్టలో నే పామున్నదో యెవరికెఱుక!...—సదా మీ యాప్తుఁడు, —వివేకానందుఁడు.

(69)

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

1894.

చిరంజీవి యఖండానందునకు—...జాగ్రత్తగా సంస్కృతము, నాంగ్లము నభ్యసింపుము....

ఖేత్రీనగరమున నింటింటికిని వెళ్లి నిమ్నజాతులకును బేదలకును మతధర్మములను బోధింపుము. మఱియు భూగోళశాస్త్రము మొదలైన లౌకికశాస్త్రములను గూర్చి వారికి నోటిపాఠములు చెప్పుము. పేదలకేమియు మేలుచేయక, యూరక రాజభోజనములు చేయుచు, "రామకృష్ణప్రభూ!" యని స్మరించుచుఁ గూర్చుండుటవలన నేమియు లాభము లేదు. అప్పుడప్పు డితర గ్రామములకును బల్లెలకును వెళ్లి మతధర్మములను జీవనవిధానమును జనులకు బోధించుచుండుము. కర్మము, భక్తి, జ్ఞానము—మొదట కర్మము నాచరింపుము, అపుడు నీకు చిత్తశుద్ధి లభించును, లేనిచో భస్మహవ్యములవలె సర్వము నిష్ప్రయోజనమగును...

ఆతనితోఁ గలిసి రాజపుత్రస్థానమున నూరూరను పేదలును దీనులును నివసించు ప్రతికుటీరమునకును వెళ్లుము. నీవు తిను నాహారమునుగూర్చి జను లభ్యంతరము వెలిపుచ్చినయెడల వెంటనే దానిని విసర్జింపుము. పరహితార్థమైనచోఁ, బచ్చిక తిని జీవించుటయైనను మేలు. కాషాయధారణము భోగార్థముకాదు. కాషాయము ధీరోద్యమ పతాకము. మనోవాక్కాయములను నీవు పరహితార్థము సమర్పింపవలయును. "మాతృదేవో భవ, పితృదేవో భవ" యని నీవు పఠించియున్నావు, కాని నేను, "దరిద్రదేవో భవ, మూర్ఖదేవో భవ" యని చెప్పెదను.—పేదలు, అజ్ఞులు, నిరక్షరాస్యులు, దీనులు—వీరినే నీవు దైవముగా భావింపవలయును. దీననారాయణసేవయే మహోత్తమధర్మమని గ్రహింపుము. ఆశీస్సులు,

—సదా మీ వివేకానందుఁడు.

*(70)*

షికాగో, 1894.

ప్రేమాస్పద—,...పాశ్చాత్య విజయరహస్యము సంఘీభావము; అన్యోన్యవిశ్వాసము, అన్యోన్యగుణగ్రహణము—ఇవియే దానికి మూలము. దేశమున దౌర్బల్యము, అధైర్యము ననునవి హెచ్చినకొలఁదియు నసూయాపిశాచము చెలరేఁగుచుండును. కాని నాయనా! బానిసజాతినుండి మన మేఘనకార్యము నాసింపరాదు. విషమపరిస్థితులే—కాని విషయమును విశదీకరింతును. చైతన్యవిరహితము, ధార్మికాశయ హీనము, భావిభాగ్యోదయాశయవిహీనము నై,

తనకు మేలొనఁగూర్చిన వారిపైఁబడ సదా సంసిద్ధమైయున్న యీ హిందూజాతిని—ఈ మృతకళేబరమును—మీరు పునర్జీవింపఁజేయఁగలరా? తన్నులు తన్ను మొండి బండపిల్ల వాని గొంతులో బలవంతముగా మందు పోయు వైద్యుని వలె మీరు వర్తింపఁగలరా?...విదేశములోనున్న స్వదేశీయున కమెరికా దేశీయుఁడుగాని, ఐరోపా దేశీయుఁడుగాని సదా సర్వవిధములను దోడ్పడుచుండును....

"కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన—కర్మమునకే కాని తత్ఫలమునకు నీ కెన్నఁటికి నధికారము లేదు" అని నీవు గుర్తింపవలయును. అచలమువలె నిశ్చలుఁడవై యుండుము. సత్యమే సదా విజయశీలము. శ్రీరామకృష్ణునివత్సలు సదా ఋజుమార్గవర్తనులై యుండవలయును, ఉన్నచో సమస్తము చక్కఁబడును. ఫలప్రాప్తిపర్యంతము మనము జీవింపకపోవచ్చును, ఐనను గాలక్రమమున ఫలము లభించితీరును. సాంఘికశరీరమున నూతనశక్తిని బురికొల్పునట్టి తీవ్ర నూతనోత్సాహము భారతదేశమున నావశ్యకమైయున్నది. ఐన నిది యెప్పుడును గ్రమముగా, మెల్లఁగా జరుగవలసిన కార్యము. కర్తవ్యాచరణమునఁ దృఢుఁడవై, సుస్థిరుఁడవై యుండుము. అకలంకుఁడవై, ధీరుఁడవై, నిష్కపటివై యున్నచో, సర్వము చక్కఁబడును, శ్రీరామకృష్ణుని శిష్యులచరిత్రమందలి విశిష్టత యేమన, వారు నిష్కపటచిత్తులు, కృత్రిమమనునది వారియందుఁ గానరాదు. నూర్గుర నిట్టివారిని వెలువడఁజేసి, భారతదేశ కార్యాంగణమునఁ బ్రవేశింపఁ జేయఁగలిగితినేని

నాకర్తవ్యమును నెఱవేర్చితినను సంతృప్తితో గతింపఁ గలను. ఐన నంతయు భగవత్సంకల్పము. అజ్ఞులను వాఁగనిమ్ము, మన మొకరిసాయము నపేక్షించువారముగాము, ఉపేక్షించువారమును గాము—భగవత్సేవకులము మనము. మనల నణఁచుటకై క్షుద్రులు చేయు నల్పయత్నములను మనము పాటింపరాదు. అగ్రసరుఁడవు కమ్ము! అనేక యుగపర్యంత ప్రయత్ననిర్మితము శీలము. ధైర్యము సేడకుము. సత్యవాక్య మెన్నఁటికిని వినష్టముకానేరదు; యుగముల తరబడి నది మఱుఁగుపడియున్నను నెప్పుడో యొకప్పుడు సుప్రకాశితమైతీరును. సత్యము, సౌజన్యము, నైర్మల్యము—వీని కెన్నఁటికిని నాశనమనునది లేదు. వందలకొలఁది పరమతావలంబులకంటె నొక్క నిష్కపటి మేలు. వత్సా! ధీరుఁడవై యుండుము! ఒకరిసాయము నపేక్షింపకుము! నరునిసాయమన నేపాటిది? నరునిసాయముకంటె నారాయణుని సాయము కోటిరెట్లు ఘనతరముకాదా? అకలంకుఁడవై యుండుము—పరమేశ్వరుని విశ్వసింపుము, సదా వాని మీఁదనే నిర్భరపడుము, అపుడు సన్మార్గగామివై వెలయుదువు, అపుడు నిన్నేదియు నిరోధింపఁజాలదు....

"తమసో మా జ్యోతిర్గమయ—తమస్సునుండి వెలువరించి మమ్ము తేజోమార్గమున నడిపింపుము" అని పరమేశ్వరుని ప్రార్థింతముగాక—గాఢాంధకారమునుండి యొక కిరణము, మనకుఁ జేయూఁత నొసఁగుటకై యొకకరము, వెలువడును. సదా మీ క్షేమార్థము నేను బ్రార్థింతును: మీరును నాక్షేమమును గోరి ప్రార్థింపవలయును. దారిద్ర్య

ముచే, మతాచార్యకైతవముచే, రాజశాసనములచే, నధఃకృతమైయున్న భారతదీనజనసహస్రముల యభ్యుదయార్థము మనమందఱు మహర్నిశము ప్రార్థింతముగాక, అగ్రజాతులకును ధనికులకునుగంటె నీదీనులకు మతధర్మములను బోధించుటయే నాయభిమతము. నేను దార్శనికుఁడనుగాను, వేదాంతినిగాను, ఋషి సంతకంబెుఁ గాను; నేను బేదను, పేదలయందు నాకుఁ బ్రీతి. ఈదేశమునఁ బేదల నెట్లాదర పూర్వకముగాఁ బిలుతురో, వారియెడ నెంద ఱెందఱు సాను భూతి వహింతురో, ప్రత్యక్షముగాఁ జూచుచున్నాను. కాని హిందూదేశమునకును ఈదేశమునకును నెంతటి వ్యత్యాసము! దారిద్ర్యమున, అజ్ఞత్వమున, మునిఁగితేలుచున్న యిరువదికోట్ల స్త్రీపురుషుల క్షేమమును గోరి పరితపించువారెవ్వరు? వారికిఁక గతియేమి? ఎవ్వరు వారిబాగు కోరి పరితపించువారు? ఆహా! వారికి విద్యలేదే! దిక్కులేదే! దివాణములేదే! వారికి దారిచూపువారెవ్వరు?—ఇంటింటికిఁ దిరిగి వారికి విద్యనేర్పువారెవ్వరు? సోదరులారా! ఈదీనులే మీ దైవమని భావింపుఁడు—వారినిగూర్చియే చింతింపుఁడు—వారికోసమే కృషిచేయుఁడు, అహర్నిశము వారిక్షేమార్థమే ప్రార్థింపుఁడు—భగవంతుఁడు మీకు దారి చూపును. పేదలనిమిత్త మెవ్వఁడు పరితపించునో వాఁడే మహాత్ముఁడు, పరితపింపనివాఁడు దురాత్ముఁడే. మనమందఱు మేకమై, వారిశ్రేయస్సునకుఁగాను బ్రార్థింతము. మనముంటిమనియైనను లోకమునకుఁ దెలియకపోవచ్చును, లోకము మనలనుగూర్చి జాలినైనను బొందకపోవచ్చును, ఏమియు

సాధింపకయే మనము గతించినను గతింపవచ్చును—కాని సదాశయ మొక్కటియు వినష్టము కాదు. ఇప్పుడో, యుగాంతముననో ఫలము గలిగితీరును. నా హృదయపరితాప మెట్టిదో తెలుపఁజాలను—నీకా సంగతి తెలియును, నీ వూహించుకొనవచ్చును. లక్షలకొలఁదినుండి స్వదేశీయు లజ్ఞులై, క్షుధార్తులై దినములు గడపుచుండ, వారిని క్రీగంటనైనను జూడక, వారి నధఃపాతాళమున కణఁగఁద్రొక్కు తాము విద్యావంతులైన వారందఱును దేశద్రోహులని నాయభిప్రాయము. పేదల నెత్తురు పీల్చి తమ సిరిసంపదలను సంపాదించి, క్షుధార్తులై, మృగప్రాయులై మనుచున్న యిరువదికోట్లజనుల బాగోగుల నిసుమంతయుఁ దలపెట్టక, మేలిదుస్తులను నగలను సింగారించుకొని కులుకుచు సంచరించువారి నేమనవచ్చునో తెలియకున్నది! సోదరులారా! మనము నిర్ధనులమను మాట నిజమే, ఊరును పేరును లేనివారమనుట నిజమే; కాని యిట్టివారే భగవత్కార్యముల నొనర్చుటకు సాధనభూతులై యున్నారు. మిమ్మందఱను బరమేశ్వరుఁ డనుగ్రహించుఁ గాక!

—ఆప్తుఁడు, వివేకానందుఁడు.

(71)

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 1894.

ప్రీతిభాజన—,...నిజమైన పారమార్థికుఁడగు వాఁడు సదా యుదారహృదయుఁడై యుండును. వాని ప్రేమయే—వాని నట్లు వర్తింపఁ బురికొల్పును. ఇఁకఁ గక్షలతోఁ, కార్పణ్యములతో, స్వార్థపరత్వముతోఁ గూడిన 'లౌక్య

ము'ను మతతత్త్వములందుఁ గలుపువారో, సంకుచితబుద్ధులు, దుర్మార్గులునై మసలుట విధాయకము—మతమనునది, ధర్మమనునది, వారిదృష్టిలో వర్తకము.

—సదా మీసోదరుఁడు, వివేకానందుఁడు.

(72)

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 1894.

ప్రేమాస్పద—, ఒక కథ చెప్పెదను, వినుము. దారిని షికారుచేయుచు, నొక సోమరి యింటిగుమ్మముకడఁ గూర్చుండియున్న యొక వృద్ధుని జూచి యాఁగి, "యీ తా విచటి కెంతదూరము ?" అని యడిగెను. వృద్ధుఁడు మాటాడక యూరకుండెను. బాటసారి మఱలమఱల నడిగెను. ఐనను సమాధానము రాలేదు. విసుగుకొనుచు, సణుగుకొనుచు బాటసారి గిఱ్ఱునఁ దిరిగి పోఁబోవుచుండ, ముదుసలి లేచి, "యీ తావిక్కడికొక మైలుదూరముండు"ననెను. బాటసారి, "ఆమాట ముందే చెప్పలేకపోయినావఁటయ్యా!" యనెను. ముదుసలి యిట్లు జబాబిచ్చెను : "లేదు, అప్పుడు నీవు తచ్చాడుచు, ముందునకుఁ బోవుట కలత్యముగా నున్నట్లు కనఁబడితివి ; ఇప్పుడో, చఱ్ఱునబయలుదేఱి పోవుటకు సిద్ధపడితివి, అందుచే సమాధానము నొందుటకు నీకు హక్కు గలిగినది."

నాయనా ! ఈ కథ నీవు మఱచిపోవుగద ! కృషి చేయుము, మిగిలినదంతయు స్వయముగనే సిద్ధించును. "అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే,

తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ —ఎవరితరచింతలులేక నన్నే యుపాసించుచుందురో వారి యోగక్షేమములను నేను వహింతును'' అనెడి గీతా వాక్యము యథార్థముకాని కలకాదు, కల్లకాదు.

...ప్రస్తుతము మనయుద్యమము మతప్రచారమానవ సేవారూపమున సాగవలయును మీరు ప్రతివారము సమావేశమగుటకుఁ దగిన తావు నెన్నుకొనుఁడు, అచట ప్రార్థనాదులను జరిపి, భాష్యసహితముగా నుపనిషత్తులను బఠించుచు, మెల్లఁగా విద్యనార్జించుచుఁ, బని సాగింపుఁడు. ఉద్యమమునకు మీరు పూనుకొనినయెడల సర్వము మీకు సంప్రాప్తమగును.

...ఉద్యమమున నిమగ్నుఁడవు కావలయును. ఇది కేవలప్రారంభము. ప్రతిజాతియుఁ, బ్రతిసంఘమును దన్నుఁదానే యుద్ధరించుకొవలయును ; సనాతనధర్మపునరుద్ధరణార్థ మమెరికానుండి ధనము వచ్చునని నిరీక్షించుచు మీరు గూర్చుండరాదు, అది కేవలము పిచ్చిభ్రమ. ఒక కేంద్రస్థానముండుట చాల మంచిది; చెన్నపట్టణమువంటి పెద్దపట్టణములో నట్టి తావును సంపాదింపఁ బ్రయత్నింపుఁడు, అచటినుండి నల్దిక్కులను మీ ప్రభావము వ్యాప్తిచెందవలయును. నెమ్మదిగా నారంభింపుఁడు. మతస్థులుగాకున్నను మతప్రచారకులగు నితరులు కొలఁదిమందితో నుద్యమ మారంభింపుఁడు, జీవితమంతయు నుద్యమమునకుఁగాను ధారపోయువారు క్రమముగా లభింతురు. ఎన్నఁడును నాధిపత్యము నెఱపఁ బ్రయ

త్నింపకుము. ఉత్తమసేవకుఁడగువాఁడే యుత్తమపరిపాలకుఁడు. ప్రాణభయముకలిగినను సత్యవ్రతమును ధర్మదీక్షను వీడకుము. కృషియే మనకు వలయునది. పేరుప్రతిష్ఠలతోఁగాని సిరిసంపదలతోఁగాని మనకుఁ బనిలేదు....ధీరులై వర్తింపుఁడు. ...ఉద్యమనిర్వహణార్థము ధనము ప్రోగు చేయుటకుఁగాను చెన్నపురిపౌరులకు శ్రద్ధఁ గలుగఁజేయఁ బ్రయత్నింపుఁడు....స్వార్థవిరహితులై వర్తింపుఁడు, తప్పక విజయము నందుదురు.

కార్యనిర్వహణార్థము నావత్స లవసరమగుచో, అగ్నికీలలలో దుముకుటకు సంసిద్ధులు కావలయును. కృషి చేయుఁడు, తీవ్రకృషిచేయుఁడు, ఫలాఫలములనుగూర్చియు లాభనష్టములనుగూర్చియుఁ దరువాత నాలోచించుకొనవచ్చును. సహనము, కార్యదీక్ష, నైర్మల్యము—ఇవియే మీకు వలయునవి.

...హిందూమతమునుగూర్చి యిపుడు నే నేగ్రంథమును వ్రాయుటలేదు; నా భావములను దిఙ్మాత్రముగా వ్రాయుచున్నాను. వానిని బ్రకటించు టెంతవఱకు సాధ్యమో నాకే తెలియదు. పుస్తకములలో నేమున్నది? లోక మీ వఱకే యర్థరహిత విషయములతోఁ గ్రిక్కిఱిసియున్నది. వేదాంతభావముల ననుసరించి మీరొక పత్రిక నెలకొల్పఁగల్గిన, మన యుద్యమాభివృద్ధికిఁ దోడ్పడును. సమన్వయ భావములను జేపట్టుఁడు, పరులనుగూర్చి లేనిపోని విమర్శలు చేయకుఁడు. లోకమునకు మీసందేశమును దెలుపుఁడు,

మీరు బోధింపవలయు విషయములను బోధించి యూరకుండుఁడు. మిగిలిన దంతయు భగవంతున కెఱుక.

వార్తాపత్రికలను నాకిఁకఁ బంపకుఁడు, క్రైస్తవప్రచారకులు నన్నుగూర్చి చేయువిమర్శలను నేనంతమాత్రము లక్షింపను. నేను వానిని లక్షింపకుండుటచేతనే యిచటి జనులకు నాయందలి గౌరవభావము విశేషము.

...నిజముగా మీరు నా కాప్తులగుచో, నిర్భయులై, అప్రతిహతులై యుండవలయును, సింహసాహసాన్వితులై యుండవలయును. భారతపుత్రులారా! మనము భారతదేశము నేకాక ప్రపంచమునంతను మేల్కొల్ప వలసి యున్నది. అధైర్యమనునది పనికిరాదు. 'లేదు', 'కాదు' అను నాస్తికవాక్యములను నేను వినను. బాధపడినదా?... ప్రాణాంతమునకైనను సత్యనిష్ఠను కార్యదీక్షను వీడకుఁడు! ...ఇందలి కీలకము గురుభక్తి—ప్రాణత్యాగపర్యంతమగు గురుభక్తి. మీ కట్టి గురుభక్తి కలదా? కలదనియే నామనః పూర్వకమగు విశ్వాసము. మీయందు నాకట్టి విశ్వాసము కలదని మీకును దెలియును—కావున కార్యరంగమునఁ బ్రవేశింపుఁడు. మీరు విజయము నందితీరుదురు. మీ రేమి తలపెట్టినను, ఉద్యమించినను, అడుగడుగునను నా యాశీస్సులును బ్రార్థనలును మిమ్ము వెంబడించును. ఓర్పుకలిగి పనిచేయుఁడు. ఎల్లరయెడలను సహనము కలిగి వర్తింపుఁడు. మీ రందఱును నాకుఁ బ్రేమపాత్రులే. మిమ్ములను నేను గనుఁగొనుచునే యున్నాను, ముందంజవేయుఁడు! వెను

కకుఁ జూడకుఁడు. ఇది కేవల ప్రారంభము, ఇచటి నా చిన్న యుద్యమము భారత దేశమున బ్రహ్మాండమైన యుత్సాహ మును వెలువరించును, తెలిసినదా? కావున నేను దొందర పడి రారాదు. ఇచట నేదిట్టుననుఁ గొంత శాశ్వతమైన కార్యమును సాధింపవలయునని నా సంకల్పము, అనుదిన మా సంకల్పముతోడనే కృషి చేయుచున్నాను. అమెరికా దేశీయులకు నాయందలి విశ్వాసము నానాఁటి కభివృద్ధి చెందు చున్నది....మీహృదయములను నాశయములను విశ్వవిశాల మొనరింపుఁడు. సంస్కృతమును—ముఖ్యముగా వేదాంత భాష్యత్రయము — నభ్యసింపుఁడు. నాకెన్నియో భావి కార్యాలోచనలు కలవు. కావున నీవు కార్యభారమును వహింప సంసిద్ధుఁడవై యుండవలయును. సభ్యులను సమ్మో హితుల నొనర్చు మహావక్తనగుటకుఁ బ్రయత్నింపవల యును. శ్రద్ధయున్నచో సమస్తము చేకూరును. ఈసంగతి నచటి నావత్సలందఱకును దెలియఁజేయుము. క్రమముగా వారు చేయుకార్యములు లోకమున కాశ్చర్యజనకములు కాఁగలవు. ధైర్యోత్సాహములతోఁ బనిచేయుము....నిష్క పటినై యుండుము. నీ యుద్యమమును నాశయములను వీడ కుము. మీరింతవఱ కొనర్చిన కార్యములు నాకాశా జనకములై యున్నవి, కావున ముందంజవేయుచు ఘనతర కార్యముల నొనర్పుఁడు.

జనులతోఁ గలహింపకుఁడు, ఎవ్వరిని విరోధులను జేసికొనకుఁడు. ఏ పుల్లయ్యలో, ఎల్లయ్యలో క్రైస్తవులైనా రని మనమెందులకు విచారపడవలయును? వారికేమత

మనుకూలించునో యామతమునే యవలంబింపనిండు. వాగ్వాదములలో మనమేల కలుగఁజేసికొనవలయును? జనుల వివిధభావములయెడ సహనముగలిగి వర్తింపుఁడు. సహనము, నైర్మల్యము, కార్యదీక్ష—ఇవియే యెన్నఁటికైనను జయించునవి.

—మీ వివేకానందుఁడు

## (73)

## శ్రీ ఖేత్రిమహారాజునకు వ్రాయఁబడిన లేఖ

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 1894.

..."నగృహం గృహమిత్యాహుః గృహిణీ గృహముచ్యతే—ఇల్లనఁగా గోడలును ద్వారబంధములునుగావు, ఇల్లాలే యిల్లు" అని యొక సంస్కృతకవి పలుకును. ఎంత యథార్థము! శీతాతపములనుండి మిమ్ముఁగాపాడునిల్లు దానికాధారభూతములగు స్తంభములనుబట్టి—అవి యెంతదివ్యమైనవి గానిండు—ఇట్టిదని నిర్ణయింపరాదు, ఇంటికి నిజముగాఁ బ్రాపగు నిల్లాలిని బట్టియే యింటిని నిర్ణయింపనగును. ఈ నియమము ననుసరించి చూచినచో, నమెరికావారి యిండ్లు లోకమందలి మఱియేయిండ్లకును దీసిపోవు.

అమెరికాగృహములనుగుఱించి నేననేక గాథలను వినియున్నాను—స్వాతంత్ర్యమనునది విశృంఖల వర్తనములోనికి దిగుచున్నదనియు స్త్రీత్వములేనిస్త్రీలు స్వాతంత్ర్యము పేర గృహజీవనశాంతిసౌఖ్యముల నొడలెఱుఁగని పిపమునఁ నశింపఁజేయుచున్నారనియు—నింక నేమేమో యర్థరహితప్రలాపములను వినియున్నాను. అమెరికాగృహ

జీవన మెట్టిదో యిపుడొక యేడాదిపాటు స్వానుభవము నొందినపిమ్మట, నా విధమైన యభిప్రాయ మెంత నిరాధార మైనదియో, యెంత దురభిప్రాయమో, తెలియవచ్చుచున్నది! అమెరికామాతలారా! నూఱుజన్మములెత్తినను మీయెడ నాకృతజ్ఞతాఋణమును దీర్చుకొనఁజాలను. మీకు నా కృతజ్ఞత యిట్టిదని తెలుపుటకు మాటలు చాలవు. ప్రాచ్యుల యతిశయోక్తియే ప్రాచ్యుల కృతజ్ఞతాతిశయమును దెలుపఁజాలును— "హిందూమహాసముద్రమే సిరాయును మహోన్నత హిమాలయపర్వతమే లేఖినియు భూతలమే కాగితమును గాలమే లేఖకుఁడు నైయున్నను * మీయెడ నాకృతజ్ఞతను వెల్లడింపఁజాలవు!"

పేరుప్రతిష్ఠలుగాని, విదేశీయుల పరిచయము సంపాదింపఁదగిన పాండితిగాని లేని పకీరునై, నిస్సహాయుఁడనై, యతిదూరదేశమునుండి గతసంవత్సరము వేసవికాలమున నే నీదేశమునకు వచ్చినాను; అమెరికాస్త్రీలే నా నెచ్చెలులైరి, అన్నపానము లొసఁగి నన్ను రక్షించిరి, తమయిండ్లకుఁ దీసికొని వెడలి, తమ సోదరునివలెఁ, దమ పుత్రునివలె నన్నాదరించిరి. "ఈభయంకరుని"—"ఈ క్రైస్తవమతబాహ్యుని" (Dangerous Heathen) విడనాడుఁడని తమ మతాచార్యులే తమ్ముఁ బ్రోత్సహింపఁ బూనుచున్నను —"అజ్ఞాతుఁడును బహుశః ఆతతాయియునగు నీ విదేశీయుని జేరదీయకుఁ" డని తమమిత్రులే తమ కుపదేశించు

* శివమహిమ్నస్తోత్రము ననుసరించి కూర్పఁబడినది.

చున్నను గూడ నమెరికామాతలు నాకెచ్చెలులై, నాకు బాసటమైనిల్చిరి. వారే నాస్వభావవర్తనములను బాగుగాఁ బరిశీలింపఁగలిగిరి—నిర్మలమైన యద్దమేగదా ప్రతిబింబమును జక్కఁగా గ్రహింపఁగలుగును!

మఱియు నమెరికాదేశమున నేనెన్నియో యానంద నిలయములగు గృహములను గాంచియున్నాను; అనిర్వాచనీయమనఁదగు వినిర్మలశీలముతోఁ, బుత్రవాత్సల్యముతో నొప్పారు సతీమతల్లుల నెందఱనో కనియున్నాను; ఉత్తమోత్తమమగు విద్యచేఁ, బరిజ్ఞానముచేఁ, బారమార్థిక సంపదచే విభూషితలు, హిమసన్నిభవినిర్మలమానసలు నగు కన్యకామతల్లులను బుత్రీమతల్లులను నెందఱనో కాంచి యున్నాను! అగుచో, "గంధర్వస్త్రీలతో"—స్వైర విహారిణులతో—నమెరికాదేశము నిండియున్నదని చెప్పఁ జెల్లునా? మంచిచెడుగులనునవి యెల్లెడలను నుండునను మాట నిజమే—కాని దుర్జనులనఁబడెడి బలహీనులను బట్టి మనమొక జాతి గుణస్వభావములను నిర్ణయింపఁదగదు,—జాతీయవాహినియందు వారు వెనుకఁబడియుండు చెత్త వంటివారు; జాతీయ జీవనప్రవాహము వినిర్మలము, అనర్గళమునై యెట్లు ప్రవహించుచున్నదో తెలుపు యోగ్యులను నుదారహృదయులను భావనాత్ములను బట్టి జాతీయ జీవనస్వభావమును గ్రహింపవలయును.

నేలపైఁగుప్పలుగాఁ బడియుండుఁగాక—కనుగాయలను గుంటికాయలను బుచ్చుకాయలను బట్టి మామిడిచెట్లును

మామిడిపండ్లను నిట్టివని నిర్ణయింపఁదగునా ? ఎదుగఁజాలని వందలకొలఁది కాయలుకాక, బాగుగానెదిగి పరిపక్వమైన యొక్కపండున్నను, అదియే మామిడిచెట్టు యోగ్యతను ప్రయోజనమును శక్తిసామర్థ్యములను ప్రకటించును.

నేఁటియమెరికాస్త్రీల విషయమున వారి యుదార బుద్ధిని నేను గొనియాడుదును. ఈదేశమున నుదార హృదయులగు పురుషులను—అత్యంతసంకుచిత సంప్రదాయములందు సైతము—నే ననేకులను జూచియున్నాను, కాని భేదమిది—మతతత్త్వములను బారమార్థికశీలమును నలక్ష్యముచేసి వారుదారదృష్టి నవలంబింతురు—స్త్రీలన్ననో, స్వీయమతతత్త్వముల నిసుమంతయు వీడకయే యన్నిటి యందునుగల మంచిని గ్రహించు సానుభూతికతన నుదార దృష్టి నవలంబింతురు. వలయునది సమన్వయభావముకాని నిరాకరణభావము కాదని— కలుపుకొనుటయేకాని తీసి వేయుట కాదని—స్వతస్సిద్ధముగా వారికిఁ దెలియును....

షికాగోలో జరిగిన ప్రపంచవస్తుప్రదర్శన మేమి మహాద్భుతసంఘటనము! ఇఁకఁ బ్రపంచమందలి నానా భాగములనుండియు నానావాణులును దమతమ మతాశయములను బ్రకటించిన యా యద్భుత విశ్వమతమహాసభయో! డాక్టర్ బారోస్ (Dr. Barrows), బానీ (Bonney) యను వారి ధర్మమాయని నేనును నాభావములను సభాముఖమున వెల్లడింప ననుమతి నొందితిని. బానీదొర నిజముగా మహాద్భుతవ్యక్తి! మహోత్కృష్టకార్యమును నిర్వహించుచు,

బ్రహ్మాండమైన కార్యక్రమమును నిర్మించి, దాని నఖండజయ
ప్రదముగా నిర్వహింపఁగలిగిన యాతని ధీశక్తి యెట్టిదో
యోచింపుఁడు ; ఆతఁడు మతాచార్యుఁడు కాఁడు, కేవలము
న్యాయవాది (Lawyer): ఐనను సర్వమతాచార్యుల
తోడను బీఠాధిపతులతోడను గూడిన ప్రపంచమతమహాసభ
కధ్యక్షత వహింపఁగలిగిన యాప్రాజ్ఞుఁడు, మధురభాషి,
శాంతమూర్తి, తన యుదారహృదయమును వేనోళ్లఁ జాటు
కాంతిమంతములగు కన్నులతోఁగూడిన యా బానీవార
యెంతటి మహనీయుఁడో భావింపుఁడు....

—మీ వివేకానందుఁడు.

(74)

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 1894.

ప్రేమాస్పద—, ...పత్రికలలో నన్ను గూర్చి యెవ్వరేమి వ్రాసినను—అనుకూలముగాఁగానిమ్ము, ప్రతికూలముగాఁగానిమ్ము—వ్రాయనిమ్ము, లేశమును నీవు దానిని గమనింపరాదు. నాయనా! ఇఁకముందిట్టి పత్రికలను గట్టలకొలఁదియు దట్టలకొలఁదియు నాకుఁ బంపవలదని మాత్రము పదేపదే నిన్ను బ్రార్థించెదను.—విశ్రాంతిమాట యిపుడెట్లు తలపెట్టుట? ఈ శరీర పతనానంతరముమాత్రమే మన కేమైనను విశ్రాంతి. సోదరా! దేశమంతయు దివ్యోత్సాహపరవశమగునట్లు నీవొకసారి యుత్సవము * జరుపుము. ఆహా! దిగ్విజయము! ప్రేమోత్తుంగతరంగమునఁ బ్రతి

* శ్రీరామకృష్ణ జన్మదినోత్సవము

పక్షులును నిందకులును నెల్లరను గొట్టుకొనిపోవలయును! ఏమనుకొనుచున్నారో! గజేంద్రములు మీరు! చీమ కుట్టునని వెఱచుటయా!

...కన్నులును జెవులును రెండు రెండేకాని నోరొక్కటియే—ఈసంగతి సదా జ్ఞప్తిలో నుంచుకొనుము! మూకీభావము, మూకీభావము, మూకీభావము! "న హి కల్యాణకృత్ కశ్చిద్దుర్గతిం తాతగచ్ఛతి"—నాయనా! మంచిచేయువాఁడెన్నఁడును దుర్గతి నొందఁడునుమీ! ఆహా! భయపడుటయా? నాయనా! ఎవరిని జూచి? ఇచటి మిష నరీలును నీ బాపతువ్యక్తులును నఱచియఱచి, తుదకు నోరు కట్టుపడి యూరకున్నారు—లోకమంతయు నేకమైనను జేయున దేమి? ఇంతేకదా!—

నిన్దన్తు నీతినిపుణాః యది వా స్తువన్తు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్,
అద్యైవ వా మరణమస్తు యుగాన్తరే వా
న్యాయ్యాత్పథః ప్రవిచలన్తి పదం న ధీరాః.

"తమ్ము నీతివేత్తలు దూషింతురుగాక, భూషింతురుగాక; లక్ష్మీకటాక్షము కలుగుఁగాక, ఇంట దారిద్ర్యదేవత తాండవించుఁగాక; ఇప్పుడే మరణము సంభవించుఁగాక, యుగాంతమందుఁ గలుగుఁగాక: ధీరులగువారు న్యాయ్యమార్గమును దప్పరు." *

* భర్తృహరి సుభాషితము, 1-74.

సామాన్యజనులతో—జడులతో—నీవు చెట్టాపట్ట ములు పైచుకొని తిరుగనక్కఱలేదు, వారిని యాచింపను నక్కఱలేదు. భగవానుఁడే సర్వము సమకూర్చుచున్నాఁడు, ముందును సమకూర్పఁగలఁడు. నాయనా! భయమెందు లకు? మహావిఘ్నములు లేనిదే ఘనకార్యములెన్నఁడు కొనసాగినవి? హే సింహ! కురుపౌరుషమాస్థానః, ఉపేక్షితవ్యా జనాః సుకృపణాః కామకాఞ్చన వశగాః—(హే సింహా! నీపౌరుషమును ప్రకటింపుము, కామకాంచనవశవర్తులగు సామాన్యజనులుపేక్షింపఁదగినవారు.) ఈ దేశమున నాకిపుడు స్థానబలము కలిగినది, కావున నాకిఁక సాయమక్కఱలేదు. కాని సోదరప్రేమమూలమున నాకుఁ గొడ్పడవలయునను నాత్రముచే మీలో బయల్వెడలిన పౌరుషమును దీవ్ర భావమును నారాయణసేవకై వినియోగింపవలయునని మీకందఱకును నా ప్రార్థన. ముఖ్యముగా నుపయోగకర మని తోఁచిననేకాని నీహృదయమును నెవ్వరికిని వెల్లడిం పకుము. ప్రబలవిరోధిపట్లనైనను హితము, ప్రియమునగు మాటలనే వినియోగింపుము. నాయనా! ధనభోగయశో వాంఛలు ప్రతిమానవునకును సహజము, మఱియు నుభయ తారకముగా—నఁగా రామునిఁ గామునిఁగూడ సేవింప ననుకూలించునట్లు—తోఁచునెడల నెల్లరును మహోత్సాహ మును బ్రకటింతురు. పరగుణములను గోరంతలు కొండం తలుచేసి కొనియాడుచు, సదా లోక కల్యాణమును గోరి వర్తించువారేకదా మహాత్ములు—"పరగుణ పరమాణూం పర్వతీకృత్య," అపిచ, "త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీయ

మానః” ఇత్యాది. * కావున సర్వమనాత్మయనియు జడమనియు భావించు జనులను బాల్యచేష్టలు చేయనిమ్ము, ఇది తమకుఁ గొఱకరాని కొయ్యయని తెలిసినంతనే వారే విడిచిపెట్టుదురు! చంద్రునిపై నుమియఁ బ్రయత్నించుచోఁ దిరిగి తమమీఁదనే పడునుగదా! శుభం భవతు తేషామ్! వారిలో సత్తైనను జవసత్త్వములనునవి యున్నచో, వారి విజయము నెవ్వ రరికట్టఁగలరు? కాని యది యసూయాసంజనితదంభమైనచో, నంతయు నిష్ప్రయోజనము. . . కాని మన దేశములోఁ జెల్లునట్టి మతమిచటఁ జెల్లదని మీరు గ్రహింపవలయును. జనుల యభిరుచికి మీరు దానిని సరిపడునట్లు చేయవలయును. మీరు వీరిని హిందువులు కండని చెప్పినపక్షమున మనము క్రైస్తవ మిషనరీలయెడ వర్తించునట్లు వీరందఱును మీ బారినుండి తప్పించుకొని మిమ్ము ద్వేషింప నారంభింతురు. హిందువుల వేదశాస్త్రములందలి కొన్ని భావములను వీ రామోదింతురు—అంతవఱకే. అంతకంటె విశేషమేమియు లేదని మీరు గ్రహింపవలయును. పురుషులలో ననేకులు, “మతసంబంధమైన గొడవలు మాకక్కఱలే” దందురు. స్త్రీలు కొంచె మభిరుచి కనఁబఱతురు—అంతవఱకే, కాని మోతాదు మించనీయరు! కొన్ని వేలమంది జనుల కద్వైతసిద్ధాంతమున నమ్మకము కలదు. కాని యే తంత్రములనుగూర్చియో, వర్ణవ్యవస్థను గూర్చియో, స్త్రీలనుగూర్చియో మీ రేకరువుపెట్ట మొదలు

* భర్తృహరి నీతిశతకము, 70.

పెట్టినచో, "చిత్తము, సెలవుతీసికొందుము" అని తొలఁగుదురు. సర్వము క్రమముగా జరుగవలయును. సహనము, నైర్మల్యము, కార్యదీక్ష—ఇవియే మనకు వలయునవి.

—మీ వివేకానందుఁడు.

(75)

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 1894.

అభిన్నహృదయ—, నీ లేఖ యిప్పుడే అందినది. ఇతరమైన నా లేఖలు మీ కీపాటి కందియుండవచ్చును. వానినిబట్టి యమెరికా కిఁక నేమియుఁ బంపనక్కఱలేదని నీవు గ్రహించియుండవచ్చును. "అతి సర్వత్ర వర్జయేత్." ఈ పత్రికా ఘోష జనులకు నాయందుఁ బ్రీతి కలుగఁ జేసినదనుటకు సందియములేదు, కాని తత్ఫలిత మిచటికంటె హిందూదేశముననే విశేషము. నిరంతరఘోష యిచటి యుత్తమవర్గములకు వెగటు కలుగఁజేయును. కావున నిఁకఁ జాలును. ఇప్పుడీ సభలను బురస్కరించుకొని హిందూదేశమున మీ రొక సంఘముగా నేర్పడఁ బ్రయత్నింపుఁడు. ఈ దేశమున కిఁక మీ రేమియుఁ బంపనక్కఱలేదు. ధనవిషయమున, మాతృదేవి* నిమిత్తము—మొదట స్త్రీల కొక నివాసస్థలము గావలయును గాన—ఏదో యొక నివేశనము నిర్మింప నిశ్చయించుకొనియున్నాను. మాతృదేవి నివాసమునకుఁ దగిన తావునిమిత్తము సుమారు రెండు వేలరూపాయిలను బంపఁగలను. ఆ స్థలము దొరికిన నాకు మఱే చింతయు నుండదు.

* గురుపత్నియగు శ్రీ శారదామణీదేవి.

నేనిచటినుండి వచ్చినను, ఈ దేశమునుండి సాలునకు
రూ. 1,600 లు రాఁగలవని నా యాశయము. శ్రీనిలయ
సంగతిఁగాగ్థ మా ధనమును మీ కప్పగింతును; అపుడది
వృద్ధిపొందును, స్థలము సంపాదింపుమని నే నిదివఱకే వ్రాసి
యున్నానుగదా....

ఇంతకుముందుఁగనే హిందూదేశమునకు వచ్చియుం
దును, కాని హిందూదేశములో డబ్బు లేదు. వేలకొలఁది
మంది రామకృష్ణపరమహంసను బూజింతురు, కాని యొక
పైసనిచ్చువారెవ్వరును గాన్పింపరు,—హిందూదేశస్థితి
యిటులున్నది....ఏమైన నొండొరులతోఁ బొత్తుగలిగి మను
చుండుఁడు. నియమములను లోకము లేశమును బాటింపదు,
కాని వ్యక్తులను గణించును. తమకిచ్చవచ్చిన వానిమాట
లను—అవి వట్టిప్రలాపములై యుండుఁగాక—లోకులు చెవు
లప్పగించి విందురు, ఇచ్చగింపరా, ఎంతటివాని మాటలనైనను
వినరు. ఈ విషయము తెలిసికొని నీ నడవడిని దాననుసారము
నియమించుకొనుము, అంతయుఁ జక్కఁబడును. నాయ
కత్వము వహించుచో, సేవకుఁడవై యుండుము—ఇదియే
కీలకము. మాటలు కఠినములై యుండుఁగాక, ప్రేమ
యేభాష నేరూపమును దాల్చియున్నను సహజముగనే
జనులు గ్రహింతురు.

నాయనా! రామకృష్ణపరమహంస సాక్షాత్ భగవంతుఁ
డనుటకు నాకు లేశమును సందియము లేదు, కాని యా
మహనీయుని తత్త్వమును బోధలను జనులను స్వయముగా

నవగాహన చేసికొననిమ్ము—ఈ విషయమున నీ యభిప్రాయమునే వా రవలంబింపవలయునను పట్టుదల పనికిరాదు—ఇదియే నా యాక్షేపణ.

తమతమ యభిప్రాయములను జనులు ప్రకటింతురు గాక, కాని మన మెందులకు మన యభిప్రాయములను జాట వలయును? రామకృష్ణపరమహంస బోధలను దత్త్వమును నవగాహన చేసికొననిదే వేదవేదాంత భాగవత పురాణాదుల తత్త్వము నెవ్వరును నెన్నటికిని గ్రహింపఁజాలరు. శ్రీరామకృష్ణుని జీవితము దివ్యజ్యోతి—తత్కిరణప్రసారమున భారతీయ పారమార్థిక విజ్ఞానమంతయు సుప్రకాశితమై వెలయును, వేదములకే కాక, వేదగమ్యమునకును నాతనిజీవితము జీవద్భాష్యము. భారతజాతీయ ధార్మిక విజ్ఞానకల్పమునంతను నాతఁ డొక్క జీవితకాలమున జీవించెను.

శ్రీకృష్ణభగవానుఁ డసలు జన్మించెనా యను విషయము మనము నిర్ణయింపఁజాలము; బుద్ధుఁడు, చైతన్యుఁడు మున్నగు నవతారమూర్తు లొకేస్వరమున నొకేపాట పాడిరి; రామకృష్ణపరమహంసయో, అతినవీనుఁడు, అఖండ పరిపూర్ణుఁడు. జ్ఞానభక్తివైరాగ్యములు, ఔదార్యము, విశ్వమానవసేవేచ్ఛ—ఇవన్నియుఁ గేంద్రీకృతమై యాతని యందు మూర్తీభవించినవి. కావున రామకృష్ణునకు సాటి యెవ్వరు? ఆతని గణుతింపఁజాలని వాని జన్మము నిరర్థకము! జన్మజన్మాంతరములందును నాతని సేవకుఁడ నగుటయే నా మహాభాగ్యముగా గణింతును. ఆతఁ డాడిన యొక్కమాట

వేదవేదాంతములకంటెను నాకు విశేషమాననీయము. తస్య దాసదాసదాసోఽహమ్—ఆహా! ఆతని 'దాసదాసానుదాసుఁ' డను నేను. సంకుచితబుద్ధియు స్వమతదురభిమానమును నాతని సిద్ధాంతములకుఁ గేవల విరుద్ధము. సంకుచితబుద్ధి యనిన నా కొండలుమంట. ఆతని పేరు విస్మరింపఁబడినను సరియే, ఆతనియుపదేశములు మాత్రము ఫలించుఁగాక! ఆతఁడు పేరుప్రతిష్ఠల కేమైన దాసుఁడా? కొందఱు పల్లెవాండ్రును నిరక్షరకుక్షులును నేసుక్రీస్తును దేవుఁ డనిరి, కాని చదువుకొనినవా రాతనిఁ జంపిరి. కొందఱువర్తకుల వలనను బసులకాపరులవలనను బుద్ధుఁడు తన జీవితకాలమున గౌరవము నందెను. కాని రామకృష్ణపరమహంసదేవా, తన జీవితకాలమున— ఈ పందొమ్మిదవశతాబ్దమున— విశ్వవిద్యాలయరాక్షసులచేఁ బూజలనందెను... వారిని(కృష్ణుఁడు, బుద్ధుఁడు, క్రీస్తు మొదలగువారిని) గూర్చి యేవో కొలఁది విషయములు పుస్తకములలోఁ జెప్పఁబడినవి. "పెరటి చెట్టు మందునకు రా" దందురు. కాని మన మెవ్వరితో సహర్నిశము సహవాసము చేసితిమో, అట్టి యీవ్యక్తిని వారందఱికంటెను మహనీయునిగాఁ బరిగణించుచున్నాము. బోధపడినదా?

అద్భుతమగు మాతృదేవిజీవితార్థము, జీవిత ప్రాముఖ్యము, నీకు—నీకననేల—మీలో నెవ్వరికిని నింకను బోధపడలేదు. కాని క్రమముగాఁ దెలియఁగలదు. 'శక్తి' వినా లోకమునకుఁ బునర్జీవనములేదు. సమస్తదేశములందును మనదేశ మతిబలహీనమై వెనుకఁబడియుండుటకు

హేతువేమి? 'శక్తి' యిచట నగౌరవింపఁబడుటయే. భారతదేశమున నా యద్భుతశక్తిని బునర్జీవింపఁ జేయుటకే మాతృదేవి యవతరించినది; ఆమెను మూలాధారముగాఁ జేసికొని గార్గులును మైత్రేయులును లోకమున మరలఁ బ్రభవింతురు. నాయనా! నీ కిపుడు తెలియకున్నది. కాని క్రమముగా నంతయుఁ దెలియఁగలదు. అందుచే నాకు మొట్టమొదటఁ గావలయున దామెమఠము... 'శక్తికటాక్షము' లేనిదే యేమియు సాధింపఁజాలము. అమెరికా, ఐరోపాఖండములలో నాకు గోచరించిన దేమి?—శక్తిపూజ, శక్తిపూజ, కాని తెలియక వారామెను (శక్తిని) నింద్రియతృప్తికై యారాధించుచున్నారు. అకలంకహృదయముతో, శుద్ధసాత్త్వికభావముతో, శక్తిని దమమాతృదేవతగా నారాధించువా రెట్టి శ్రేయము నొందుదురో యూహింపుము! నానాఁటికి నాకు సంగతులు విస్పష్టమగుచున్నవి, దృష్టి వికసించుచున్నది. కావున మాతృదేవికై మొదట మనము మఠము నిర్మింపవలయును. మొదట మాతృదేవియు నామె కుమార్తెలును, తరువాతఁ దండ్రియు నాతని పుత్రులును—బోధపడినదా? తండ్రికటాక్షముకంటె తల్లికటాక్షము నాకుఁ గోటిరెట్లు మాననీయము. మాతృదేవియనుగ్రహమును నాశీస్సులును నన్నియు నాకు వరప్రసాదములు... దయయుంచి నన్ను మన్నింపుము. అమ్మవిషయమున నాకుఁ గొంచెము పిచ్చి పట్టుదల. అమ్మ యాజ్ఞాపించినఁ జాలును, ఆమె 'భూతములు' ఏమైనను సాధింపఁగలవు. నాయనా! నే నమెరికాకు వెళ్లుటకుముందు నన్నాశీర్వదింపుమని యమ్మకు (శ్రీ

శారదా దేవికి) వ్రాసినాను. ఆమె యాశీస్సులు లభించినవి, ఒక్క దుముకున సముద్రము లంఘించినాను. చూచితివా ! (ఆమె మహిమ!) ఈఘోర శీత కాలమున నొక చోటినుండి మఱియొక చోటికి వెళ్లి యుపన్యసించుచు, మాతృదేవి మఠ నిర్మాణార్థము ధనము వసూలుచేయుటకై ఘోరపరిస్థితుల నెదుర్కొనుచున్నాను....పోట్లాడెడి స్వభావముగలవాఁడు, కాని మాతృదేవియం దాతనికి విశేషభక్తి, అందుచే నాతనివిచ్చిచేష్టల నన్నిటిని నేను సులభముగా సహింపఁ గలను. ఇపు డాతఁ డద్భుతమైన పనిచేయుచున్నాఁడు. నా కిచట స్థానబలము చేకూరినది. చెన్నపురి పౌరులతో నేకీభవించుటలో నీవును జక్కనిపని చేసినావు. నాయనా ! నీపై నేనెంతో యాశపెట్టుకొనియున్నాను. ఏకీభవించి కృషి చేయుటకుఁగాను నీ నందఱిని నొక కట్టుపాటులోనికిఁ దీసికొనిరావలయును, మాతృదేవినిమిత్తము నీవు స్థలము సంపాదించినంతనే తిన్నఁగా నేను హిందూదేశము వచ్చెదను. స్థలము విశాలమైనదై యుండవలయును; మట్టియింటితో ప్రారంభింపవచ్చును ; క్రమముగా నేను మంచి భవనమును నిర్మింతును, భయపడకు.

మన్నెపుజ్వరమునకు ముఖ్యకారణము జలదోషము. నీరు వడియఁగట్టు సాధనములను రెండు మూఁడింటిని నీవేల తయారుచేయరాదు ? నీటిని గాఁచినపిమ్మట వడఁబోసిన [illegible]ముస బాధలేకుండును. క్రిమిభయము కలుగనీయని వడఁబోత సాధనములను (Pasteur's bacteria-proof filters) పెద్ద వానిని రెంటిని గొనుఁడు. ఆ నీటితో వంట

చేసి, త్రాగుటకును దానినే యుపయోగించినపక్షమున మన్నువుజ్వాక మీక హేటుమాయమై పోవును....

ముందంజవేయుఁడు, కృషిచేయుఁడు, ప్రచండ దీక్షతోఁ గృషిచేయుఁడు—ఇది కేవల ప్రారంభము.

—సదా మీ వివేకానందుఁడు.

## మొదటిభాగము సమాప్తము

శ్రీ రామకృష్ణార్పణమస్తు

# అనుక్రమణిక

స్త్రీలు వీధిలో నడచుటకుఁగూడ జంకుచుందురు! నాయెడ వారిదయ వర్ణనాతీతము. నే నిచటికి వచ్చిననాఁటినుండియు దమయింద్లకు నన్నాహ్వానించి వారు నన్ను ఆదరించుచున్నారు. నాకు భోజన మిడుచున్నారు. ఉపన్యాసముల నేర్పఱచుచున్నారు, బజారునకుఁ దోడ్కొనిపోవుచున్నారు, వేయేల, నా సదుపాయముల నన్నింటిని వారే చూచుచున్నారు. వారికి నా కృతజ్ఞతాఋణమును సహస్రాంశమైనను దీర్పఁజాలను.

నిజమైన "శక్త్యుపాసకుఁడు" ఎవ్వరో మీకుఁ దెలియునా? భగవంతుఁడే సర్వజగద్వ్యాప్తమగు శక్తి యని గ్రహించి, స్త్రీని యా శక్తిస్వరూపిణిగా నెవ్వఁడు గాంచునో వాఁడు. ఇచటి పురుషులు అనేకులు స్త్రీలయెడ నిట్టి మనోభావము కలవారు. "యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః" (స్త్రీ లెచట పూజింపఁబడుదురో దేవతలు అచట రమింతురు) అని మనువు వచింపలేదా? ఇచటి పురుషులు యథాయోగ్యముగా స్త్రీల నాదరింతురు — అందుచేతనే వారంతటి విద్యావంతులై, స్వతంత్రలై, శక్తిమతులై శోభించుచున్నారు. మనమో, దాసులమై, నిర్భాగ్యులమై, మృతప్రాయులమై మనుచున్నాము. కారణము తెలియుచునే యున్నది.

ఈ దేశ స్త్రీ లెంతటి వినిర్మల హృదయులో! విశుద్ధ వర్తనలో! ఇరువది, ఇరువదియైదేండ్ల ప్రాయమునకు ముందు ఏ కొలఁదిమందిమాత్రమో పెండ్లియాడుదురు, వియత్తల